

# మల్లాది రామకృష్ణ శాస్త్రి

# కథలు 2

# మల్లాది రామకృష్ణ శాస్త్రి

# కథలు

## రెండవ సంపుటం

**మల్లాది రామకృష్ణ శాస్త్రి**
**శతజయంతి ప్రచురణ (1905–2005)**



**విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్**
విజ్ఞాన భవన్, బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్ - 500 001. ఆం.ప్ర.

# మల్లాది రామకృష్ణశాస్త్రిగారు*

- ఆరుద్ర

మల్లాది రామకృష్ణశాస్త్రిగారిని సముద్రునితో సరిపోల్చడం సమంజసం కాదు. సముద్రుడు గంభీరుడే కావచ్చును. అగాధమైన అంతర్యంగలవాడే కావచ్చును. అయినా నిరంతరం ఆత్మస్తుతి చేసుకుంటున్నట్లు ఘోషిస్తూనే ఉంటాడు. రామకృష్ణశాస్త్రిగారో, మౌనహాసాన్ని ధరించి తృణీకృత భవసాగరులై, చుళుకీకృత విజ్ఞానసముద్రులై కనబడతారు.

వారిని అగస్త్యునితో పోల్చడంకూడా పనికి రాదు. అగస్త్యుడు సముద్రాన్ని ఔపోసనపట్టి మళ్లా వదలిపెట్టాడు. శాస్త్రిగారు వివిధ సాహిత్య సముద్రాలను తమలోనే ఇముడ్చుకున్నారు.

అగస్త్యుడు కుంభసంభవుడైతే శాస్త్రిగారు నిండుకుండ.

ఆయన సంస్కృత పండితుడు. అయినా అసలు సిసలు అచ్చ తెలుగువాడే కథకుడు.

ఆయన ఇంగ్లీషులో నిష్ణాతుడు. అయినా వారి రచనలోని వాక్యాలు తెనుగుదనంతో ఊపిరి పీలుస్తాయి.

ఆయన మనస్సన్యాసి, వసుధైక కుటుంబి, వేదాంతి, వినోది; ఆయన హృదయ వైశాల్యాన్ని సర్వే చేయగల సాధనాలు లేవంటే అతిశయోక్తి కాదు.

బందరులో మల్లాది వారిదీ, పురాణంవారిదీ పేరుబడిన కుటుంబాలు. శాస్త్రిగారు ఒక కుటుంబంలో జన్మించి రెండవదానికి జామాతలైనారు. రెండు వంశాల విశిష్టతలకూ ఏకైక వారసులైనారు.

బందరు స్వస్థానమైనా, పురాణం సూరిశాస్త్రిగారు ఆంధ్రదేశంలోని సాహితీపరు లందరికీ ఆప్తబాంధువులు. బందరులోని వారి స్వగృహం పేరు విద్యానిలయం. అది అక్షరాలా విద్యానిలయమే. ఆ రోజుల్లో సూరిశాస్త్రిగారి స్వంత గ్రంథాలయం వంటిది ఆంధ్రదేశంలో వేరెక్కడా కనబడదు. కొత్తగా వెలుగుచూసిన ఏ ఉత్తమ గ్రంథమైనా సూరిశాస్త్రిగారి విద్యానిలయంలో మరునాడు ఉండవలసినదే. మామగారి గృహ నామధేయం విద్యానిలయమైతే అల్లుడు తానే సచేతన గ్రంథాలయమైనారు.

ఒకనాడు బందరు ఆంధ్రదేశానికి సాంస్కృతిక రాజధాని. చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారు కవితా సింహాసనాన్ని అధిష్ఠించి పద్యాల పచ్చతోరణంకట్టి, సాహితికి నిత్యకళ్యాణం జరిపించేవారు. ముట్నూరు కృష్ణారావుగారు వెల్లపాగా ధరించి దర్బారు కొనసాగించేవారు. ఈ ఇద్దరూ వటవృక్షాలైతే కవులూ, కథకులూ, పండితులూ,

---

* ఈ వ్యాసం ఆరుద్ర వ్యాస సంకలనం "కలంచిత్రాలు" (1979) నుంచి – ప్రచురణకర్తలు.

వివిధ కళాకారులూ విహంగాలై, ఆ విశాల శాఖలపై విశ్రమించేవారు. మల్లాది రామకృష్ణశాస్త్రిగారు ఆ విహంగ సంఘాలతో నేస్తం కట్టిన పుంస్కోకిల. నిండు మనస్సుతో అందరి స్నేహాన్ని ఆకర్షించి ఆకట్టుకొనే అయస్కాంతం. ఆనాడు ఆరోగ్యవంతమైన సాహిత్య వాతావరణంలో సాంస్కృతిక ప్రాణవాయువులు పీల్చుకున్న యువకులు కనుకనే ఇప్పటికీ వారి హృదయం కరుణకాంతులతో అరుణారుణమై ప్రకాశిస్తూ ఉంటుంది.

ఆంధ్రసాహిత్య రంగంలోని అత్యంత వృద్ధుల దగ్గర్నుంచి, క్రొంగ్రొత్త రచయిత దాకా అందరితోనూ ఒకేరకమైన స్నేహభావం వారికుంది. పాతకావ్యాలూ, ప్రాచీన గ్రంథాలూ ఎంత శ్రద్ధగా పరిశీలిస్తారో కొత్త రచయిత రచనలు సైతం అంత ఆసక్తితో చదువుతారు. అప్పటివరకు ముక్కూముఖం ఎరుగని రచయిత వచ్చి వారి పరిచయం చేసుకొని 'నేను ఫలానా పత్రికలో ఫలానా కథ వ్రాశాను' అని చెప్పుకొంటే, ఆ రచయితే వ్రాసి మరిచిపోయిన మరొక రచనను శాస్త్రిగారు జ్ఞాపకం చేయగలరు!

వారికి పుస్తకాలూ, పత్రికలూ కొనడం, అట్టలు వేయడం, చదవడం, భద్రపరచడం ద్వితీయ ప్రకృతి. చెన్నపట్నంలో సెకండ్ హేండ్ పుస్తకాలు విక్రయించే ప్రతి మారుమూల దుకాణదారుడూ శాస్త్రిగారి స్నేహితుడు. విక్రేత రూపాయి ధర చెప్పిన మంచి పుస్తకాన్ని శాస్త్రిగారు రూపాయిన్నర పెట్టి కొనగలిగిన ఉదారులు!

ఆయన ఔదార్యాన్ని కొలవడానికి వీలు చిక్కదు. లెక్కలేనన్ని రచనలు చేసి వాటిని ఇతరుల పేర్లతో ప్రకాశింపజేసిన వితరణశాలి. మల్లాది రామకృష్ణశాస్త్రి గారిని తెలిసినవాళ్ళు వినుకొండ వల్లభరాయడి పేరున శ్రీనాధుడు క్రీడాభిరామం వ్రాసి ఉండవచ్చునని విశ్వసిస్తారు. శాస్త్రిగారి జీవితమూ ఒకప్పుడు క్రీడాభిరామమే; వారి సాహిత్యస్పందన శృంగార శ్రీనాధమే. అనేక శృంగార కావ్యాల అముద్రిత ప్రతులను సేకరించి మిత్రుల్ని ప్రోత్సహించి అచ్చువేయించారు. హంసవింశతి, రాధికాసాంత్వనం మొదలైన కావ్యాల ప్రచురణ శాస్త్రిగారి అమృతహస్తంతోనే జరిగింది.

ఇరవై సంవత్సరాల క్రిందట శాస్త్రిగారు మద్రాసుకు వలస వచ్చారు. నాటినుంచి నేటిదాకా వారి దైనందిన కార్యక్రమం ఒక్కలాగే ఉంది. నిరంతరం స్నేహితులతో సంభాషిస్తున్నట్లే ఉంటారు. నిత్యం సరికొత్త పాత పుస్తకాలు కొంటున్నట్టే ఉంటారు. హామేషా హాస్యోక్తులూ, చమత్కారాలూ వెదజల్లుతూనే ఉంటారు. ఎప్పుడు వృత్తిరీత్యా సినిమా రచనలు చేస్తారో, ఉత్సాహంతో సాహిత్యరచనలు వ్రాస్తారో తెలియనీయరు. బద్ధకం వారి బద్ధవైరి.

శాస్త్రిగారి దస్తూరీ ముద్దులమూట కడుతూ ఉంటుంది. రచన కస్తూరి వాసనలు విరజిమ్ముతూ ఉంటుంది. శాస్త్రిగారి గుండె–తరగని కలకండ.

(1963)

☆ ☆ ☆

మల్లెపూవులాంటి మందహాసం, తెల్లవారుఝామున పైకొనే పవనాంకురాలలోని పరిశుభ్రతను మించిన మనస్సు, మంచుపెట్టెలోంచి తీసిన కదళీ ఫలాలకన్నా కమ్మని మాటకారితనం, ఆ పాకాన పసందుగా పడిన భావాలలోని అపురూప సౌందర్యం

అన్నీ కలసి కట్టుగ మూర్తీభవించిన చల్లని తెలుగుతనానికి మల్లాది రామకృష్ణశాస్త్రిగారు మారుపేరు కానేకారు; అసలు పేరే! నిదానమే ప్రధానమని జీవితంలో ఎన్నడూ బొత్తిగా తత్తరపాటు ఎరుగని ఈ మహామనిషి అరవై సంవత్సరాలు నిండీ నిండగానే తొందరపడి నూరేళ్ళు నిండిపోయాయని తప్పులెక్క కట్టుకొని – ఎక్కడికో... తప్పుకొన్నారు. వ్రాసే కథల్లో మూడేసి చుక్కల – లెక్కలతో భావ విహంగాలను ఎగిరించి, చిన్నచిన్న గీతల – చేయూతలలో వూగాడే కొత్త అర్థాలను నడిపిస్తూ రచనలు చేసే శాస్త్రిగారు తమ జీవిత కథలో మాట నడుమ ఒంటిచుక్క – చాలా పెద్దది పెట్టి వూరుకున్నారు. చేతపట్టిన పుస్తకంలోని చిట్టచివరి అక్షరాన్ని సైతం వదలిపెట్టని మహాపఠిత సగంలోనే తన జీవిత కావ్యాన్ని చదవడం మానేశారు.

మల్లాది రామకృష్ణశాస్త్రిగారు చదువు ఇంతా అంతా కాదు. పుంభావ సరస్వతి అనే పేరుకు తగినవారు ఉన్నారా అంటే తడుముకోకుండా వారే అని ఎవరైనా చెప్పగలరు. తొలినాటి వేదాలలోని మొట్టమొదటి ఋక్కు మొదలుకొని నేటి బీట్నిక్కుల సరికొత్త ఋక్కుల దాకా అన్నీ ఆయనకు కరతలామలకమే. పది భాషలు, పలుమతాలు కాచి వడపోశారు. బందరులో బి.ఏ. మదరాసులో ఎం.ఏ. చదువుకొనే రోజులలో మథించిన సంస్కృత, ఆంధ్ర, ఆంగ్లాలు కాక పాళి, మరాఠీ, గుజరాతీ, బెంగాలీ, హిందీ, ఉర్దూ, కన్నడ భాషలు స్వయంగా నేర్చుకున్నారు. ఒకప్రక్క పాశ్చాత్య సాహిత్యాలు, మరొకప్రక్క ప్రాచ్య విధానాలు సమంగా ఆకళించుకొని స్వంతం చేసుకొన్న కుశాగ్రబుద్ధి శాస్త్రిగారు. ఒకనాడు వేసవిలో కొత్త తాటాకు విసనకర్రతో విసురుకొంటూన్న మిట్టమధ్యాహ్నం ఎవరో 'మీకెన్ని భాషలు వచ్చునండీ' అని ప్రశ్నిస్తే పెన్నుతెరచి ఆ విసనకర్ర వంపులపైన ఆకుకో భాష చొప్పున ఆయన సంతకాలు పెడితే విసనకర్ర రెండోప్రక్కకు తిప్పవలసి వచ్చిందట. ఎన్నిభాషలు నేర్చినా, ఎన్ని మతాలు వెతికినా వారు అన్వేషించేది విజ్ఞానంలోని వెచ్చదనం; అభిలషించేది కళలోని కమ్మతనం.

"కళ అనేది – కంటికి కట్టాలి. తక్షణం వంటికి పట్టాలి. అంగలార్చితే వచ్చేది కాదురా ఆనందం. అంకెకు దాల్చి అనుభవంలో అందుబాటు చేసుకోవాలి!" అని శాస్త్రిగారే ఒక కథలో తాతగారిచేత మనుమడికి హితోపదేశం చేయించారు. ఇది జీవితంలో తాను నిత్యం అనుసరించారు. ఆయన ఆనందం ఎప్పుడూ ఒక్కటే. తాను చదవడం, ఇతరులచేత చదివించడం; తనకు ఉన్నది విద్య కానీండి, విత్తం కానీండి నలుగురికీ పంచడం; అంతే.

వారికి విద్యకి ఏనాడూ, విత్తానికి ఒకనాడు లోటులేదు. బందరులో మల్లాది వారిది మంచి సంపన్న కుటుంబం. సదాచారవంతులైన మల్లాది నరసింహశాస్త్రిగారు సరసులనిపించుకొనడానికి పెట్టి పుట్టారు. వారి ఏక పుత్రుడు రామకృష్ణశాస్త్రిగారు. తండ్రిగారి దృక్పథానికి ఏకైక వారసులు. వేదం నేర్చుకొన్న నోటితోనే శృంగార కావ్యాలు ఆలపించడం, సంధ్యావార్చిన చేతులతోనే సరదాగా హార్మోనియం వాయించడం ఒక వంక బ్రహ్మసూత్రాలు చెప్పుకొంటూ, మరోవంక ఎంకిపాటలు పాడుకొనడం రామకృష్ణశాస్త్రిగారికి ప్రథమ పాఠాలు. ఆనందం అనుభవం అందుబాటులోనికి

తెచ్చుకోవాలన్న లక్ష్యం నూనూగు మీసాల నూత్న యౌవనం నుండీ రామకృష్ణ శాస్త్రిగారికున్నది. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు రక్షబంధనమనే నవల వ్రాశారు. అందులో వాడపల్లి సానివాడను కళ్ళకు కట్టేటట్టు వర్ణించి ఆకాశానికి ఎత్తారు. అతిశయోక్తో, స్వభావోక్తో తెలుసుకొనడానికి రామకృష్ణశాస్త్రిగారు పుస్తకం చదివిన మరునాడు తణికీ చేయడానికి ఆ పైలాపచ్చీసులో అవ్వూరు యకాయకిని వెళ్ళారు.

అనుకొన్నచోటుకు వెళ్ళడానికి వెనుకాడని మనిషికి అనుభవాలకు లోటుండదు. రామకృష్ణశాస్త్రిగారు దాపరికం తెలియనేరని జ్ఞాపకాల మిలియనేరు. కోరుకున్న విద్యల కోటికి పడగెత్తిన కోవిదుడు. జవసత్వాలున్న సాహిత్యాన్ని చదువుకొన్నారు. ప్రబంధాలు, జావళీలు, బెంగాలీ సాహిత్యం, భావకవిత్వం, స్టేజినాటకాలు, ఇంగ్లీషు సినిమాలు అన్నిటిలోను ఉత్తమాభిరుచులు పెంచుకున్నారు.

చురుకుగా మెరికలాగా ఉండే మేధావి ఇట్టే నలుగురి దృష్టిలో పడతాడు. రామకృష్ణశాస్త్రిగారు అలాగే పురాణం సూరిశాస్త్రిగారి కంటపడి మన్ననకు పాత్రులయ్యారు. బందరులో మల్లాది వారిదెంత పేరుపడిన కుటుంబమో పురాణం వారిదికూడా అంత ఉన్నత వంశం; శ్రీమంతులు – దానికితోడు ఇల్లు విద్యానిలయం. సూరిశాస్త్రిగారికి ఒక్కర్తే కుమార్తె. పురాణం వారి ఏక పుత్రికను, మల్లాదివారి ఏక పుత్రునికివ్వ పెద్దలు నిశ్చయించారు. రామకృష్ణశాస్త్రిగారి కాళ్ళు కడిగి కన్యాదానం చేసి సూరిశాస్త్రిగారు అల్లుణ్ణి తలమీద పెట్టుకొన్నారు. అయనంటే వారికంత అభిమానం. రామకృష్ణశాస్త్రిగారికి ఎంత సాహిత్యపిపాసో, సూరిశాస్త్రిగారికి అంత విజ్ఞానతృష్ణ. లండన్‌లో ప్రతి సుప్రసిద్ధ ప్రచురణ సంస్థకీ సూరిశాస్త్రిగారు ఒకటే రకమైన ఉత్తరం వ్రాశారుట. అచ్చుపడిన ఏ మంచి కొత్త పుస్తకమైనా సరే రెండు కాపీలు వెంటనే పంపుతూ ఉండమని స్టాండింగ్ ఆర్డర్. ఒక కాపీ అల్లుడికి, రెండోది తనకు.

సీమనుండి వచ్చే ఈ పుస్తకాలు కాక ప్రతిరోజు బందరులో దొరికినన్ని పుస్తకాలు రెండు చేతులా రామకృష్ణశాస్త్రిగారు కొనేవారు. అన్నీ చదివి ఆకళింపు చేసుకొనేవారు. ఆధునిక గ్రంథాలతోపాటు ప్రక్క ప్రక్కనే ప్రాచీన తాళపత్ర గ్రంథాలను సేకరించేవారు. ఎందరో ప్రచురణ కర్తలకు సలహాలిచ్చి మన ప్రాచీన శృంగార ప్రబంధాలు అచ్చువేయించారు. స్నేహితులను ప్రోత్సహించి, పరిష్కర్తలుగా వారిని రూపొందించారు. ముద్దుపళని రాధికాసాంత్వనానికి వెంపటి నాగభూషణంగారి పీఠిక రామకృష్ణశాస్త్రిగారి చేతిచలవే.

'శృంగారకావ్య గ్రంథమండలి' అనే ప్రచురణ సంస్థకు రామకృష్ణశాస్త్రిగారు 'పేట్రన్ సెయింట్', వారి ఆదేశాల మేరకు గ్రంథాలను సేకరించి ప్రచురణకర్త ప్రచురించేవాడు. 'హంస వింశతి' శాస్త్రిగారి అభిరుచి వల్లనే గుజిలీ పుస్తకాలలోంచి బయటపడి మంచి ముద్రణకు నోచుకొంది. మరికొన్ని గ్రంథాలను ఓపిగ్గా తాటాకు పుస్తకాలతో తైపారువేసి మంచి పాఠాలను వారు నిర్ణయించారు. కొన్ని పుస్తకాలు దురదృష్టవశాత్తు అక్షరాలా వానలో కొట్టుకుపోయాయి. ఈ సంగతి చెప్తున్నప్పుడు అంతవానా శాస్త్రిగారి కళ్ళలోంచి కురిసింది. ఒకనాడు కొన్ని తాటాకు పుస్తకాలు

తెరచి చల్లని సాయంత్రం పాఠాలు పోలుస్తూ, కాఫీకో, సిగరెట్లకో వెళ్ళారు. ఇప్పుడే వచ్చేస్తాం కదా అని తెరచిన పుస్తకాలను డాబామీద అలాగే ఉంచారు. వెళ్ళినచోట ఏమిత్రుడో పట్టుకొన్నాడు. అతని తర్వాత వాన పట్టుకొంది. మరునాడు... మించిపోయింది.

ఆంధ్రసాహిత్యాన్ని ఆ కొసనుంచి ఈ కొసదాకా సర్వేచేస్తూ తీరుబాటుగా సంచరించిన శాస్త్రిగారి హృదయం తంజావూరు మళ్ళీ చేరుకొని, అక్కడే చదువుల తల్లిచెవిని ఇల్లు కట్టుకొన్నట్టుంది. రంగాజీ, మద్దుపళని, క్షేత్రయ్య అంటే వారికి ఒల్లమాలిన అభిమానం. మధుర కవితలంటే మమత. నాటి నాగవాసంలోనే వారి మెదడు వాసం చేసేదనిపిస్తుంది. అయితే ఆయన అతి చాకచక్యంగా అధునిక యుగంలోనికి అడుగుపెట్టనూగలరు. గతంలోను సులువుగా మహోభి నిష్క్రమణం చేయనూగలరు. అనాటి మధుర జీవితంలోని మంచి గంధపు వాసనలు నేడు అందరి హృదయాలలోనూ గుబాళించాలన్న అకాంక్ష వారి ఆలోచనల ప్రతి పొరలోనూ కనబడుతుంది.

అధునిక సనాతన సాహిత్యాలలో ఎంత పరిచయముందో సమకాలిక రచయితలలో కూడా శాస్త్రిగారు అంత పరిచయం ఉన్నవారు. సాహితీసమితి, నవ్యసాహిత్య పరిషత్తు సభ్యుల తలలో నాలుకగా శాస్త్రిగారు వెలిగిన రోజులున్నాయి. తాము స్నేహం చేసిన కవి మిత్రులకు ఆంధ్ర దేశానికి అప్తులను చేయాలని కృష్ణా పత్రికలో 'నాకవి మిత్రులు' అనే వ్యాస పరంపర వ్రాశారు. ప్రతి ఒక్కరిలోని సొగసును చూడడానికి ప్రయత్నించి కృతకృత్యులయ్యారు. కావ్యప్రయోజనం, రస స్వరూపం, బాగా తెలిసినవారు కనుక మంచి ఎంచడంలో ఆయన అందెవేసిన చెయ్యి.

ఆ చెయ్యి రచనలో కూడా సిద్ధహస్తమే. మంచి కవిత వ్రాయగల నేర్పున్న అయన కథలపైన మోజు చూపారు.

చివురాకు చెలిచేత
పిలువ నంపింది.
సరికన్నె ప్రాయాన
విరజాజి మొగ్గ
ఏవేళకయినాను ఎదురుచూసేనా
పోవాలి ననుబాసి తీవ జవరాలా
తేట వెన్నెల మీద
తేలి వచ్చింది.
చాటుగా మాటుగా
చామంతి రెమ్మ
నీహారగిరి హిమా
నీ చర్చలోను
జోహారులన్నది.
జాకా చమేలి
శరదంబు వాహేల

జతచేసుకొంటి
మరచిపోయేనని
మందారమాల
కోయిల కందనివి
హోయస పథాల
సాయ మౌతానంది
సంపంగి రెమ్మ.

ఇలా మక్కువపడిన చక్కని కవిత్వాన్ని ఆయన విరివిగా వ్రాస్తే భావకవుల ప్రథమ శ్రేణిలో ఉంచబడే వారేగాని శాస్త్రిగారు వచనానికే తమ కలాన్ని మీదుకట్టారు. అందులో ఎంత శిల్పానికైనా చోటుందని గుర్తించారు. వాక్య విన్యాసంలో కొత్తదనం ఆచరించడానికి ప్రయత్నాలు చేశారు. చుక్కలు పెట్టిన చోట్లల్లో నిదానించి, గీత ఉంచిన చోట అగి మెల్లగా చదువుకొంటూపోతే చల్లని సంగీతం వినిపించే శైలి అలవర్చుకొన్నారు. వచనం వ్రాస్తున్న ఆయన నా దృష్టికి పింగళి సూరన్నను అనుకరిస్తున్న కృష్ణదేవరాయల వారిలాగ కనబడేవారు. సూరన్నలాగ కథచెప్పే జాణతనం, రాయలవారిలాగ వూహాకందనిచోట వూహించే కల్పనల సొగసులను లాక్కొచ్చి కుమ్మరించడం రామకృష్ణశాస్త్రిగారు కలపోసి ఏకబిగిని అరగించారు. శిల్పం పరిణితి చెందాక శాస్త్రిగారు వ్రాసిన కొన్ని కథలు ధూర్జటి వర్ణించిన సూర్యకాంతిలో మెరిసే లూతాకల్పిత తంతు పద్మాలు, కొన్ని కేవలం కనక పద్మాలు.

శాస్త్రిగారు వ్రాసిన ఈ కథలు కొన్ని వందలుంటాయి. ఇప్పటికి 12 సంపుటాలుగా వచ్చాయి. 1) అల్లోనేరేడు, 2) రంగవల్లి, 3) మునిగోరింట, 4) రసమంజరి, 5) మత్తకోకిల, 6) కామునిపున్నమి, 7) చెంగల్వ, 8) చిత్రశాల, 9) దోదమ్మి, 10) స్వరమేళ. ఇంకో పది సంపుటాలకు సరిపడ్డ రచనలు అచ్చుపడ్డాయి. ఈ కథ లన్నింటిలోను వారెంతో వైవిధ్యం చూపినా అన్నింటిలోనూ రెండు సుగుణాలు కనబడతాయి. ప్రతి కథలోనూ హృదయ నైర్మల్యం ప్రతిఫలిస్తుంది. అన్ని కథలలోనూ జాతి సుఖ జీవనమే కథకుడు కోరుకొనడం కనబడుతుంది. కొన్ని వెటకారంగా ఉంటాయి. కొన్ని ఆవేదనతో వుంటాయి. కొన్ని భక్తిగా, కొన్ని బరువుగా, కొన్ని చారిత్మక సత్యాల హాజీరాలముందు రంగవల్లికలు పెడుతూ, కొన్ని వూహాగానాలతో అభూత కల్పనల చిట్టస్వరాలు వేస్తూ రకరకాల శిల్ప విన్యాసాలు ఒలకపోస్తాయి.

చిన్నప్పుడు చేయిపుచ్చుకొంటే గుంజుకొని ఆ పళాన పోయిన దాసీ దాని కూతురు ఎదిగి, పదేళ్ళకుపాడై, పట్టపగలే దొంగతనాలు చేస్తూ, కావాలని అర్ధనగ్నంగా రోడ్లమీద తిరుగుతూ ఆ అకారంలో జాలి పుట్టించి బిచ్చమెత్తుతూ తల్లిని పోషించుకొంటూ కలవారి చిరంజీవిని కలుసుకొన్నాక ఆ మగరాయుడి ఆలోచనలు 'అర్ధనారి' అనే కథలో చివర ఇలా వ్రాశారు.

"సీతాయ్ బ్రతుకు చివరకు ఇలా అయిందా? ఎలా తెలవారుతుందో ఈ దేశంలో ఎంతమంది పడుచులు ఇలాగే సీతాయ్‌లు అయిపోతున్నారో.

హాఁ – ఇలాటి చారిత్రాత్మకములైన చచ్చుప్రశ్నలు లక్షాతొంభై. తెలుగువాణ్ణి కనుక పరాఖత్‌గా నాడూ నేను వేసుకోగలను. ఎందుచేతనా, వాటికి జవాబు చెప్పకొనే బాధ్యత నాకూ, నా జాతికీ వేదకాలంనుంచీ లేదు."

అప్పుడప్పుడు శాస్త్రిగారి కలం ఇలాగే కొరడాదెబ్బ కొడుతుంది. అయితే ఆయన కన్ను ఎక్కువగా సగటు మనిషిలోని మంచిదనాన్నే చిత్రించడానికి చూస్తుంది. 'గోరంత – గొప్ప' అనే కథలో చరిత్ర హీనులను చరిత్రార్థులను చేశారు.

తమ గ్రామంలో "సిరిరా; మోకాలొడ్డిన – వివేకులు" కొందరున్నారని కథకుడు చెప్పాడు. వాళ్ళు "ఓ మిఠాయికొట్టు అసామీ, ఓ యిడ్డెన్లమ్ముకొనే కోమటీ, ఓ దూదేకుల సాయిబూ, ఓ ముసలి బసవన్నా, ఓ అంగవస్త్రబ్రాహ్మడూ, ఓ పడుచు వేశ్యా, ఓ కాపు కుర్రాడు, బొమ్మలు చేసుకొనే ఓ సుబ్బి". ఈ సాధారణ వ్యక్తులను రామకృష్ణశాస్త్రిగారు అసాధారణంగా చిత్రించారు. "నన్ను తలచుకోరా అని పుటక యిచ్చాడు – నరులను సేవించరా అని ఈ దేహం ఇచ్చాడు చాలు!" అని రంగణ్ణి నమ్ముకొంటాడు మిఠాయికొట్టు రామాంజయ్య. మరి దూదేకుల సాయెబో? బైల్ – బత్ భుజాన వేసుకొని వీధిని పోయేవాడు నచ్చిన యింటిదగ్గర ఆగి, పరుపో దిండో కుట్టేవాడట. లేదా, పిలిచిన అసామీని పట్టుకొని "పర్పా మీద పడుకుంటావు. వాట్కి పర్పా ఉడాయిస్తుంది గాదూవయ్యా... సాపామీద పడ్కో" అనేవాడు. ఈ సాయబు కబీరుదాసంత తత్త్వవేత్త అయ్యాడట. వారి పాట విన్న వారందరూ భక్తులయ్యారట. వెంట తిరిగిన వాళ్ళంతా వేత్తలయ్యారట.

పేరు పేరునా ప్రతి ఒక్కరి విషయం ఇలా చెప్పి కథకుడు "చిత్తగించరూ... మా గ్రామం చరిత్రలోకి జొరబడవలసిన అగత్యంలేదు... ఈ గోరంత గొప్పే... మాకు ఎల్లకాలం చాలును!" అంటాడు. శాస్త్రిగారు సామాన్యులకు మాన్యత ఇవ్వమనే ప్రబోధకులు. ఆయన చంటిపిల్లల దగ్గర సైతం వినయంగా ఉంటారు. దేవుణ్ణయినా ఎదిరించగల రణ – పెంకితనం అలవర్చుకొన్నవారు. అయితే ఒళ్ళుమండినా మెత్తని చీవాట్లు తప్ప కటువుగా కస్సుమనలేరు.

చెళ్ళపిళ్ళ వెంకట శాస్త్రిగారూ, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారూ, మల్లాది రామకృష్ణ శాస్త్రిగారు ఒక కోవలోని మణిపూసలు. ముగ్గురూ ముద్దులు మూటలు కట్టే తెనుగు వచనాలను వ్రాయగలరు. ముగ్గురూ ముద్దొచ్చే సాని – పాపలలోని మంచినే చూడగలరు. దేవదాసీ విధానాన్ని సర్కారువారు నిషేధించినప్పుడు తొలి ఇద్దరూ ఘాటుగా వ్రాశారు. శ్రీపాదవారికి ఆవేశమేగాని అధునిక సమాజంలో ఇది ఆచరణయోగ్యమా కాదా అన్న ఆలోచన తక్కువ. వేశ్యాకులం ఎందుకు పుట్టిందో హెచ్చరిక చేశారు (భారతిలోనే) మల్లాదివారు నిందుకుండ, "పెండ్లి పందిట్లో వేదఘోష, గజ్జెలమ్రోత వినిపించకపోవడం అటూ మునుపు ఎన్నడన్నా ఉందా?" అని ప్రశ్నించి ఈ సంప్రదాయం తెలియని సర్కారు పెద్దల చెంపమీద చెళ్ళు మనిపించడానికి ఓ గ్రామంలోని పిల్లకాయలందర్నీ చేర్పించి పేరు పడిన ఒక నిత్య సువాసినీ సన్మానం చేయించారు! అగ్నిహోత్రావధానులవంటి అస్ఖలిత – రసికునికి అరవయ్యో వడిలో భోగాలు మప్పారు! కసి! నోటిలోకాక నొసలులో వెక్కిరించగల నేర్పు కలానికి నేర్పిన నెరజాణ!

నోరులేని మూగజీవాలను జీవమున్న పాత్రలుగా చిత్రించడంలో శాస్త్రిగారి శిల్పం అమోఘం. అమావాస ప్రొద్దులలో మునసబుగారి పసువుల సావడిలో కరణంగారి గంగిగోవు నొప్పులు పడుతూ ఉంటే అక్కడికి వూరూనాడూ ఏకమయిందట. కరణంగారి భార్య కాపురానికి వచ్చి మూడు పదులు దాటినా ఆ యింట ఉయ్యాల కట్టలేదు. ఆ యింటి పసరానికైనా కడుపున ఒక కాయకాస్తే చాలు అనుకొన్నారు. ఆవు ఈనింది కోడెదూడ. కరణంగారు సంబరపడి తనతండ్రి నరసయ్య పేరు పెట్టుకున్నాడు. వూళ్ళో యింటింటికీ బెల్లం పంపారు. నరసయ్యపేర ఒకనమ్మూరు రూపాయలకు జాతీయ పొదుపు పత్రాలు కూడా కొన్నారు. లేగణ్ణి అల్లారు ముద్దుగా పెంచారు. నరసయ్య పెరిగిన తరువాత అన్నీ జెట్టీలే! అల్లరులే. కరణంగారికి ప్రాణం విసిగిపోయింది. మునసబుగారు అచ్చోసివదిలి వెయ్యమన్నారు. తల్లిప్రాణం తిట్లు విని మేత నోటికి రానియ్యలేదు. నరసయ్య పారిపోయాడు. మేసినప్పుడు మేసి, తూలినప్పుడు తూలి... ఎక్కడో జత కట్టాడు. బిడ్డ పుట్టింది. ఎంత పసరమైనా ఇంటి మీద ధ్యాస. పెళ్ళాల బిడ్డలను తల్లికి చూపెడదామని వూరికి వచ్చాడు. వాళ్ళను వూరవతల వుంచి కరణంగారి యింటికి వెళ్ళాడు. ఇల్లు శిథిలం. మునసబుగారింటికి వెళ్ళాడు. అరుగుమీద ఆయన నిద్రపోతున్నాడు. చిన్ననాటి చనువుతో పలుకరించాలని నరసయ్య తల ముందుకు వంచాడు. కింద చెప్పుల జోడుంది. చూసిన కన్ను అలాగే గడ్డకట్టుకుపోయింది. ఆచర్మం తన తల్లిది!"

ఇది చదివే పాఠకుడి కన్నుకూడా గడ్డకట్టుకుపోతుంది. తెలుగు సాహిత్యంలో ఈ కథ 'కనుకలి' కోహినూరు వజ్రం, తెలుగువాడు తప్పించి ఇంకెవరూ సానబెట్టలేని రత్నం. ఈ శిల్పం శాస్త్రిగారికి చేతనౌను. సృజనాత్మక శిల్పం ఈ కథలో పరాకాష్ఠను పొందింది.

శాస్త్రిగారి సృష్టిలో సజీవకళను సంతరించుకొన్న ఇంకొక పాత్ర 'తాతయ్య!' అన్ని విద్యలు నేర్చిన అరవై సంవత్సరాల రాలుగాయి. ఇతడు మాతామహుడు. మనవడికి మధుర జీవితపు మర్యాదామప్పితాలు చెప్పి దిద్దగల చనువూ హక్కూ ఉన్నవాడు. అమ్మమ్మ ఉత్త సత్తెకాలపు సాధుగోవు. తాతగారి ముత్తాత నమద్వీపంలో చదువుకొన్న దిట్ట. తాతగారు డిటో. ఆంధ్ర సాహిత్యంలోని మారుమూల రసగుళికలు ఏరగల జాణ. మల్లాది శాస్త్రిగారు తాతయ్య కథలను చాల రాశారు. ప్రతిదీ మల్లెదండెలు కట్టిన చెర్నాకోల. ఈ కాలపు కుర్రకారులో రసికత సన్నగిల్లుతూందే అని వాపోయి గుణపాఠం నేర్పుతుంది. ఫలానా విశ్వవిద్యాలయపు ఆంధ్రశాఖ ప్రధాన ఆచార్యులకు "ప్రయాగ బాపన్న, శొంఠి సుబ్బన్న (ఆణివిళ్ళి) వెంకట శాస్తుర్లు, మోదెరాయల కూతురు" మొదలైన చారిత్రాత్మక వ్యక్తుల అట్టుపుట్టు ఆనవాళ్ళు గుమ్మడికాయలో ఆవగింజైనా తెలియనందుకు తాతయ్య బాధపడతాడు. "కాలేజి మానేసి... మడిగట్టుకు యింట్లో కూర్చుని శుద్ధ నిర్గుణకందార్థ దరువులు సాగించమను. ఉచ్చనీచాలున్న సారస్వతులకు అదే శిక్ష!" అని శాసిస్తాడు.

తాతయ్య పాత్ర ఒక రకంగా మల్లాది రామకృష్ణశాస్త్రిగారి స్వీయ ప్రతిబింబమే. సనాతన పద్ధతులలోని మంచితనపు నిగ్గుని గడ్డ కట్టించి ఈవిధంగా రూపొందించారు.

తమ ఆకాంక్షలను ఇలా సబ్లిమేటు చేశారు. తాతయ్య మనవణ్ణి ఒక్కొక్క కథలో ఎలా తీర్చిదిద్దాడో అలాగే సాహిత్య జీవితంలో శాస్త్రిగారు ఎందరికో తరిఫీదు ఇచ్చారు. వారి సన్నిధిలో ఉంటే "గురువు ఎదుట ఉన్నట్టు, గురి కుదిరినట్టు, నేర్వని విద్య నేర్చినట్టు, నియమాన ఉన్నట్టు" అందరికీ తోచేది. శాస్త్రిగారు ఇరవై సంవత్సరాల క్రిందట తమ నలభయ్యోయేట బందరు వదలి మద్రాసు వచ్చేశారు. నాటినుంచి ఈయేటి దాకా ఆయన జీవితం ప్రవాసమే. డబ్లిన్ నగరాన్ని వదలిన జేమ్స్ జాయిస్ లాగా శాస్త్రిగారుకూడా స్వగ్రామంపైన మమత వీడలేని ప్రవాసి. బయటపడని గడుసుతనానికి ఊపిరి పట్టు. విడిసినచోటు విశ్వవిద్యాలయం అనిపించే విద్యుత్తికి ఉనికిపట్టు.

ఈ ఇరవయ్యేళ్ళనుంచీ శాస్త్రిగారు నాకు తెలుసు. పాండిబజారు తురాయి చెట్లకిందా, పానగల్లు పార్కులోని గచ్చు బెంచీలమీద, దానిముందు నడిరోడ్డుమీది సిమెంటు పలకలమీదా వారు నడిపిన పాఠశాలలో ఎందరమో చెవులలో చదువుకున్నాం. చదువువలసిన పుస్తకాల పేర్లు మాటల సందర్భంలో మాకు తెలియచేసేవారు. తన దగ్గర ఉంటే ఇచ్చేవారు. లేదా కొనిపించేవారు. నీర్కావి ఉత్తరీయం తలకి చుట్టి, సుమారుగా పద్మాసనం బాణీలో మఠం వేసుకొని కుడిచేతి మధ్య – చూపుడువేళ్ళ మధ్య సుతారంగా సిగరెట్టుని సంధించి 'జా–వ్వ' అన్నట్టు – అచపీటాన్ని అతి కొంచెం తెరచిన వాడిలా మీదికి పోనిచ్చి పెదవులలో సిగరెట్టును అలవోకగా అదిమి – మంగోలియన్ బుగ్గల కండరాలని లోనికి తీసుకొని ధూమపానం చేస్తూ వామహస్తచలనంలో అర్థాన్ని నిర్దేశిస్తూ పానగల్లు పార్కుముందు తిన్నెమీద చేసిన ప్రసంగాలు, విసిరిన ఛలోక్తులు వివరించిన విషయాలు అనేకాలు.

ఈ తిన్నె – సాహిత్య పిపాసకులకు పక్షి తీర్థం. విద్యార్థులకు తక్షశిల. పారిస్‌లోని 'లేటిన్ క్వార్టరు' లండన్‌లోని 'గ్రబ్‌స్ట్రీట్' న్యూయార్కులోని 'గ్రీన్‌విచ్' విలేజి, మొదలైన సాహిత్య ప్రదేశాలవంటివి. ఈ తిన్నెపై రామకృష్ణ శాస్త్రిగారి చుట్టూ కొన్నేళ్ళపాటు పింగళి నాగేంద్రరావు, జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి, ముద్దిపట్ల సూరి, శ్రీరంగం శ్రీనివాసరావు, నారాయణబాబు, బైరాగి, వి.డి. ప్రసాదరావు మొదలైన సాహితీపరులం సాయంత్రాలు గడిపాం. మేము కూర్చున్న రోడ్డుమీదికి హోటళ్ళవాళ్ళు కాఫీ పంపేవారు. వారి హోటలు మూసేస్తున్నప్పుడు కబురుపెట్టి బంతికి పిలిచేవారు. శాస్త్రిగారిపైన గురుభావం అటువంటిది. సాహితీపరులేకాక, ఘంటసాల వేంకటేశ్వరరావు, అశ్వత్థామ, మాధవపెద్ది సత్యం మొదలైన సంగీత నిపుణులు, రమణారెడ్డి వంటి హాస్యనటులు, జగన్నాథ్ లాంటి దర్శకులు, ప్రతిభాశాస్త్రిలాంటి చిత్ర నిర్మాహకులు ఎందరో చేరేవారు. అప్పుడప్పుడు తెలుగు దినపత్రికలలోని సబ్–ఎడిటర్లు చుట్టపు చూపుగా వచ్చేవారు. శాస్త్రిగారు అందరికీ ఆ

వారంటే పాండిబజారులోని బిచ్చగాళ్ళకీ, రిక్షావాళ్ళకీకూడా వల్లమాలిన గౌరవం. అయితే ఆయన చేయి చాపిన ముష్టివాడి కెప్పుడూ రాగిడబ్బు దానంచేసిన పాపాన పోలేదు! కాఫీ తాగడానికో, టిఫెన్ తినడానికో సరిపోయినంత చేతిలోపెట్టి

పుణ్యం కట్టుకోవడమే వారికి తెలిసిన విద్య. ఒకప్పుడు మేం కబుర్లు చెప్పుకుంటూ నడుచుకొంటూ ఇళ్ళకు వెళుతూవుంటే వెనకనుంచి రిక్షావాడు అనుసరిస్తూనే వచ్చేవాడు. ఇంటిదగ్గర ఆగి వాడికి అపూట సవారీ డబ్బులు చేతిలో పెట్టిగాని శాస్త్రిగారు గుమ్మంలో అడుగుపెట్టని రోజులున్నాయి.

ఆనందవాణిలో సాహిత్య సంపాదకునిగా నేను చేరిన దగ్గర్నుంచి సినిమాలలో రచయితగా స్థిరపడేదాకా రామకృష్ణశాస్త్రిగారు నా సాహిత్య రూపురేఖలు పైకి కనబడకుండా దిద్దసాగారు. నాలోని అభిరుచులు గుర్తించి చదివించారు. నేనొక స్వంత గ్రంథాలయం ఏర్పరచుకొనేటట్టు దీవించారు. నా సాహిత్య లతకు కొన మళ్ళించింది వారే. వారి దోహదంవల్లనే ఒకటీ అరా పువ్వులు పూస్తున్నాయి. ఒక కథను శాస్త్రిగారు ఇలా ముగించారు. "తాతగారు నన్ను కౌగిట జేర్చినాడు; వేయి జన్మలకు సరిపడిన చదువు చెప్పిన ఆ వేదమయునికి వీని మనము పూజా కుసుమమైనది."

అవును నిజం! ఈ శిష్యుని శ్రద్ధాంజలికి వారే ఏనాడో భరతవాక్యం వ్రాశారు!

(1965)

★ ★ ★

# నేను - నా కతలు

- మల్లాది రామకృష్ణశాస్త్రి

అనగనగా -

ఒక ఊళ్ళో, మా యిల్లు ఉండేది; లంకంత యిల్లు-

ఆ యింటో రాచ్చేసులు, ఏరీ -

వాళ్లు యింట్లో, ఉండరు. ఎప్పుడూ దొడ్డినపడి, కాకుల్లాగ అల్లరి చేస్తూంటామని అమ్మ తిడుతుందా-

అమ్మకు బోలెడు పని. చెంబులూ తప్పాలాలూ, అమ్మకు అందకుండాపరుగెత్తుతూంటాయి; కొడితే సొట్ట పోతాయని అమ్మ వాళ్ళను కొట్టదు.

నన్నూ కొట్టదు. కొడితే, పటిక బెల్లం పెట్టాలిగా!

ఉహూ, ఉహూఁ- అంటే పిప్పరమెంట్లూ, బిసకోతులూ -

అన్నీ తింటే, అన్నం ఎందుకూ?

తినకపోతే, మామ్మ కత చెప్పదుగా-

మామ్మంటే, వాళ్ళ సుబ్బులు లేదూ. వాళ్ళ నాన్నే అమ్మా అని కేకలేస్తూంటాడే, ఆయన అమ్మ!

సుబ్బులూ వాళ్ళ మామ్మనే నాక్కూడా తాయిల్లం పెట్టింది.

వాళ్ళ దొడ్లోనే పొగడ చెట్టుంది. నూద్దగ్గిరే మల్లె చెట్టుంది. కనకాంబరాలు బోలెడు-

వాళ్లు బీదవాళ్లుట. అందుకనే వాళ్ళ దొడ్లో చెట్లుంటాయిట. మేం గొప్పవాళ్ళంగా, మా దొడ్లో బోలెడు నాపరాళ్లు. ఎండాకాలంలోనే అందరూ మా దొడ్లోనే వడియా లెట్టుకుంటారు.

అమ్మకి పాటలొచ్చు, కథలు రావు.

ఎందుకని? చిన్నప్పుడే - మరీ బుల్లప్పుడు - బళ్ళో కెళ్ళిందట. అక్కడేకథలు చెప్పరట, గచ్చకాయలు ఆడుకోమంటారుట. అలా- గదా అని, ఊఁ అరవాల్ట. అంచాత అమ్మకే కథలు రావు పాపం.

పాటలొచ్చున్నావుగా, వచ్చుగాని, నాక్కూడా వచ్చుగాని, నాన్న వింటే కోప్పడతాడు. మరే, నాన్నకే, పాటలు పాడితే కోపం. వాళ్ళ సుబ్బులూ వాళ్ళ నాన్నక్కూడా కోపమే, మా యింటికి అందరూ పేరంటానికి వస్తే, మా నాన్నే బజారు వెళ్ళిపోతాడు.

ఎందుకూ, నాక్కారప్పూస తెచ్చిపెట్టేందుకా?

నాన్నకే కోపం, వాళ్ళు పాటలు పాడతారుగా – అందుకని.

నీకు పాటలొచ్చా, రావేం? పాడతావా – ఓ – నాన్న కోప్పడదూ, నవ్వుతాడుగా, మరే, రాగిబిందెకే బంతిపూలు కట్టి, నెత్తి మీద పెట్టుకుని ఆ అబ్బి వస్తాడు చూడు! పాటలు పాడతాడు. నాన్న వాడికి కాం డబ్బిచ్చేస్తాడు. నేనే, బుల్లి చెంబే నెత్తి మీద పెట్టుకున్నా, అలాగే ఎగిరేశా. చెంబే ఢుంగ్ మంది. నాన్న కానీవ్వలా – వేతవా అనీకొట్టాడు. ఎందుకేమిటి? నాకు తెలీదు.

వాళ్ళ మామ్మే–బుల్లి నులకమంచం– మెత్తహో ఉంటుంది. ఉయ్యాలూగుతుంది. నాన్నా, నానా, మరే. నాకు అలాటిదే – అంటే, ఆరి దరిద్రపు వెతవా అన్నాడు. అంటే ఏమిటి?

సుబ్బులుగారి మామ్మకే కళ్ళు లేవు. అంటే, మనం కనపడంట! వినిపిస్తాంటా! ఎన్ని కథలు చెప్పింది, ఏమో నాకు లెక్కలొచ్చా యేమిటి – ఒకట్లొచ్చు అంతే. మామ్మ చెప్పినవన్నీ గ్యాపకం ఉన్నాయా? గ్యాపకం వుంటే, మళ్ళీ చెబుతావా? నేనేం మామ్మనా, కళ్ళు మూసుకుని నిద్దరోతుంటే కతలన్నీ వచ్చేస్తాయి. నాతో మాట్లాడవు. వాళ్ళతో వాళ్ళు ఆడుకుంటారు.

ఇదీ, కథ! అంటే నా కథ!

నా చిన్నప్పుడంటే, పక్కింటి కళ్ళుపోయిన మామ్మ, పొగడపూలు, వాళ్ళమ్మ తల్లో పెట్టుకున్న మల్లెపూలూ, అందరిళ్ళ మీద చందమామ ఉన్నాయి; కథలు చెప్పాయి.

ఇప్పుడంటే పక్కింటి, పక్కింట్లో మామ్మ ఉంది. కాని కళ్ళుబోలేదుగా; పోతాయట ఎప్పుడో; అందుకోసమని కళ్ళ జోడు కొనిపెట్టాడుట డాక్టరు.

కళ్ళజోడెట్టుకుంటే కళ్ళే చక్కహో పోతాయట– పోతేకథ లొస్తాయా? తెలీదు –

తెలీదు అని అనడం ఇన్నేళ్ళకు తెలిసింది – ఓనమా లొచ్చినాయి, ఎందుకు? నాకు తెలీదు అని రాసేందుకు – కాని కతకు ఒత్తుధ జేరడంతో ఆ మెత్తదనం పోయింది. కాని, వేదాంతం సోములోరు మాయ అంటే వేంకటప్ప దాన్నే పట్టుకుని జాయ అన్నాడు కనుక ఇది కథే.

సరే, అలాగే అనుకుందాంగాని నీవు శనగలు తింటూ మాకు అనుములు చేతులో బెడతావా? ఇదేం పెద్ద మనిషి తరహో అంటారా? నాకు ఆ మాత్రం తెయదుటండీ పుణ్యం కొద్దీ పురుషుడు; అన్నారు. అనగనగా చిన్నప్పుడు ఓ రాజుకు ఇద్దరు భారియలని, ఇద్దరికీ రెండు మూళ్లారు కొడుకులనీ ఆ కొడుకులకి ఆరుమూళ్ళ పద్దెనిమిదీ చెల్లెళ్ళనీ, ఆ చెల్లెళ్ళకి రెండు పెట్టి భాగారిస్తే ఒక తొమ్మి తొమ్మిదీ, రెండు తొమ్ముదులా పద్దెనిమిదీ, తొమ్మిది రధాలున్నాయనీ – ఇలా లెక్కప్రకారం బోలెడు కథలు విన్నానని నీవే చెపుతావే మాకు, అలాటివి చెప్పవేం.

చేతకాదు.

విన్నానంటున్నావుగా,

ఆహా! అంతవరకూ జ్ఞాపకం ఉంది.

పోనీ అందులో ఒక్క బుల్లి కథ–

రాదు!

అదేం? మానాన్న బళ్లో పడేశాడు; దాంతో ఉన్న మతి పోయింది, పోయి పోయి పుస్తకాల్లో పడ్డదా, ఎబ్బే. బళ్లో మాస్టర్లు అందరూ పట్టుకొని దాన్ని అక్కడపడేశారు! పడేసి చేతులు దులిపేసుకుని వాళ్ళదారిని వాళ్ళు వెళ్ళిపోయారు. కాని అదిమటుకు ఎగిరి గంతేసి ఇవతలపడే వోపికలేక ఇంకా అక్కడే పడుంది. అదే దానికి బాగుంది కామోలు! పోన్లే ఎన్నటికన్న మొహం మొత్తకపోతుందా అనుకుందామంటే అబ్బే దాని పద్ధతి అట్లాలేదు. మంచి ఘాడుపు వేస్తున్నప్పుడు గంగ ఒడ్డున కూర్చుని ఉద్ధరిణెతో దాహం పుచ్చుకోడం మొదలెడితే గంగ ఎండా ఎండదు, దాహం తీరాతీరదు అలా వుంది వరుస; కనుక దాని రంధితో మనకు నిమిత్తం లేదు; నా మట్టుకు నాకు చెప్పేవాళ్ళుంటూ ఉండాలి కాని ఎల్లకాలం వినాలనే ఉంటుంది. అది సాగకనే ఈ బాధ.

బాధంటే? వ్రాయడం, అనగా రచనలు చెయ్యడం అనేది బాధతో కూడిన విషయమా? తప్ప కుండాను! బాజాలు వింటూన్న పెళ్ళివారిపనిబాగానే ఉంటుంది. కాని ఎటొచ్చీ భజంత్రీవాడే అపసోపాలు పడేది! అంతమాత్రమే ఐతే ఇందులో ఏమిటి ఆనందం "నిజం చెప్పవలసివస్తే ఏ మాత్రమో కద్దు. లేకపోతే ఒకరి నొకరు పట్టుకు ఇలా ప్రాకులాడడం అంటూ ఉంటుందా?—"

సరే బాగానే ఉంది. కలం చేతపట్టిన ప్రతి ఒక్కడూ రచయితే నందామా? దస్తావేజులు వ్రాసేవాడి మాటేమిటి? అద్దం ముందు నుంచున్నప్పుడైనా అంతరాత్మ అనేది నిలవేసి ప్రశ్నించడమంటూ జరిగితే అందుకు నీకు నీవేమని సంజాయిషీ యిస్తావు?

ఏం జేస్తానూ, తప్పనిసరిగా కొంత నిజం మరికొంత అదనపు నిజం చెప్పేస్తాను, ఏమని? దస్తావేజులకు నా కథలతో సామ్యం ఏమిటి? వాటికి ఓ తలా, ఓ తోకా అంటూ ఉండక తప్పదు — వాటికి అలా ఉండటం ఒప్పదు! ఉంటే ఒకటికి పది తలలుండవచ్చును. కాని ఏ సందర్భములోనూ తోక అనేది లేక పోవచ్చును. యీ తోక లేకపోవడం అనేది అక్షరాలతో ముగ్గులెట్టే అతగాడికి కాని. ఆ పట్టులోనే చెమ్మ చెక్కలాడే ఇతగాడికి కానీ కొట్టొచ్చేంత — పట్టిచ్చేంతలోపం కాదు అనిపిస్తుంది. అలాగైతే నీకు ముక్కుకు సూటిగా చెప్పడం చేతకాక మొదలూ తుదీ వదిలేశావనుకో, అవి ఏమౌతాయి? ఏమౌతాయ్; నాకు తెలియకుండా, మాట మాత్రం నాతో అనకుండా, సందు చేసుకుని మధ్యలో ఇరికి ఊరుకుంటాయ్!

వాటి ధోరణి బావుందా?

ఇది కూడా, అంటే యీ పద్ధతి కూడా ఓ పద్ధతిగా బాగానే ఉంది — అని చదవక ముందే, సదభిప్రాయానికి సన్నద్ధులయేవారు కొందరున్నారు. వారికి భూతదయమెండుగా ఉండటం చేత, తెగించి అలా అనగలుగుతున్నారేమో కాని, అదిమట్టుకు స్వారస్యానికి సతమతమవడం కాదు. అసలు యీ ఇతివృత్తమనేటటువంటి భామ వేషానికీ, మనకూ అనుకూల దాంపత్య మంతటి బద్ధవైరం అవిచ్ఛిన్నంగా సాగుతూనేఉంది. ఈ భామ సర్వసాధారణంగా తెరచాటునే ఉండి, అకారం గోపనం చేసుకుంటూ, లీలగా నాయకుడి భరతం పడుతుంది. రభస నుంచి రసకందాయానికి రప్పించేందుకు జడమట్టుకు ఇవతలికి విసురుతుంది. ఇది తెరచాటు కాదు. అందరూ

మెచ్చే అరచాటూకాదు. అది ఒక కళ శ్రీకృష్ణస్వామి వారు, ఒక్కొమ్మడి యథాశక్తిని మన్ననచేసే పదార్వేల కన్నెలతోబాటే ఈ భామకూడా - కాకుండా చిరునామా వగైరా మనకి తెలియడానికి కారణం ఏమిటి? నాయకుడి చేతలకు నానార్థాలు చెప్తుతూ తాను వేదన చెందుతూన్నట్లు అభినయిస్తూ చెలికత్తెలను వేధించుకు తినడంలో బిరుదందినది కనుక! యీ సంగీత సాహిత్య సమరమే గమక యమకాల కదన కుతూహలమే స్వారస్యం! మనమూ అనగా కథకులమూ ఇంతే; జీవితాన్ని అంటే ఎదుటి వాడి జీవితాన్ని వలసినంత తలక్రిందుగా అర్థం చేసుకుంటూ వాడు ఇరుకునపడే ఘట్టాలు కలిపిస్తూ అలాటి స్థితిలో అనవసరంగా మనం కలుగజేసుకుని, ఎవరి మీదనో పెట్టి, అనవలసినవి అంటూ, వాడన్న ముక్కకి నానార్థాలు కలిపిస్తూ, మునగ నీయకుండా తేలనీయకుండా ముప్పతిప్పలు పెట్టడమే శిల్పం. పర్యవసానం ఒక కళాఖండం అని కాచి వడబోసినవారు అంటారు. అది ఎంత వరకూ నిజం అంటే, నా మట్టుకు నిజం!

వెనుకటికి "సర్వమంగళ" అనే "కథ" ఉంది. అది కథో, కథానికో, వాక్చిత్రమో, వచన పద్యమో, సిసలుగా వ్రాయ వలసినటువంటి అసలు దానికి మూజువాణీ ముసాయిదావో తెలియదు! అందులో బోగట్టా ఏమిటి? ఇద్దరు అక్కాచెల్లెళ్ళు అంటే ఒక అక్క, ఇద్దరు చెల్లెళ్లు కాదు; నికరంగా ఒకటీ ఒకటే; వారిలో (వయసులో) అక్కపెద్దది, చెల్లెలుచిన్నది - (వనరులో) తద్వతే! అంతవరకూ బాగానే ఉంది. సదరు అక్కయ్యకు వయసూ, వైధవ్యం ఒక్కసారే సంక్రమించినాయి, అదీ బాగానే ఉంది, ఈ ఫలానా చెల్లెలున్నదే, ఒక వయసు మళ్లుతూన్న వాడికి ద్వితీయ విభక్తి కావడం సంభవించింది, తదనంతరం పిల్ల కాపురానికి వెళ్ళేప్పుడు ఈ ఉపసర్గ కూడా అక్కడ చేరుకుంది, తదుపరి గిరీశంగారు సాయించినట్లు - "ఆడలేడి కన్నులున్న..." ఈ పద్ధతిలో రెండు అచ్చులు ఒకచోట చేరినప్పుడు వ్యాకరణ కార్యం తప్పనట్లు గాంధర్వకళ ఒప్పడం నెలతప్పడం, యింతవరకూ మామూలే! ఆపై ఫలితం బయట పడేటంతవరకూ మరో గ్రామంలో నివాసంచేసి, బంధువుల పరువు పదిలంగా ఉంచవలెననే బాధ్యత, ఈ పైదలి నావహించడంతో తాను ఒక్కత్తే వచ్చి, మళ్ళా ప్రజలలో పడడం - ప్రజలనగా ఎవరు? ఆ మరదే! కాలక్రమాన మళ్ళీ మళ్ళీ అతగాడు వెనుకటి తప్పన పడేసేందుకు చీకటి కోసం వెదకడం, ఈ ఆడకూతురు మంచిగా మొండికేసి, వేసినకొద్దీ మరింత ఇరుకున పడి, చివరకు తాను అక్కడనుంచి బయట పడితేనేకాని తోడబుట్టిన దాని కాపురం కుదుటపడదు అని రూఢి చేసుకుని, గంగలో కలిసిపోవడానికి సిద్ధమై తన గోడంతా, గంఘాభవానితో ఏకరువు బెట్టుకుంటుంది.

ఇందులో యితివృత్తం అనే పదార్థం ఇది. ఈ రచన చేసినవాని యోగక్షేమములు ఎల్లవేళలా కోరుతూ ఉండేటటువంటి ఒక గృహస్థు దీనిని తీరుబడిగా చదివి, ఏమని హితోపదేశం చేశాడంటేను - "ఒరే అబ్బాయి, వ్రాత పొంకంగానే ఉంది; కాని సందర్భ శుద్ధి అనేదిమట్టుకు పూజ్యం; లోకంలో పరిపాటి ఏమిటి? ఓ ముసలివాడున్నాడనుకో, వాడు వయోధర్మం ప్రకారం అన్నీ ఉడిగినవాడు కాకుండా, పోనీ నీమతం ప్రకారం ఇంకా బందో బస్తుగానే ఉన్నాడే అనుకున్నా ఆ వయసులో

పసిపాపను వ్యయ ప్రయాసల కోర్చి కట్టుకున్నందుకుగాను దాన్ని వెయ్యికళ్ళతో కనిపెట్టుకుని ఉండేందుకు తాపత్రయపడతాడు. ఆ పిల్లది కూడా బుద్ధి తెలిసినప్పటి నుంచీ అమాయకురాలైతే తన ఖర్మానికి అఘోరించడంగాని, బుద్ధి కుదురు లేనిదైతే వన్నెచిన్నెలకు పోయి, కానిపోని జంజాటంలో పడడంకాని, అక్కడా అక్కడా మనకు కంటికి తగులుతున్నదే – వీళ్ళ స్థితి చూడబోతే అల్లాలేదు. అంతా ఏటికి ఎదురీదేవారే – ఏమిటిది?"

"జీవితం!"

"సహజంగా ఉందా?"

"ఉంటే కథెందుకౌతుంది?"

"అయితే అసహజంగా ఉంటేనా కథ!"

"సహజం అనిపించే అసహజం–"

"అనిపించేదెవరు?"

అదే? యిల్లూ వాకిలి యింటివారిదైతే యిల్లాలు మందేకదా అనుకున్నవాడు వెర్రివాడా, మంచివాడా? వాడిమీద ఏం కథ నడుస్తుంది? ఇల్లూ వాకిలితో బాటు సంక్రమించిన యిల్లాలిని కూడా కొంత తడవు "మమ" అనుకుని మల్లాగుల్లాలు పడిన ఆ ఘట్టమే కథ అవుతుంది కద! కథానాయకుడు అని, మంచికిగాని చెడుకి గాని మనం ఎలాటివాడిని గురించి అనుకుంటాం? మామూలు పద్ధతులతో కాకుండా కొంత గ్రంథం నడపడానికి కాని, కొంత గ్రంథం నడవడానికి కాని కారణ భూతుడయ్యేటటువంటి వాడినే కదా?

అయితే, "తన్మంత్రం బ్రాహ్మణాధీనం" అన్నట్లు కథ నీ చెప్పుచేతుల్లో నడవదా అంటావా? ఉహూఁ– కథలో ఆడా మగ, పశుపక్ష్యాదులు సైతం మన చెప్పుచేతల్లో ఉండకపోవడమే కాకుండా, మనల్ని ఎప్పటికి వదలిపెడతారో మనకే తెలియదు.

వారివెంట మనమూ అలా పడిపోతూండవలసిందే. అదీ ఒకందుకు మంచిదే. మనలో సాధారణంగా చక్కెర వింటివాని నెకసక్కెములాడేటటువంటి అందగాళ్ళు, హాసుగాళ్ళు సర్వసాధారణంగా ఉండటం అరుదుకదా? అయినప్పటికీన్నీ పిల్లలు నవమన్మధులు కావాలని పుట్టుకొస్తే కొండటున్నామా కోరుకోవడానికి వెనకాడు తున్నామా? అలాగే వాళ్ల మానాన వాళ్లు ప్రయోజకులై, నలుగురిలో పేరు దెచ్చుకుంటే – వీడు మా వాడు! అని భుజాలెగరేయడం లేదా? ఈ కథలనేవి రచనలు చేసేవాడి పరిస్థితీ, మనస్తత్వమూ అట్టిదేనయ్యా! మన ఊహాపోహలతో పగ్గాలేసి వాళ్ళను పట్టకుండా ఉంటే, మన కథల్లో కనపడే మనుషులూ, వాళ్ళ పలుకు వాళ్ళు పలికి, వారి కథ వారు నడుపుకు పోతారు! సాటివారూ, తోటివారూ ఎలా సతమతమౌతారో మనకు ఎరుకలేదుగాని, మన విషయంలో మట్టుకు యింతే! మనం హాయిగా కలం చేతపట్టి కూర్చుంటే పిల్లలు యిల్లు నడుపుకుపోతారు అనేది పునరుక్తి అయినప్పటికీ మన తాలూకు యావత్తు చిదంబర రహస్యమూ యిది!

పనసకాయ దొరికినప్పుడే... అనే పంథాలోనే, కొబ్బరిమీగడ లాంటి కాగితం, సుతారంగా నడిచే కలం కనబడటం తరువాయి – శ్రీకారం చుట్టవలసిందే. ఆలోచనలకోసం వాటిజన్మస్థానములైన శిరస్సునూ, కపోలములనూ, ఎడనెడ

చుబుకమునూ తడుముకోవడం, అవి పైకి రావడంకోసం ఒళ్ళు విరుచుకోవడం – వగైరాలతో మనకు నిమిత్తం లేదు! చెక్కిళ్ళ ప్రాంతాలలో ఊహలు మొలకెత్తుతవి అనేది యీ నాటికి అనుభవంలోకి రాలేదు. "స్వకపోల కల్పితము" అని ధీమాగా చెప్పుకునే హక్కు, అర్హత మనకు సంక్రమిస్తుందని తోచదు. అయితే విష్ణోర్జిహ్వే సరస్వతీ – అన్న ఫక్కీలో – కవికుల వదనాంబురుహ బద్ధనివేశా – అని అనుకోవడం సంప్రదాయం కదా అంటారా? కవనం జెప్పేవాళ్ళ నోళ్ళ, కథలు వ్రాసేవారి మునివేళ్ళ – ఆ యిల్లాలు కాపురం ఉంటుందని నమ్మేవారు ఎందుకు ఉండరాదు? దానికేం లెస్తురూ–

ఇప్పుడెందాక వచ్చాం?

మనదాకా!

మరి, మన సంగతి ఏమిటి?

నీవు కథలు వ్రాస్తున్నావు కదా!

ఒప్పించ నక్కర్లేదు – ఒప్పుకున్నాను!

ఎలా వ్రాస్తున్నావు?

చెప్పానుగా!

ఎందుకు వ్రాస్తున్నావు? ఇలాటి ప్రశ్న అడిగే అభిజ్ఞులు ఉండగలరని మనకు నమ్మకంలేదు కనుక, అందుకు వలసిన సమాధానం జాగ్రత్త పెట్టుకోలేదు.

నీ కథకు నీతి ఏమిటి?

దానికి ఉన్నదల్లా జాతి!

★ ★ ★

# కథాక్రమం బెట్టిదనిన...

# ఆనందలహరి

తురగా రామన్నగారు ఇంటికి ఎదురుగుండా వున్న లోగిలి అరుగుమీద కూర్చున్నారు.

ఆ అరుగు, ఆయనకు ఒక్కడికే హక్కు, భుక్తం.

దారిన పోయేవా రెవరైనాసరే ఎదుట నిలవబడి, మాట్లాడిపోవడమేకాని, సరసను కూర్చునే సాహసం చేయరు.

కారణం వారిమీదున్న గౌరవం

మరిన్నీ వారి గడుసుదనం.

మనిషి, చక్కనివాడు, చాలినవాడు.

ఎందుకో ఒకందుకన్నా, ఎవరికీ చేజాపవలసిన అవసరం లేనివాడు. ఎవరి అవసరానికన్నా, అక్కరకు వచ్చేవాడు.

సాధారణంగా ఎక్కడికీ కదలడు. ఎప్పుడోకాని, అదన్నా దేవకార్యమైతేనే ఏ ఊరు పోవడం అంటూ లేదు. అదన్నా సకృత్.

ప్రొద్దునో, సాయంకాలమో ఊరి శివారున, అంటే, ఓ మైలులోపే అనుకోండి, ఉన్న తమ తోటలోకి పోవడం.

ఆ బావిదగ్గర స్నానంచేయడం, కాస్సేపు మామిడి తిన్నె మీద కూర్చుని, ఏ కృష్ణో - రామో అనుకోవడం, మరో కాస్సేపు గోవు వెన్ను నిమురుతూ దాన్ని మాలిమిచేయడం, దాని తువ్వాయితో, పసిపిల్లడల్లే గంతులు వేస్తూ ఆడుకోవడం.

ఈలోగా తోట కనిపెట్టుకునివున్న వెంకన్న, పాలుదీసి, తనకో పాలుంచుకుని, మిగిలినవి వారికి అందీయడం. అందులో సాపాలు బాదమాకు దొన్నెలో వుంచుకుని, ఈశాన్యంగా మారేడు వృక్షం క్రింద వున్న పుట్టలో పోయడం. 'నాగేంద్రుడా, వచ్చి, నీ అనుష్ఠానం కానిచ్చుకోవయ్యా!' అని మ్రొక్కడం.

ఓ పది అంగలు వెనక్కు వేసి, అక్కడున్న తులసి మొక్కలదగ్గర ఏక పాదాన నిలుచుండి, పుట్టలో నాగేంద్రుడు బయటకి వచ్చి, సూర్యనమస్కారంజేసి, మళ్ళీ పుట్టలో జేరుకునేదాకా, తానూ, సూర్యభగవానుడికి అంజలిపట్టి అలాగే ఉండి పోవడమూ, ఇంటికి తిరిగి వస్తూ, పిల్లలున్న ఏ యింటి వద్దనో మిగిలిన పాలు ఇవ్వడం, ఇంట్లోకి వెళ్ళి, ఇంటికైన ఇల్లాలు తులసిపూజ ముగించుకుని, తనకు మ్రొక్కేంత పర్యంతమూ అక్కడే నిలుచోవడమూ, ఆవిడ ఇచ్చిన తీర్థం పుచ్చుకుని, పొడిబట్ట కట్టుకుని, తమ తండ్రిగారు పూర్వం అనుష్ఠానం చేసుకొనేచోట, ఒక్క క్షణం కూర్చుని, వారిని స్మరించుకోవడమూ, తలుపు దగ్గరగా వేసి, వచ్చి ఆ అరుగు మీద చదికిలిపడటమూ. ఇది ఈయన పద్ధతి!

ఆ ఎదురిల్లు శివరామయ్యది. అంటే శివయ్య.

వాళ్ళతండ్రీ, తన తండ్రీ సహోధ్యాయులు. తాము డిప్పకాయలు ఇద్దరూ, నీ, నా భేదం లేకుండా, కలిసికట్టుగా మొట్టికాయలు తిన్నారు. తనకు పుష్టివుంది, దులిపేసుకున్నాడు. వాడు, వట్టి అర్భకుడాయెను! పడలేక, కోనసీమ బ్రాహ్మణుల వెంట పడిపోయి, అక్కడే ఉండిపోయి, వేదపండితుడై, దేశంపట్టి సంచారం చేసి, తండ్రికి ఉపచారం చేయవలసిన అగత్యం కలగడంతో, తెలిసి తిరిగి వచ్చాడు. ఆ పండు రాలిపోవడంతో, ఇంటిపట్టున ఒక్కడూ ఉండలేక, భద్రాద్రి రాముణ్ణి నమ్ముకుని అక్కడే పడుందామనుకున్నాడు. రామకోటి సమర్పించాడు. ఎట్టకేలకు తాను, పదేపదే కోరగా, మాట తీసివేయలేక, తంబుర చిరతలతో సీతారాముల విగ్రహాలతో, తిరిగి వచ్చాడు.

పెళ్ళిచేసుకోలేదు. అమ్మవంక వారూ, అయ్యవంక వారూ చెదురువాటుగా, అక్కడ ఉన్నా, ఆ బాంధవ్యాలు తిరగ వెయ్యడమన్నది లేదు. అక్కడ శ్రీరాముణ్ణి నమ్మినట్టే ఇక్కడ ఈ రాముణ్ణి నమ్ముకున్నాడు. మరే ప్రమేయం అక్కర్లేదనుకున్నాడు.

తొలికోడి కూసేవేళకు మేలుకోవడమూ, రామా! అనుకుంటూ ఇంతసేపు పాడుకోవడమూ, సంధ్యావందనాదికము ముగించుకొని, రెండు ఝాములదాకా, ఓ పదిపన్నాలు చెప్పడం, ఓ ఇంతసేపు సామగానం చేయడం, అప్పుడు, ఇంతపులగ మేసుకుని, ఓ బెల్లపుముక్క దానిమీద ఉంచి, అదే పుచ్చుకోడం, గుండు చెంబెడు మంచినీళ్ళు పుచ్చుకోడం, మడివిడిచి ఇవతలకువచ్చి, రాముడికి నివేదనచేసిన ఆ బెల్లమ్ముక్క రామన్న చేత ఉంచడం, అప్పుడూ రామన్న లేచి వెళ్ళి భోంచేయడం.

తాను వెళ్ళి రామన్నగారి పంచలో, అనవాయితీగా పడుకుని ఉండే మేకపిల్లల పక్కనే చోటుచేసుకుని అంగవస్త్రం వేసుకుని నడుంవాల్చడం. రామన్నతో కలిసి, సంజెపూట, అలా తోటలోకి వెళ్ళిరావడం, తిరిగివచ్చి, ఊరు మాటుమణిగేదాకా, ఆ పంచలోనే కూర్చునిపోయి, పిచ్చాపాటీ చెప్పుకుంటూ, అప్పుడు అక్కడే, రాముణ్ణి తలచుకుంటూ, ఓ పక్క ఝాము నిద్రపోవడం ఇదీ ఆయన పద్ధతి. రామన్నతో, ఆ ఇల్లాలు సీతమ్మతో తప్ప మరెవ్వరితో మాట్లాడడు. ఆ అగత్యమూ లేదు.

ఒక్క నవరాత్రుల్లోమటుకు, దివాణంవారు, పిలిచి ప్రత్యుత్థానం చేయడమూ, వీరు, కాదనకుండా, విజయదశమి పర్యంతమూ ఉదయాన్నే వెళ్ళి, అపరాహ్ణమయేదాకా వేదపారాయణ చేయడమూ, ఆ దీక్ష అనంతరం ఆ దంపతులను దీవించి, తాంబూలంమట్టుకు స్వీకరించి, తనదారితాను రావడం. అంతే!

పండగల్లో మట్టుకు దివాణానికి వెళ్ళడం. దేనికా అంటే, వారి తాతగారి నాటినుంచీ వస్తూన్న ఆచారం! అది మానరాదని వారి తండ్రిగారి కోరిక!

—చిన్న నాడందరూ రాముడూ అని పిలిచేవారు, శివయ్యను.

అప్పుడు, సరే.

"ఊరికి, ఇందరు రాములేమిటి? వీడే మీ రాముడు.

నేను శివుణ్ణి. అందరూ నన్నలా పిలిస్తే సంతోషిస్తాను." అన్నాడు గ్రామానికి తిరిగివచ్చిన రోజుల్లో. అప్పటి నుంచీ శివరామయ్య శివయ్య అయిపోయి, రామన్న ఏకో రామయ్య అయినాడు.

శివకేశవులకు లాగానే ఇద్దరికీ అభేదం! గ్రామంలో వారి, అభిప్రాయమూ ఆదరణాకూడా అదే.

అయితే ఒక్కటే తేడా. ఈ రాముడు, ఎప్పుడూ కన్నుల ఎదుట ఉంటాడు పలుకుతాడు శివుడి దర్శనమే కాదు.

--- రామన్నగారు, కూర్చున్న చోటనుంచి కదలక పోయినా, ఊరిలో - ముఖ్యంగా ఆ వాడలో, చీమచిటుకు మంటే ఆయన చెవిని పడకమానదు. అదెల్లాగంటే, ఎల్లాగో! దక్షారామ భీమేశ్వరుడటూ - ఇతగాడిటూ! అయితే, ఆ స్వామివారికిఉన్న దక్షత, ఆ తత్పరత ఈయనకు లేదు. కేవలం భోగట్టా మట్టుకే ఈయనభోగం!

ఆ గ్రామంలో, అవాడలో మామిడివలస మొఖాసాదారు ప్రాపకంలో కొంత కాలం ఉన్నటువంటి, నాగమ్ అనే నగరాజకుమారి లోగిలి, మాంచిహొాసుగా ఉంటుంది. ఆమె చేసుకున్న సుకృతం కొద్దీ, ఒక ఆడపిల్ల కలగడం, అయిదో నెల్లో, ఆ పిల్లను తీసుకువచ్చి ఈ రామన్న గారికి చూపించి, అయ్యా! వెనుకటికి, నా చిన్నతనంలో అంటే అయిదారేళ్ళ ప్రాయంలో, మా తల్లి వెంట దివాణానికి వెళ్ళాను. అవి దేవీ నవరాత్రులు. మా వాళ్ళు మేజువాణి చేస్తున్నారు. నేను, తాళం పట్టాను. సభలో తమ నాయనగారు, నేనున్న చోటికి రవంత పక్కనే దయచేసి ఉన్నారు. వారు, నావంకనే కన్నప్పగించి చూడటం మా తల్లి గమనించింది. నాకు సైగ చేసింది. సభా మర్యాదలు అప్పటికి నేర్పి ఉన్నదిగనుక, తాళం వేయడం ఆపి, ఒక అడుగు ముందుకువేసి, వారికి వందనం చేశాను. తమనాయనగారు, తల ఊగించారు! మా తల్లి వారికి కనులతో మ్రొక్కింది.

సభ ముగిసింది. వారు నన్ను దగ్గరకుపిలిచి "నాకు మ్రొక్కినచేత, రేకపండాలి" అంటూ నా చేయి అందుకని, "రాజయోగ్యమగు జవ్వని వయ్యేవులే" అని దీవించారు. వారిదీవెన నా సుకృతమై ఫలించింది.

తండ్రికి పేరుతెచ్చిన కుమారులు తమరు.

మా చిన్నది, మీ చేతి చలువను రాణించవలెనని వచ్చినానయ్యా.... అని, బిడ్డను వారికి అందించగా.....

రామన్నగారు, పసిదాని మోమువంకచూచి, తలయూచినవారై, కన్నులర మోడ్చి, పకపక నవ్వి, "నాగామ్! శ్రీనాథమహాకవి, వైభవంగా దేశసంచారం చేసేతరుణాన, ఓ గ్రామంలో - ఒక నంబివారికోడలు తమకు - సపర్యలు చేయంగా - మెచ్చుకున్న వారై - ఒక్క కందంలో ఆ అందం అంతా ఇమిడ్చినారట! నీ కూతురిదీ అంతరాణింపే" అంటూ పయ్యేద దిద్దినట్లు - ఆ పాపను నిమిరినవారై - "ఈడొచ్చిన తరువాత కనిపించవేపిల్లా! నా హస్తవాసి - ఎంతగా ఫలించిందో - చూదాం!" అని తల్లి చేతి కిచ్చారు.

అది - ఇప్పటికి - పదహారేళ్ళ నాటి కథ!

అనాడు మాఘపూర్ణిమ.

రామన్న - శివయ్య తోటలో ఉన్నారు. అలా తిరుగుతూ - కబురులాడుకుంటు న్నారు. తులసి మొక్కలమీదుగా -- కస్తూరి వాసనలు కమ్మినవి. "నాగేంద్రులవారు వనవిహారం చేస్తున్నారల్లే ఉందిరా" అన్నాడు శివయ్య. "వారికేమయ్యా, దినానికో

తీరున పరిమిళించేరు. వలపులు వెజల్లేరు. కాని – శివునిలెంక లైనందుకు – వారిహృదిని మదనుడుదయించడు. నీ అంతటి ఒంటరులే వారు!"

"అదేమిత్రా, సదాశివులవారికి, యత్కించిత్ మోహినీ స్పర్శకలదని, పురాణోక్తం కదరా!"

"అలాగే, ఏ గానమోహినో, ఇక్కడ సాక్షాత్కరించాలని నీ అభిలాషా? నీది, వేదవాక్కు కదరా! అలాగే కానీ, రానీ–– "

–– రానే వచ్చింది. సమీపించింది.

రామన్నగారు, ఒక్క అడుగు ముందుకు వేసి అలా, చూచారు! శివయ్య, "ఎవరువారూ!" అని, తనలో తాననుకున్నాడు.

రామన్న వంక చూసి, నవ్వింది.

"ఆసి! నీవటే! మన నాగామ్ కూతురు! పదారేళ్ళనాడు, మనమన్నమాట, – ఫలించిందయ్యా, శివయ్యా! ప్రాయాన వచ్చి", నా కంటపడవే అని, ఓ బాలపాపతో అన్నాను. అలాగే వచ్చిందయ్యా. వచ్చినందుకు సంతోషమే.

చూశాము! తీరా–––

చూడగ నల్పు !" అని నవ్వుకుంటున్నారు.

అలదానికి, చిడిముడితనం, నిలువు నిలువునా కులుకంగా, మరింత సమీపించి, సగౌరవంగా, జాలిగా, రామన్న వంకచూచి, వారినిచూపులతో కమ్ముకున్నది. వారూ, జాలిద్దలచారు.

"కాని, పరిశోభితదివ్యకురంగనాభము...."

అది, తీవులుపోయింది. వారు మెచ్చుకున్నారు.

"ఏ జాడను, రాజయోగ్యమగు జవ్వని...."

దానికి పరవశమయినది.

శివయ్య అన్నాడు: "నల్లని మేని సంచుదానా, నీ పేరేమి?"

"మీవంటి పెద్దలు గంగీ అని పిలిచేరయ్యా!"

"రామన్నా, వీరి ఇంటిపేరేమన్నావ్?"

"మునుపు, గేదగి. ఇకనుంచి, కేతకి....."

"నీకు, ఈ పరిమళమూ, మాకీ పరవశమూ, శాశ్వతమేలే."

అది, వారి హస్తములందుకున్నదై పయ్యెద కద్దుకుని, సరి మ్రొక్కులిచ్చింది.

"నల్లదానా, నా ఇంట రాముడున్నాడే.

ఆటపాటలతో వాని నర్చించేవా?" అన్నాడు శివయ్య.

"నల్లని మేని సంచుతో, అడగరాదుగా" అని అందుకున్నాడు రామన్న.

"రాదుగా?"

"రాదయ్యా. మీ రాముడు నీలమేఘశ్యాముడు.

ఈ శ్యామాంగి వారికి నచ్చదయ్యా!

నల్లనివారికి నలుపు గిట్టదు.

రాముని పూజకు కాదీ బాల పుట్టుక. రాజుల పూజలందుకొనేందుకయ్యా...."

"రామన్నా, నీ దీవెన, దీనికి శాపమా."

"శాపము కాదన్నా జన్మకు సాఫల్యము...."

"విచిత్రంగా ఉందే..."

"ఆ వైఖరులే విచిత్రములు. చూడవలెనంటే, ఆ ఆగమ రహస్య మెరుంగవలె. క్రీడల తేలవలె.

మనమందుకు తగమని, దీనిని రాజుపాల్జేసినాను.

వెంకన్నా, ఈ నల్లని పిల్ల దానికి, దోసెడు జాజులిచ్చి పంపరా. నాగామ్ కూతురా, నా పేరు తలచుకుని, ఆ పూలు తురుముకొని, మీ ఇంట నిదురించి, కోటలో మేల్కొనవే!" అన్నారు రామన్నగారు.

రామన్నగారి పద్యము, మరునాటికి ఊరిమీదికి ప్రాకినది. ఆ కవనము జమీందారుల చెవిసోకినది.

నాగాం కూతురు రాణివాస మేలినది.

రామన్నగారు, వశ్యవాక్కులనీ, వారి చేయిసోకడం మహాప్రసాదమనీ, దేశంలో తెలిసింది.

— కొప్పులింగేశ్వరస్వామివారి ఉత్సవాలకు శివయ్యా! రామన్నా సందర్శనానికి వెళ్ళిన సందర్భంలో అక్కడ మేజువాణిలో అందరిలో గమకంగా, మంచి ఒత్తిరి, మాంచి ఎత్తరి, నాయకసాని, పెండ్యాల నాగి, వీరి కంట పడ్డదాయెను.

"నగుమోముదానా, నీకున్న రూపు ఎవరికున్నదే, అడుగు ముందుకు వేసి, ఆ గజ్జె నీవు కట్టవే" అన్నారు. అది, అల్లంతనే వారికి మ్రొక్కింది. కాని ముందుకు రాలేదు. "పెద్దలు ఇప్పటికి మన్నించవలె. ఆ పైన మనవి చేసుకొనేను" — అన్నది.

"మనవు లెందుకే. ఈ రూపానికున్న లోపము మనకు తెలుసునులేవే — ఇలా రా! ఇక మేలిముసుగుతో రా పనిలేదు పైసాలు, ఉత్సవాలకు పయ్యెదకొంగు రొండిన చెక్కుకొని, చెంగున గంతేసి, స్వామిని సేవించుకునేవులే. నీ గొప్పకు తగిన కొప్పు అమరేనులే" అంటూ తలనిమిరి, "ఆట సాగనీయవే" అన్నారు. అది, నివ్వెరబోయి, అంతలో తేరుకుని, "రామన్నగారే!" అంది. వారు, చిరునవ్వు నవ్వారు.

"అయ్యా! ఈ భాగ్యానికే నేను తపస్సు చేశాను. నేనై వచ్చేందుకు బిడియం వేసింది. రమ్మని పిలువనంపే సాహసం లేకపోయింది. ఇక నాజన్మ ఇంతేనేమో అనుకున్నాను.

రాముడే రూపము యిచ్చాడు. రాముడే వచ్చి లోపమూ తీర్చాడు. ఈ మేలి ముసుగు తీరిననాడు, వచ్చి దేవరను సేవించుకునేను. అనుమతించరయ్యా...." అన్నది.

"వారు ఒక్కనవ్వునవ్వి, రఘురాముడు జటాధారి. వరము, వా డీయవలెనే.

వీడు వట్టి రామన్న, వీని సేవలెందుకే.

ఈ రామలింగడు, నీకు శాశ్వతదైవము. నేను ఉత్సవానికి పనికిరాని, ఉత్త విగ్రహాన్ని.

మళ్ళీ మరోసారి, నే నీ ప్రాంతాలకు వస్తే,

నిన్ను చూసి, నీ కొప్పు నిమురక మాననులే" అన్నారు.

"అయ్యా! నా కొప్పున మీ చేతి దీవెన, విరుల సరమై నిలిచేనుగా.

తలచినప్పుడెల్ల, మేలుగా, మీచేయి సోకినట్లు, ఆ భావన తీయవయా!" అన్నది, మనసార మనవిగా, వారు, దయలు మీరగా,

"ఇచ్చినా మెచ్చినా ఆ ఆ రాముడేననే భావన నిలుపవే.

నీకానూత్న మరియాద, నిత్యమూ జరిగేను....." అన్నారు.

మేజువాణీ పునః ఆరంభమైంది.....

— ఒక పర్యాయం, ఏం జరిగినదంటే, నాగేంద్రుడు విహరించే ప్రాంతాన చంపకారణ్యమైతే, మేలుగా ఉండేనుగాని, అని తలచి, రామన్నగారు, ఆ మొక్కలకోసం తునిగ్రామం వెళ్ళడం సంభవించింది. రంగసానితోటలో అవి, కొల్లలు కాని, ఎవరికీ ఇవ్వదు. అమ్మదు. వెలకు దొరకవా అంటే దొరికేను కాని అది, మేలుజాతి వాటినే తీసుకు వెళదాం అనుకున్నారు రామన్నగారు.

తోటలోనే రంగసాని ఇల్లు.

రంగసాని, ఓ బరికె చేతపుచ్చుకుని, కేకలు పెడుతూ ఉరుకుతూంది. ఓ పది పన్నెండేళ్ళపిల్ల పంచె విరిచికట్టి, అందకుండా పరుగెత్తుతూ, తోటంతా కలయ దిరుగుతూంది.

రామన్నగారు తోటలో అడుగు పెట్టగానే, పరుగులు తీస్తూన్న పిల్ల, అటునుంచి, దూసుకుంటూ, ఇటే వచ్చింది. రామన్న గారు నడుమొడిసిపట్టి నిలవేశారు. "ఎందుకోయ్ – ఆ పరుగు" అన్నారు.

"నా పరువు దీసేందుకు!–" అంది, తరుముకువచ్చిన తల్లి. "ఏళ్ళొస్తున్నాయ్.... ఏపోణెములేదు. మగరాయుడల్లే, పంచ ఎగకట్టి చూడండి ఆ వేషం. నేజెపితే వినదు. చేజేసుకుందామంటే అందదూ. రేపోమాపో ఓణి వేసుకునే ఈడు!"

లంగాయే కట్టందే!

రెబటల్లే ఉంటే, లంగా బాగుండదట. గుమ్మటం లాగుండాలట! తనకు బాగుండదట తా నిలాగే ఉంటుందట!

ఏ పెండ్లలన్నా, ఏమేరంగా, ఏదే నీ కూతురు? అంటే ఏం జెప్పేది? ఈ కుమ్మరాం. అని జెప్పేదా? నా ఇల్లు నాతోనే జెల్లు!

ఇహ నా వల్ల కాదు. ఎవరివల్లాకాదు. మంచి రోజు చూసి ఆ రెక్క విరిచికట్టి, ఆ రామన్నగారి దగ్గర కీడ్చుకు పోతా? ఈ తిక్క, అయనొక్కడే కుదిర్చేది! ఓసే పెద్దీ, నా స్వామిరంగా, వారు ఏకళనన్నా ఉండి, నీమీద చెయ్యేస్తే, నీకు ఏనుగుమొత్తంత మొత్తొచ్చి, గున్నల్లే కూర్చున్న చోటనుంచి లేవలేకపోతే, అప్పుడు నా కళ్ళు చల్లగా ఉంటాయే! అంతే నీ కిదే మందు" అంది.

రామన్నగారు నవ్వి, "అవును అదే మందు!" అని పిల్లదాని వెన్ను నిమిరి, నడుంతట్టి, "పిల్లా! నీ కా ఘనత కావలసినంత! నా మనసుతో మోసుకు వచ్చాను. నీ వెన్ను మీద వేశాను! పై మాసంలో లంగాకట్టు. పై నెలలో ఓణి వేసుకో! నడుమలాగే ఉండనీ, నాగరీకత హెచ్చనీ. ఇదిగో నమ్మ నీ పిల్ల. నీ ఇల్లు నీతోనే చెల్లు కాదులే! రాముడు, కానియ్యడులే!

ఎదుటసాని లేందీ, ఎలా ఊరేగుతాడు? గరుడ వాహనం కదలనియ్యడుగా? అ... ఇక, అమ్మ వెంట, ఇంట్లోకి పోవే పిల్లా! ఎండ తగలకుండా ఉంటే

రేపీపాటికల్లా వెన్న ముద్దల్లే ఉండేవు. నీడపట్టున ఉంటే, నీటు పెరుగుతుంది.

వెన్నెల్లో తిరిగితే, కన్ను పెరుగుతుంది. ఓణి వేసుకోంగనే వయ్యారం వస్తుంది. కులికి కులికి, కోటికి పడగెత్తవే ——–" అంటూ తల తడిమారు.

దానికి మొగాన కళ, చూపుల్లో రవంత బిడియం. రంగసాని గమనించి, "అయ్యా, మీరెవరో దేవుడల్లే వచ్చారు!" అంది!–

"దేవుణ్ణి కాను రాముణ్ణి"

"అంటే?"

"వాణ్ణే. నీవన్న వాణ్ణే. తురగావారి రాముణ్ణి!"

"అయ్యా! అయ్యా, ఏమిటి నేను చేసుకున్న పుణ్యం!"

"మా తోటలే నాగేంద్రులవారు, విహరించే ప్రదేశంలో ఓ వాలుగు చంపకం మొక్కలు వేయడం."

"అంతకన్ననా, అయ్యా! అందుకోసం తమరు రావాలా? తమ సెలవైందంటే, యీ తోట బళ్ళకెక్కించి నేను తీసుకురానా?"

"తోట తరలించుకు వస్తే, నీ చిన్నదాని సిగలోకి పూవులెక్కడనుంచి తెచ్చేవే! నాగేంద్రుడికివి చాలులే!"

"తమచిత్తమయ్యా! అయ్యా, మరి, నా బిడ్డ...."

"నీ పెద్దరికం నిలిపేనులే. అది కోరింది రాముడిచ్చాడు. నీవు కోరింది అది కొల్లగొంటుంది."

రామన్న గారి తోటలో, నాగేంద్ర విహారానికి చంపక వీథి ఏర్పడ్డదాయెను.

ఒకనాడు... వారు యథా ప్రకారం అరుగుమీద కూర్చునిఉన్న సమయాన, ఓ పాతికముప్పై ఏళ్ళ బ్రాహ్మణుడు అంగవస్త్రధారి, మాసినగడ్డంతో, రుసరుస, దారిని పోతూ, "రామన్నగారి యిల్లెక్కడయ్యా!" అని ఓ కేక వేశాడు.

"ఏ రామన్న?"

"ఏ రామన్నా, యీ ఊరి మొత్తానికి ఏ రామన్నున్నాడు..."

"ఓ, వాడా! ఎవరినడిగినా చెపుతారు!"

"అహా నువ్వందరిలో జమ కావన్నమాట"

"కామలే. మాట! నీ పేరు?..."

"ఎవరినడిగినా చెపుతారు!"

"నీ పేరు నీదగ్గిర లేదా?——"

"దేశం మీదుంది!" ఆ బ్రాహ్మణుడు కొంచెం పొగరుమోతుగా అనేసి పోయినాడు. రామన్నగారు పోనిచ్చారు.

అనాడు.... సంజె ముదిరిన తరువాత, రామన్నగారూ, శివయ్యా, తోట మొగదలకు వచ్చేసరికి, అక్కడో అడ్డల పాలకీ దిగిఉంది! ఒక బోయీ, వీరిని చూసి పరుగువచ్చి, "అయ్యా, పాలకీలో మా రాణీగారున్నారు. దాహమైంది. మా చేతి నీరు పుచ్చుకోరు. ఏం చెయ్యమన్నారు?" అన్నాడు.

"దయచేయమను, సలక్షణంగా, కొంచెంసేపు విశ్రమించి, దాహం తీర్చుకోవచ్చు" అన్నాడు శివయ్య.

"వారు పాలకీ విడిచిరారు."

"పరువు విడిచి వీరూ రారు!——"

"వారు మా కంట పడరాదయ్యా!"

'మీరు అటు పొండయ్యా! మీ రాణీగారు, వయసు మళ్ళిన వారైతే, మా తోబుట్టువుతో సమానం. చిన్నవారైతే, మా మనుమరాలితో సమానం. మా వద్ద యీ తెరచాటెందుకబ్బీ! మీరు పొండి! అమ్మాయ్, రాణీగారూ, యిలా రా అమ్మా!' అన్నారు శివయ్యగారు, పాలకీ ప్రాంతాలకు వెళ్ళి.

రాణీగారు, తెరతొలగించుకుని వచ్చారు.

"ఆహా! దేవకన్యలాగున్నావు మా తల్లి – యీ వెన్నెల నీ కోసమే వచ్చినట్లుందేమ్మా" – అన్నారు శివయ్య.

"ఏమయ్యా బ్రాహ్మడా, ఏలినవారము, నీవు అని అంటున్నావా?——

ఎన్నడూ రాజదర్శనానికి పోలేదా? నీకు ఎవరికెలా మరియాద చేయాలో తెలిసినట్టులేదే!"

"మాకు, తెలియదమ్మా, మన్నించండి. ఏం మర్యాదల కోరేరో సెలవిప్పించండి."

"మాకు దాహ మౌతున్నదని, సేవకులు మనవి చేశారుగా, మేము యీ కటిక నేలమీద మా పాదము మోపము మీరు పోయి, తెండి!"

"మీరు పుచ్చుకునే గ్రుక్కెడు దాహానికి యిద్దరెందుకమ్మా! మా రామన్న పోతాడులే. రాణీగారూ, మాతోటలో వెండిపాత్రలూ, భమిడి పాత్రలూ లేవు. ఆకుదొన్నెతో దాహం పుచ్చుకునేందుకు తాము అంగీకరించాలి."

'మంచిది, ఆ బ్రాహ్మడిని వేగిరం రమ్మను.'

రామన్న గారు తిరిగి వెళ్ళాడు.

"ఏమయ్యా" అన్నారు రాణీగారు.

"అమ్మా!"

"ఆ వెళ్ళిన బ్రాహ్మడికి వినయమేలేదే, మా సన్నిధిలో తలవంచుకుని నిలుచుండడేం? బిచ్చ మెత్తుకుని బతికే వాడికంత తలబిరుసుతనమేం?"

"అమ్మా! రాణీగారూ, వాడుబిరుసో, మెత్తనో తమకేల! ఆడపిల్ల ఎవరైనా, ఆ సీతామ్మవారేఅని, నే అనుకుంటాను. తాము అన్నదానికి అందువల్లనే ఆగ్రహం రాలేదు. అమ్మా! తమకు, ఆకలా, కేవలం దాహమేనా? దాహమే అయితే, యిలా చిరాకుండకపోను."

"బ్రాహ్మడా, నీవు నోరెత్తకు."

— శివయ్య, తామసం అణచుకుని ఊరకున్నాడు.

రామన్న దొన్నెలో నీరు పట్టి తెచ్చాడు. అందించబోయినాడు. రాణీగారికి మరింత ఆగ్రహం వచ్చింది.

"బ్రాహ్మడా! ఆగక్కడ! మాకు అందించే అర్హత నీకున్నదా?

మీ ఉత్తరీయాలు అక్కడ పరచి, అది, అక్కడ ఉంచు. కళ్ళు మూసుకు వెనుదిరుగు."

వారు, అలాగే చేశారు. రాణీగారు అందుకుని దాహం తీర్చుకుని, ఒక కాసు ఉత్తరీయాల మీదికి విసిరేసి, "తీసుకు సెలవు పుచ్చుకోండి" అన్నారు.

శివయ్య "తమరెవరో సెలవిచ్చారు కాదు," అనగా, రాణీగారు —

"మేము సెలవియ్యాలా? ఎవరినడిగినా తెలుస్తుంది" అంటూ వెనుదిరిగారు. రామన్నగారు పకపక నవ్వుతూ, రాణీగారి చేయందుకుని "ఓరీ!" అన్నాడు. రాణీగారు, "శివయ్యబాబూ పాత దాసుణ్ణి భాగోతుల బుచ్చిగాణ్ణి!" అంటూ సాష్టాంగపడి, లేచి, "మీ ఉభయుల దర్శనంచేస్తే తరించుతానని, మా మేనమామ చెప్పాడు. పంపాడు. ఏదో నా కూసు విద్య మీరు చిత్తగించాలని యీ అవకతవక చేశాను ——" అని చేతులు జోడించాడు.

శివయ్య వాణ్ణి కౌగిలించుకుని, "నేనూ, వీడూ నీ ఖ్యాతి విన్నామురా — నీ మేనమామవున్నాడే. మాలో ఒకడురా. నీవు మాకూ అల్లుడివేరా! అల్లుడొచ్చి మావల భరతం పట్టడం. ఆనందంగా ఉందిరా, అబ్బీ! పదనాయనా పోదాం."

"మా మామలు యీ కటికినేలపై పాదము మోపరాదు. పాలకీ ఎక్కవలె.... యీ అల్లుడు, ఓ హాం — అని కూత పట్టవలె" అన్నాడు బుచ్చిగాడు. రాణీగారల్లే అన్నంతా చేశాడు.

"వచ్చినందుకు ఒక్క పది రోజులుండిపోరా" అన్నాడు రామన్న.

"పది రోజులు కాదు. పొమ్మనేదాక ఉంటా! మీ అమ్మాయినీ, పిల్లల్నీ రప్పిస్తే."

— అలాగే ఒక్క మాసం ఉన్నాడు. వారానికో సారి తన విద్య చూపించేవాడు. అందుకోసం చుట్టుప్రక్కల గ్రామాల ప్రజ, అక్కడే ఉండేది.

రామన్నగారు అన్నాడు — "నీ వేషం చూచి, మగవాళ్ళకు మతులుపోతున్నాయిరా. ఆ బ్రహ్మ నిన్ను ఆడదాన్నిగా ఎందుకు పుట్టించలేదురా? పోనీ యిలాగే పుట్టినా, ఆ వేషం కట్టేక్షణాన అన్నా ఒక కొంచెం ఆ పోణిమి నీ కీయలేకపోయినా డేమిరా?... మన ఎరికను యిలాటి రెండు మూడు లోపాలు కనబడుతున్నాయి. అందుకే కాబోలు ఆయన అపూజ్యుడైనాడు" అంటూ ఆ ముక్కలే పద్యం కట్టారు.

"శివయ్యమావా. యీ మామ పద్య మిచ్చాడు. అల్లుడికి, నీవేమి యిస్తావు?"

— "నా తంబుర చిరతలు, నాయనా. ఎన్నటికో ఓ నాటికి, నీకూ, యిప్పటి శక్తీ ఉత్సాహం తగ్గుతుంది. ఈ వేషాలు పోయే వయసు దాటుతుంది. అప్పుడన్నా ఓ పిల్ల పాపతో వచ్చి, రాముణ్ణి నమ్ముకుని పడుండరా. వేదపారాయణ చేసుకొనేచోట, రాముడు, వెలసినచోట, నీ వంశాభివృద్ధి అవుతుందిరా" అన్నాడు శివయ్య.

వారి పాదాలు కళ్ళకు అద్దుకుని, సెలవు తీసుకున్నాడు, బుచ్చిగాడు...

అప్పటికి రెండేళ్ళాయె — కాటకం.

వాన వెనకబట్టి, గింజ రాలకపాయె.

రామన్న గారి భూమి యావత్తూ, అనగా, జంటుపల్లి, పండకపాయె. కాని, ఊరికి చింత లేకపాయె. వారింట, నిలవ ఉన్న గింజలు ఊరికి సరిపాయె.

కాని, అలా కాలం వెళ్ళబుచ్చనియ్యరే. ఏలేవారు!

ప్రజలకు వారిసిబ్బందీ వత్తిడి, ఎక్కువాయె.

ఏమున్నది యిచ్చేందుకు? పండని చేలూ, పాటి దిబ్బలూ, నిండుకున్న గాదెలూ, ఎండిపోయిన మూగ జీవాలూ.

ఊరు రామన్న దగ్గరకు వచ్చింది. "పరగణా విడిచి పోతే యీ ఒత్తిడి ఉండదండీ." రామన్న "మంచిదే" అన్నాడు. "కాని యింతకాలం వారిపాలనలో ఉన్నాము. ప్రభువులని గౌరవించాము. వెళ్ళేటప్పుడు చెప్పి వెళ్ళడం ధర్మం.

వెంటనే దర్శనమైతే మేలే! కాక, ఆటంకం కలిగిందా, వారికి ఈ వర్తమానం అందేదాకా, అక్కడే ఉండండి. అక్కడే పరుండండి కలో గంజో అక్కడే కాచుకు తాగవచ్చు" అనీ అన్నాడు. ఊరివారు అలాగే చేశారు. వీళ్ళ ఎదుట పడటానికి జమీందారులు జంకారు వాళ్ళను తరిమి వేయించేందుకు వెనకాడారు. అయినా వాళ్ళ అవస్థ ఏమిటో అర్థం చేసుకునేందుకు, మధ్యవాళ్ళు అవకాశం కల్పించకపోగా, యిదంతా ఆ రామన్న ప్రోద్బలం. తమ మీదికి దండు పంపాడు అని, మనవి చేశారు. జమీందారుకు తామసం వచ్చింది. ఈ మూకను చెల్లాచెదరు చేసి, రామన్నను యీడ్చుకు రమ్మన్నాడు.

అప్పుడు రాణివాసమున్న కేతకి గంగి, నాగుపామల్లే లేచింది. "రామన్న గారికి ఆ అవమానం చేశావో, ప్రజలు నిన్ను బ్రతకనీరు" అంది. వారు పెడసరంగా నవ్వారు. భటులను ప్రజల మీదికి దూకమన్నారు.

వాళ్ళు దూకారు. చిక్కన బడ్డారు. వాళ్ళని, అందరూ అక్కడి స్తంభాలకి విరిచి కట్టారు.

కొందరు ఆ ఆవేశంలో కోటలోకి జొరబడపోయినారు. అంతలో తెలివి తెచ్చుకుని, రామన్న గారి ఆజ్ఞ లేదు కదా, అని, ఉన్నచోటే ఆగిపోయినారు.

జమీందారు లోన గడగడలాడి పోతున్నారు. గంగాయ్ ధైర్యం చెప్పి, రామన్నగారి వద్దకు వచ్చి, విన్నవించుకుంది. వారు లేచారు. "ఒరే శివుడూ, అలా వెళ్ళి వస్తారా" — అన్నారు, లోపలికి వెళ్ళి.

"ఎలా...?"

"అలా దివాణం దాకా?"

"ఎందుకూ?"

"ఏలినవారి..."

"దర్శనానికా?"

"దోషమా..."

"తిండికి లేదని దేవిరింపా?"

"మరో దేవురింపుకు."

"రామా! రామ కవి కుంజరు హస్తము క్రిందు చేసి తాపండక బంటుపల్లి. అది పండెనో... యీ కనుమూల ధారుణీ మండల నాధుబోలు ఒక మానవ మాత్రుని వేడబోవునే..." అని వాపోయినాడు శివయ్య.

"శివుడూ, వాల్మీకుల వారికిమల్లే, కన్నీరుతో కవనమొచ్చిందిరా, నీకు!" అని నవ్వుకుంటూ శివయ్య మొర్రో మంటున్నా వినిపించుకోకుండా, దివాణానికి చేరుకుని, ఆ పరివారం కట్లు విప్పించి, తాను వచ్చానని, లోనికి వర్తమానం పంపించారు. జమీందారు వణుక్కుంటూ వచ్చాడు. రామన్న వారిని చూచి

చేజాపి, "ఏలినవారూ, యాచిస్తున్నాను. కోరినది దయచేయండి. నేకోరినది వీరి మీద తమ కటాక్షము! ఇంతకాలమూ మీ పరివారము మిమ్మల్ని బంది చేసింది. మీ ప్రజలకు మిమ్మల్ని దూరం చేసింది.

కోటలో ఉంటిరి. పరగణా పండెనో, ఎండెనో మీకు ఎరుక లేకపోయింది. వీరు మీ మీదకు దండు రాలేదు. తమ సన్నిధిలో మొరపెట్టుకుందామని వచ్చారు. నేనే పంపాను.

ఎలాగూ కోట వెలుపలికి దయచేశారు కనుక, మన గ్రామాల సౌభాగ్యం తిలకించి రండి. నేను తమ వెంట వచ్చేను. చేలుగావవి నెర్రెలు. ఒక గింజలేదు. నీటి చుక్కలేదు. చిత్తగించండి. ఇందులో తమ పాలు స్వీకరించండి" అన్నాడు.

—అలాగే తీసుకువెళ్ళి పరగణాఅంతా వెంట ఉండ, చూపించాడు. జమీందారు కంట ఏకధార! "రామన్న గారూ!" అంటూ, వారిపాదముల తడిపి వేశారు. రామన్న గారు నవ్వారు "ఏలినవారూ, మీ కన్నీట తడిసింది నేల. యిక కరవుండదు" అన్నారు. అప్పుడే ఓ దిక్కునుంచి కారుకమ్ముకొస్తూంది. నాగేంద్రుణ్ణి స్మరించారు, రామన్నగారు కుంభవృష్టి తడిసి, మనిషైనారు, ఏలిన వారు.

ఆ ఊరు లేదు ఆ మేరకిప్పుడు పేరు లేదు. రామన్న గారు కూర్చున్న ఆ అరుగు లేదు. ఆ తోట లేదు. ఆ పుట్టలో ఆ నాగేంద్రుడున్నాడు. ప్రజల జ్ఞాపకంలో వారున్నారు! వారి ఆనంద మున్నది!

★ ★ ★

# కనక జానకి

– పక్కలో కూర్చొని, చక్కలిగింతలతో నిదుర మెలుకువ తెప్పించినది: – "పగలు...నిదుర..." నా నిదుర కలత చూసి పకాలుమన్నది... "పనికి.... చెరుపంటారు... పెద్దలు––" చెక్కిలి నొక్కుకుపోతూంది: లేచి కూర్చున్నాను, మత్తు విదిలించుకుంటూ–

"రేపు ఉదయానికి తిరిగి ఆఫీసుకు జేరుకోవాలా... రాత్రంతా ఇహ.... బండి కుదింపులో నిదురలేక"

"పక్కను నేమూ లేక..."

విరుచుకుంటూన్న, ఒళ్ళు ఆ పాళాన ఆపి, కొంచెం చిరాకుగా, ఎకసెక్కం పనికిరాదనే అదమాయింపుతో, ఏమి టీ వాలకం? అనే ప్రశ్న, చూశాను.

"ఇంకా మీకు నిదురే?" నేను రెప్పలు ధూకుడుగా అల్లార్చాను.

"మేలుకున్నా ఇంకా కలలే" – పాఠం చెపుతున్నట్టుగా నన్ను పసివాడిక్రింద కట్టినా తొణకని బెణకని ఠీవి చూసి చూసి, ముందుకు వచ్చేసింది.

"నీవు అంటూన్నది ఏమిటో తెలుసునా" గదమాయింపులో కోపం దాచుకో లేకపోయినాను.

"ఆహో మరి, మీరు అనుకుంటూన్నదీ తెలుసు."

నా మొగం రమారమి కందగడ్డ అవుతూన్నది. ఆమెకు ఏమీ, చీమ కుట్టినట్టుగానన్నా లేదు.

అన్నీ అబద్ధాలు."

"అవును. మీరు ఆడినవి, అనుకున్నవి."

నాకు వింటూన్న కొద్దీ తామసం ముంచెత్తుకువచ్చి జవాబు చెప్పడానికి నోటమాట పెగలలేదు.

–– ఆమె నోరు చేసుకుంది.

"అవును ముమ్మాటికీ మీరు నన్ను విడిచి బ్రతుకలేరు. నేను లేనిది ఇక మీ జీవితం ఎడారి: నేను ఉంటే బ్రతుకంతా బంగారుపంట – మూడునాళ్ళ ముచ్చటలో మనము మురిసిపోయిం దెంత? ఎన్ని అబద్ధాలు! ఎంత ముందు చూపున్నదండీ మీకు?"

"అలాగా?"

"మరి, యిలాగా కూడాను: పట్నవాసం నుంచి బంగారుతండ్రి పల్లెటూరు పావనంచేయడానికి దయచేయగానే పడుచెవతే ఊరుకుంటుంది? ఊరుకోని వయసుగత్తె ఆసామి పంట పండించేందుకు ఎంద రెన్ననినా, హద్దుమీరకుండా ఎలా ఉంటుంది: ఎవరిమాటో కాదు. నేననేది, నన్నే: ఏంచేశాను, మీరు వస్తూన్నారనగానే ఎవరో ఎలా ఉంటారో అలాటివా రవునో కాదో కాకపోయినా అదెంత పని

మన చేతిలోదేకదా, అని ఎన్నెన్ని ఆలోచనలకు పోయినాను. ఎప్పుడు వస్తారో అని ఎదురు చూశాను. రాగానే పనిగా మీకంటబడి చూసి కవ్వించాను. తలుపు చాటున నిలుచుని మీరు చూడకుండా చూసిచూసి, తల వూచాను. బిడియం విడిచి పిలచాను; అవునా?"

"నా కంత గర్వం లేదు."

"లేకపోతే తెచ్చుకోండి, నన్నుచూసి అయినా నేర్చుకోండి నాకు నేను అందగత్తెనని ఎంత గర్వమనుకున్నారు? అందానికి కాని, ఐశ్వర్యానికి కాని నా కాలి గోరికి సరిపోయేవారు, ఈ ఊరిలో ఎవరున్నారు?"

"అవును, ఉండరు."

"ఒకవేళ ఉంటే, మీరు నా కోసమనే ఉండరు.

"అది నేను ఒప్పుకోను. నీతి ప్రధానంగాని."

"బూతుకు కూడానా? మీ బులిబుచ్చికాలు నమ్మే అంత నంగనాచిని అయితే, మీ రాడేమాటే నే పాడేపాట అయేది...అప్పుడు మీరు, మనసులో అంచనా వేసుకున్నందుకు సరిగా మూటాముల్లే కట్టుకుని రెండో కంటివాడికి తెలియకుండా యింటిలో పాపలను యింటిలోనే విడిచి, మీ వెంటబడి, మీరు ఎక్కడికి వెళ్ళితే అక్కడకువచ్చి తాళి కట్టని తలుపుచాటు కాపురంచేస్తూ, మీరు రమ్మంటే రావడం, పొమ్మంటే పోయేచోటు లేకపోయినా పోవడం... అదేనా మీరు నేర్పే నీతి?"

"నీవు పొరబడుతున్నావు... నీమీద నాకు పవిత్రమైన ప్రేమ."

"ఒళ్ళు తెలిసే మాటాడుతున్నారా... యింకా నిద్రలో కలవరింతలేనా, మీరంత పవిత్రమైన ప్రేమ ఉన్నవారని తెలిస్తే మీ చాయలకే నేను రాకపోదును; అదంటే నాకు అసహ్యం."

"ఆ-హాఁ..."

"అవును భార్యకు భర్తమీద, భక్తునికి భగవంతునిమీద .... అలాటి అనురాగం పవిత్రమని అంటారేమో, అది నాకు ఏలా తెలుస్తుంది. భర్త లేడు. భర్త లేకుండా భార్యాత్వం నా నొసటను విధిగా వ్రాసిన భగవంతుడు ఉండీలేడు."

– చీకటి తప్పుకు వెంపరలాడే ఒప్పులకుప్పలందరూ తెచ్చుకునే సాకే ఆమెకూ చిక్కిందని నా వెనుకటి అనుభవాలను పోల్చి చూసుకుని నాలో నేను నవ్వుకున్నాను. అది ఆమె ఏలాగో కనిపెట్టింది. మళ్ళా అందుకున్నది.

"అందుకనే మీరు అనుకుంటున్నారు. ఆ అగచాట్లే నిజమై ఎందుకూ కొరగానివాడే నిజముగా మగడైతే ఎందుకు తను మనసిచ్చినవానితో లేచిపోరాదూ అని. అంతేనా? మీరుకాదని బోరాయించబోకండి.

"నేను ఎందుకు యెవరితోనైనా లేచిపోవాలి?....

"మీ మునసబుగారికి, మా అక్కయ్యను మొదటి మనువుకు యిచ్చారు: కాపురం లేక వయసు గడపలేక ఆమె అయేడే మా పాలెగానితో మరో తాలూకాలో కాపురం పెట్టింది. కడుపు ఓనాడు నిండనీయండి, నిండక పోనీయండి, కరువుదీరా మగడంటూ ఎవడో ఒకడు దొరికినదే చాలు పదివేలనుకున్నది. దాని మానాన అది సుఖపడుతూంది. అంతకుమించిన నోములు నోయలేదు: బూతులో నీతి నిలుపుకుని ఒకడి నీడనే ఒదిగి ఉంది.

"మా బావకు నన్ను కట్టబెట్టారు: మావాళ్ళు అంతా సిద్ధమే... అల్లుడినోట శని ఉన్నదని మావాళ్ళకీ, ఊరివారికీ తెలిసినా, ఆస్తిచూసి అది పరాయిగా పోకుండా, నన్ను ముందుకు త్రోశారు.

"నేను మరో మరో – దాన్నయితే తిండీతిప్పలో తినక యేడ్చి అందరినీ యేడిపించి ఏ నూయో, గోయో చూచుకుంటానని హంగామా చేసి కొంపంతా ఓ కొలిక్కి దీసుకు రావలసింది. కాని పెళ్ళిమాట వినగానే ఎగిరి గంతేసినంత సంబరపడి సైc అన్నాను. ఇంకా ముహూర్తం ఎన్నాళ్ళో ఉన్నా అవాళనుంచే అక్కయ్య నగలన్నీ పెట్టుకుని, కట్టిన కోక కట్టకుండా దాని చీరలన్నీ కట్టుకుని నా అంత సిగ్గు మాలిన శిఖండి యింకొకతె లేదన్నంతగా తయారయినాను, అవును. నాదేంపోయింది? నలుగురూ నన్ను చూసి నవ్వితే, యెందుకో తెలియకపోతేనూ నేను బిడియపడటం. అయినా నవ్విన నాపసానెవతె మా పరగాణాలో అన్నిటిలో నన్ను మించే దొరసాని?

"లోకానికి జ్ఞాననేత్రాలేకాని, అవసరం వచ్చినపుడు అసలున్న కళ్ళు మూసుకు పోతాయి. అది, నావంటి దానికి యెంత ఉపకారం? అందరూ అన్యాయం అని నా పెళ్ళికి అడ్డుపడి చెడగొడితే నాకు యింత న్యాయం యెన్నటికన్నా జరగడానికి వీలుంటుందా?

"లోకం ఏమనుకుంటుంది. ఏం ఉంటేనేం ఏం లేక పోతేనేం. యేడుతరాలు గడచినా తరగనంత సంపద ఉంది. పిల్ల సుఖపడుతుంది. అదంటే మెసలుకునే నేర్పులేక అలా అధ్వాన్నమైపోయింది కాని. ఇది తెలివిగలబిడ్డ! ఇంతకూ దానికి అదృష్టం ఉండి నిండిన యింట మెలగవలసిన యోగం, త్రోసుకు వస్తూండబట్టే, ఆ పెద్దదానికి అలా పోయేకాలం వచ్చింది. ఏ దైవమో తిన్నగా చూస్తే, దానికి కడుపున రెండు కాయలు కాచి....

"నన్ను నవ్వనీయండి. ఇప్పుడా సంగతులన్నీ తలచుకుంటే ఉక్కిరి బిక్కిరిగా చక్కిలి గిలవుతూంది. నా కడుపున కాయలుకాయడం!... లోకం కళ్ళు మూసుకుని, అక్కరలేని అబద్ధాలు ఆడుతుంది: దైవం తలవని తలంపై అనుకోనివి కూడా నిజం చేస్తాడు. ముసలం కిసలయించితే... ఆ మగనితో నాకు నెల మసలడం...

"ఆయన ఎన్నడూ నా జోలికి రాడు: ఎద్దల్లే పొలం పోతాడు. మునసబీతో పొద్దస్తమానమూ వేగీ, మొద్దల్లే నిద్దరపోతాడు, ఆ పోడిమే యేమిటో యెరుగని పుటక; అది అందరూ ఎరుగున్నదే.

"అందుకనే నేను తొలిసారి నీళ్ళోసుకున్నానని తెలియగానే ఊరు అట్టుడికినట్టుడికి పోయింది. ఎవరా ఆ రాయడు అని ఆసామీలందరూ అంచనాలు వేసి చూశారు. అంతుచిక్కలేదు. నన్ను నిలవేసి "ఎవడే నిన్ను నిలువు దోపిడిచేసింది?" అని అడగడానికి ఎవరికీ నిబ్బరం చాలలేదు. ఇంటి ఆయనకు ఆ గొడవే పట్టించుకో నవసరము లేదు.

"లేకపోతే మానె – మనిషైపుట్టిన తరువాత, ఆ మాత్రం అభిమానమన్నా ఉండకూడదా అంట? అబ్బే! ఆ విషయంలో ధర్మరాజు; చేతకాని మగడు ఏమో చేశాడని వెనుకటికి ఓ సామెత ఉంది. కాని అందరూ అలాంటి వాళ్ళు ఉండరు. అందులో మా మామ: – సరి నా యిల్లు బంగారంగానూ... నన్ను యిచ్చింది ఎక్కడో పరాయి చోట కాదు. సయామూ మేనమామకే అని చెపుదామని మొదట

అనుకుంటూనే అది వదిలి ఎక్కడో ఎత్తుకున్నాను. అంతలో ఉంది నా తెలివి – అఁ, అబ్బ! నవ్వకండి. కొంటెతనం చేస్తే నా మీద ఒట్టుసుమండి. వదలండి, మాటరానీయకుండా చేస్తే మీతో మాటాడను అమ్మ! ఆశే ఊహూఁ ఎప్పుడూ మీకు అదే రంథి...అదే. మా ఆయన కుంటేనా అందులో వీసపాలైనా...."

పల్లెటూరి పడుచుకు అంత ప్రౌఢతనం... అలా పలుకుతూంటే వగలై చిలికే రసాలు, నే నెలా వదలగలను, ఏనాటి పుణ్యఫలముగానో చేజిక్కిన విధానాన్ని? కాని ఆమె కాదు. నేను చిక్కింది! బలిమితో బలవంతంగానైనా మరో మారు దక్కించుకోవాలని పెనగులాడినా ప్రయోజనం లేకుండా చేసింది నవ్వుతూ ఎంత ఆగడమైనా చేయగలదు; నన్ను నవ్వించగలదు, కవ్వించి....

"మా మామ, అందుకుమాత్రం దేవుడివంటి వాడేనండి. ఏ మాట కామాట చెప్పాలి, ఎవరు ఎంతగా అయినా యెద్దేవా చేయనీండి: మొగంమీదనే వరుస, పరాచకంగా ఎన్నైనా అననీయండి ఆయనకు నా విషయంలో చీమైనా కుట్టదు; మాయలేదు. మర్మంలేదు."

"ఇంకా పొగుడు."

"తప్పలేదు. లేనిది అవునంటే అది కాని : ఆయన గుణాలకేం."

"అది తప్ప–"

"అలా వెక్కిరిస్తే చెంపమీద ఎరుపు చెరగనీయను. నా చేతి చురుకు రుచి తెలుసునా?"

"రుచి మరిగాను గనుకనే."

"ఇక మరచిపోండి. ఈ రవంతసేపూ మాటకు అడ్డం రాకండి. కథ చాలా లేదుకాని మీకు వేళమించుతుంది. బుద్ధిగా మంచి బాలునివలె చెవులు దోరచేసుకుని నేను చెప్పేదంతా వింటే చివరకు ఏదో అప్పటికి నాకు తోచింది మీకు...."

"నీ దయ..."

"అలా గుర్రం దిగండి, గడుసుతనానికి పోక:– ఊఁ మా ఆయన లాగానే నేనూను: మనసులో ఒకటీ – మాటాడేది ఒకటీ కాదు. చెప్పేది ఎంతో చేసేదీ అంతే. నేను చిన్నప్పటినుంచీకూడా అంతే.

"ఎవ రేమనుకుని పోతారో అని చీటికీ మాటికీ వెనుదీసే ఘటాన్నే అయితే నే నీపాటికి యిలా ఉండేదాన్నా? యిలా నిభాయించుకుని వచ్చేదాన్నా? స్తంభంచాటు రంభనుకాను. అన్నింటికీ చాలినదాన్ని గనుకనే అమ్మా నాన్నా అంకెళ్ళు నొక్కుకుని ఊరుకున్నారు: అంతకన్న ఏమన్నా అంటే నేనూరుకోనుగదా? అమ్మమ్మ...ఏళ్ళు వచ్చినదాన్ని గదా, ఏమన్నా అది నామీద తిరగబడవస్తుందా అని మా పాపడు పోరుపట్టి ఏడుస్తూంటే తొట్టె కదిలిస్తూ, శాణాతనంగా "ఎవరికి పుట్టిన బిడ్డరా ఎక్కెక్కి ఏడుస్తూంది!" అని అక్కసు వెళ్ళ బోసింది. మా పెద్దవాడి పుటకలకి అందరూ ఆ ముసలిదాన్ని ముందుకు తోసి, ఆ మాట కాస్తా అనిపించారు. ఆ సంగతి నాకు తెలుసును. అపాళన నేను ఆమెమీద విరుచుకు పడ్డాను. ఝుంయ్ ఝుంయ్మని ఎవరూ నోరెత్తకుండా పట్టుకు దులిపి దులిపి వదలిపెట్టాను. కుక్కిన పేనుల్లాగ ఎవరి మానాన వారు తప్పుకున్నారు.

"చెప్పి చెప్పి తగులుకుపోయిందని శాస్త్రం ఉంది లెండి వెనుకటికి – నా తప్పేమీ లేదు. అప్పుడు అలా అనుకుని ఆ పెళ్ళికి ఒప్పుకున్నాను. అక్కయ్య

ఎందుకు లేచిపోయిందో అందరికీ తెలుసును: దానిమీద ఎవరూ జాలిదలచరేం? నిజంగా అది నాకన్న నిష్కల్మషమైన మనసుది. మొదటనే తగినవాడినిచూసి చేస్తే వంచిన తలఎత్తకుండా దాని కాపురం అది చేసుకుంటూ బ్రతికేది. అలాకాదని ఆస్తికోసం ఆశపడి, ఈ అర్భకుడికి దాన్ని అంటగడితే ఏలా తెల్లవారను? మొగుడంటూ ఉండీ ఒకటే, లేకా ఒకటే అయితే, నగా – నాణెం చూసుకుంటే కడుపు నిండుతుందా? ఎందుకు మళ్ళా కన్న తల్లీ, తండ్రీని? చాటూ మాటూ అంటూ దానికి సరిపడదు. అందుకని మనసుకు నచ్చినవానితో ఢంకామీద దెబ్బతీసి లేచిపోయింది... ఇక్కడనుంచి లేచిపోయింది. అక్కడ అదీ, అతడూ సుఖంగా ఓ యింటి వాళ్ళై చిలకాగోరింకల్లాగా చూడముచ్చటగా ఉన్నారు.

"అక్కయ్యే కాదు ఎవతె మా అయన్ను చేసుకున్నా ఆ పని చేయవలసిందే. అంతకన్నా మరో దారి ఏముంది? ఆయన పుణ్యంకొద్దీ ఒకవేళ నేనుగాక ఆయన లాగానే ఏ పోడిమీ లేనిదానికి పుస్తెకడితే అప్పుడు యిద్దరూ తలో మూలా పడి ఉండి కొంగజపం చేస్తూండేవాళ్ళు. అయినా అలాటి పెళ్ళి?...అసలు ఆయనకు పెళ్ళి ఎందుకు?...

"అందుకనే మా వాళ్ళు, మా ఆదుర్దాపడ్డారు. మొదటిలో; ఏ వేళప్పుడు యిల్లు నాలుగుమూలలూ చక్క బెట్టుకుని ఎవడినో తీసుకు ఎప్పుడో అప్పుడు పుట్టి ముంచుతాననుకుని నిమిషం ఏ మారకుండా ఎంతమంది నాకు కాపలా! నే నేం అంత తెలివి తక్కువదాన్నా! వీళ్ళకు అసలు నా మనసులో ఉన్నదేమో అంతుచిక్కనిస్తానా?

"నే నెందుకు లేచిపోవాలి? నాకు యిక్కడ ఏం లోపం? ఇవన్నీ విడిచి ఏ దేశాలోపట్టిపోతే యింత వైభవం ఉండేదా? యిల్లు నాది. ఇంటి ఆయన నావాడు. ఇక్కడ ఉంటే నా యిష్టం వచ్చినట్లుంటాను. ఇల్లన్న తరువాత మరి పిల్లా, మేకా ఏమీ లోటులేకుండా ఎవరో ఒకరు చూచుకు పోవాలిగద. ఆయన కడుపులో చల్ల కదలకుండా అంతశ్రమా నేనేపడి ఆయన వంశం నిలవబెడుతున్నాను. నిజంగా మావాళ్ళకే ఆ యింగితం ఉంటే రోజూ దీపం పెట్టే వేళకు నాకు చెయ్యెత్తి దణ్ణం పెట్టాలి.

"అక్కయ్య బ్రతుకలా పాడుచేశారనే కచ్చకొద్దీ కాదు నే నిలా చేయడం. అందరికీ బుద్ధులు నేర్పే అంతటి దాన్నా నేను? నన్ను చూసి ఎవరన్నా బాగుపడితే... నాలాటివాళ్ళు, నాకు అదే పది వేలు. "ఆమె పట్టినవోము లోకమంతా పట్టింది." అన్నట్టు వ్రతమూ చెడదు... ఫలం ఎప్పుడూ దక్కుతుంది.

"ఇంతా విన్నారుగదా? యిప్పుడు చెప్పండి జవాబు, నేను అడిగిన దానికి – యెందుకు లేచిపోవాలి? అవతలవాడు ఇంద్రుడైనా, చంద్రుడైనా సరే పోయి అవతల యింతకన్న బావుకునే దేముంది? మీమీద కోపంలేదు. మీరేదో లోకరివాజు ప్రకారం అనుకున్నారు. అన్నీ ఉన్నదానికి మన అదృష్టంకొద్దీ అంటిసా అయినాముకదా. అది యిక మనచేతిలోది; యెలా ఆడిస్తే అలా ఆడుతుంది తప్పకుండా వెంటాడు తుంది. మనల్ని చూడగానే కీలుబొమ్మయి పోయింది. సొమ్మంతా కట్టుకుని... రమ్మనకముందే, రానీకపోతే విడిచి బ్రతుకలేనని బ్రతిమాలుకుంది. మనమే ఆ మాటలన్నీ అంటే, దానికి మమత మరీ చెలరేగి కన్నూ మిన్నూ తెలియక....

"కాదనకండి. అన్నా నేను నమ్మను. కోరి, ఒక్క సారి కూడితే, వారు వీరవుతారని సామెత లేదూ? నాకు తెలియవూ మీ వగలన్నీ? నాచేత ఫల్ మోహనరంగా అనిపిద్దామనుకున్నారు. అనేదే, నా అంతటి రాలుగాయ కానిదెవతె అయినా! మన్మధుని మించిన సరసుడు మనసిచ్చినందుకు మాట దక్కించుకోవాలంటే ముందు, మూట దక్కించుకో వద్దూ. అవునండీ, నేనే యింతటి ఆసామీ భార్యనుకాక ఏ కూలీనాలీ బికారీనో అయితే నజరుగాఉండి, నచ్చితే పిలిచో, పిలిపించుకునో....అందుకు మీకు తోచిన విలువ యిచ్చి తొలగమనేవారు. మెడను కట్టుకు ఊళ్ళ వెంట ఊరేగేవారా? అది లాభసాటిబేరం కాదు. ఇది అయితే మీకు మరియాద. ఊరిమీదకు పోయిన ఉద్యోగి ఉత్తచేతులతో తిరిగిరాకుండా కొత్తపిట్ట నోదాన్ని పట్టుకు వచ్చాడంటే వీరెంత ఘనులని... నలుగురిలో మీ కెంత మరియాద!

"అన్నీ తెలుసును. ఔననండి, కాదనండి. మా బాగాయె. అందరికన్నా, మీరేం కొండదిగీ రాలేదు. దిగివచ్చినా ఇంతకుమించి వచ్చేదీలేదు.

"ఇది మీకుకొత్త. నాకు కాదు. అందుకూ అలుక యేనా? అవును మరి. మీరే. నేను మొదాటకోరిన వారైతే మీ మగసిరి కెంతటి బిరుదు? పతివ్రతను పాడు చేసిన గౌరవం, వెనుకనే యెవరో తన్నుకుపోయిరి! – మీకు దక్కకుండా. అప్పుడు అయినా రాకపోతిరి. పోనీ, అయినా... ఆ కొత్త మోజులోనైనా యింతే. నేను మీతో లేచి వచ్చేదా న్ననుకున్నారా? ఎన్నటికీ .... ఊహుఁ.

"ఎవరూ నాతో యింత నాటకమాడలేదండీ? ఏదో రావడం. ఆ వేళకు నాతో అలసిసొలసినందుకు అదే పది వేలనుకుంటూ, అలా ఎవరిత్రోవను వారు అతిఆశకుపోకుండా అడపాదడపా...అదైనా యిందుకోసమని కాకుండా ఏదో మళ్ళా అల్లా కలసివచ్చినప్పుడు ఎప్పుడైనా....

"అలా ఉంటే కలకాలమూ మనసులో నిలిచిపోతారు. కలిసిఉంటే మూడో నాటికి మొగం మొత్తదూ?

"మా పాప తండ్రి, మీ హేమను కన్న వారు, వారిద్దరూ... మీరు తీసిపోయినవారు కారు. మీ ఫాయాలోనే, మీలాగే వచ్చారు. వచ్చినందుకు దైవం తలచినటులుగా వరాలిచ్చారు. అదీ ముచ్చట...

"మరి యీసారి పురుడు పోసుకున్న తరువాత, పేరేం పెట్టమంటారు? బారసాల చేసుకునేనాటికి కబురు పంపుతాను. ఎంతతీరని తొందరపనులున్నా వస్తారు కాదూ, బదిలీ కాకుండా మావాడనే యేలుతూంటే?...

"కథ వింటేనే కడుపునిండుతుందా, అని, మళ్ళా అందుకోసం మారాం చేసినా అంతే. ఇకచాలు.

"నాది కడుపునిండిన బేరం. యెందుకు అలా నేను ఎవరితోనైతేమాత్రం లేచిపోవాలి? నాకు యింతకన్న ఏం కావాలి?"

మెలకువ తెప్పించి నన్నింత చులకనచేసింది కాని యింకా యెన్నడోగాని యెన్నటికైనా యేమో రాని కాలం... కథలో గడపకుండా కల గననిచ్చినా కొంతమేలే! కాని ఆమె మాటలన్నీ నిజంగా నిజమనేగా... నాచేతగాని తనానికి కోపం. అందుకు నన్ను నే నేమనుకోవాలి?

★ ★ ★

# రసమంజరి

"అచ్ఛా! బులావ్..." అని ఉన్న పాళాన కారు యిచ్చి పంపాను, తక్షణం... యెంత ధరపడినా కొట్టుకు రమ్మని.

—— వచ్చిన పనేమో అయింది, రోజంతా కులాసాగా గడచిపోయింది. రాత్రికి రైలు లేదు.

మాంచి భోజనం, మజా అయిన చల్లగాలి —— మామూలు వేళకు మునుపే, మనలో కామన్న కన్ను తెరిచాడు – వేళ కనిపెట్టి .. బాషా, సమీపాన కూర్చుండి, ఆకులు చీల్చి యిస్తున్న వాడల్లా లేచి, దూరంగా జరిగి నిలుచుని, వినయం ఒలికిస్తూ ... నా ముఖంవంక చూసి ... తల వంచుకుని, చిరునవ్వుతో ఏదో చెప్పబోయే ఆదుర్దా కనబరుస్తూ ——

... అదంతా ఎప్పటి భాగవతమే; నేను పాతకాపునే అయినా, బంగాళాలో మకాం చేసినపుడల్లా, యీ నాందీ ప్రస్తావనలు లేనిదే... అసలు బొమ్మతెర దీసుకురాదు. ఈ విషయంలో, మూడు ముక్కా కలదీరిన బంటునిన, వాడికి తెలిసినా, కవ్వించిన తరువాత కాని, అసలు కథలోకి దిగడు సరి, వాడికి గురువాజ్ఞ, అది కాబోలు, మరి.

—— అయ్యా? చిదిపిదీపం పెట్టినట్టుంటుంది. మీరు చూస్తే వదిలిపెట్టరు. ఆ మాటా, మంచితనమూ... అసలు యీ రకమేకాదు: ఏదో తమలాటి ప్రభువులు ఎన్నడన్నా పిలిపిస్తే ఏదో ఖుషామత్...అంతేకాని... అయినవాడూ, కానివాడూ ఆ పిల్లదానివంక చూడటానికే వీల్లేదు.. చాలా హైక్లాస్... "మనసు ప్రధానంగాని... డబ్బెవరికి కావాలోయ్...." అని నాతోనే అన్నదండీ నేనేదో మాటవరుసకు ఒకటి రెండుసార్లు మాంచి భారీబేరాలు తీసుకువెళితే... అంత హుందాతనమూ... అందుకు మించిన అందమూ... (బాషా... తురక బిడ్డడైనా... నాకన్న తెలుగు బాగా వచ్చును... వాడి వ్యాపారం అవసరంకొద్దీ... అలవాటై పోయింది.)

నేను అన్నింటికీ తల ఊగించాను: మనం కార్య వాదులం... మాటలతో మన కేంపని?——

కారు—— నిమిషంలో తిరిగివచ్చింది... వెన్నెల్లో... నా గది వేపు... కారుదిగి... తెల్లచీరె... నడిచి వెళుతూంది. బాషా దగ్గరకువచ్చి... సకిలించాడు; నేను లేచి.... లోపలికి వెళ్ళాను... నేను రావడం విని.... చీకటిలోనుంచి లేచి... దీపం వేసింది...

మనిషిని పోలిన మనిషి —— మనకు తగలడం —— సామాన్యంగా —— సామెతలలోనే కాని —— మామూలు కాదు. అవునా, కాదా అని అంచాయించి చూసి —— ఆలోచనలో పడకుండా —— ఒకాళ్ళ నొకరం గుర్తించుకున్నాము. కాకల

దీరిన బంటును అయినా – ఆవేళప్పుడు, రాజమ్మ – నాకు తార పిల్లడం – కలలోనైనా అనుకోని విషయం.

వచ్చినవా రెవరో తెలిసిన ధోరణిలో – ఎందుకు పిలిపించానో (ఎవరినో) ఆ సంగతి మరచిపోయి – ఆమె సంగతి మనసులో తలచుకుంటూ – మాటాడ వలసినది ఎంతో ఉన్నా – ఎక్కడ మొదలుపెట్టాలో తోచకుండా – చూచిన కొద్దీ కన్నూ మిన్నూ మీరుతూన్న కోపంతో––

రాజమ్మను – నేను మాంచి పైలా పచ్చీసుమీద వుండే కుర్రతనంలో ఓ మాదిరిగా బాగానే ఎరుగున్నాను. అప్పటికి బహు ఉమ్మరంమీద ఉంది – అలా సంపాదించుకుంటూ పోతే – ఆ రోజుల్లో వడ్లకు ఒళ్ళూపై తెలియని ధరలు – పదిసార్లు ఒగ్గితే బంగారు పిచ్చుక అయిపోయేటంత – భారీ సంపాదన ఉండేది – సంసారికి వుండవలసినంత ఫాయాతో, పొదుపుతో – ఎన్నికలోకి వచ్చిన సానిపాప–

అయేడు వేసవి కాలంలో – మొదట పత్రికలో చదివి – అది నీలివార్తయేమో అనుకున్నాం – రాజమ్మ ఉన్నట్టుండి పెళ్ళి చేసుకున్నదంటే – ఆమెకు అంత అవసరం ఏంవచ్చిందా అని – ఆ రోజంతా అందరం పరిపరివిధాల ఆలోచించాము. నాలుగురోజులకు పేపరులో దంపతుల బొమ్మలు పడ్డాయి. ఇక ఒప్పుకోక తప్పదుకదా. నిక్షేపంలాంటి పిల్లది అపమార్గాన పడిపోయింది కదా – అని మా కళాహృదయాలు గడబిడ చేసినవి. కాని – ఎటుచూసినా – మనకు అందుబాటు తప్పిపోయింది. గనుక యిక – మన కెందుకూ – అని ఆమె సంగతి యితర ధ్యాసలతో కలిపి – మరచిపోవడం అలవాటు చేసుకున్నాము. చేసుకున్న వాడుకూడా మా భాయీల జాతి వాడే కావడంవల్ల – అభినందించడాలూ, అనవసరంగా టీకి తయారుకావడాలూ – యిలాంటి హంగామా ఏంచేసినా మరీ డెలికేట్‌గా ఉంటుంది గనుక లోపల ఎంత పురపుర ఉన్నా వాళ్ళు కంటబడకుండా తప్పించుకు తిరిగాం. ఇంతకూ వాడు అదృష్టవంతుడు – తలకుమించిన పడుచును – తనదాన్నిగా – పిలువకుండా – చేసుకున్నాడు – వలచడమూ – మేమూ, మా మొగమూను!

రోజులు గడచినకొద్దీ... వాళ్ళు యిద్దరూ కులాసాగానే కాలం గడుపుతూన్నట్టు... కబుర్లు తెలుస్తూండేవి. తరువాత... ఏమిటో జీవితంలో... తలకొక దారి...కొన్ని వెనుకబడి పోతూంటవి....అన్ని వ్యాపృత్తుల్లో: రాజమ్మను మరచిపోక పోయినా... ఆమెను చూసేదాకా...జ్ఞాపకం లేదు. మళ్ళా, అలా...మామూలుగా తయారు కావడం... అయితే...అదివరకు నేను విన్నదంతా అబద్ధమేనా?... అప్పుడైతే...మనకెందుకని ఉక్రోషంతోనే ఊరుకున్నా...ఇప్పుడు...

అమాటే అడిగాను...

'అదంతా నిజమే... అబద్ధాలు మాత్రం మీ చెవుల దాకా రాలేదు. అందుకు నా మంచితనమే కారణం...' అన్నది.

'అంటే...'

'అంతా అర్థం కావాలంటే.... కథ చాలా పెరుగుతుంది...'

'పెరిగేది ధరకాకపోతే.... కథ ఎంతైనా... ఇంకా రాత్రి కావలసినంత వుంది...'

'మీకు...రాత్రంతా కావలిసిందే' అని నవ్వింది... ఆ కొంటెతనంలో ... ఏనాటి

అనుభవమో పులకరింప చేసిన ఆమె జాణతనానికి... చూపులతో జోహారు లిచ్చాను...

– కాఫీలో... నాకన్న ఎక్కువ పాలుపంచి...బలవంతంచేసి...మురిపెంతో త్రావించాను తాంబూలంతో మా పెదవులు ఎర్రబారినవి: సిగరెట్ పొగ మెలికలతో బాటు కన్నులు కులికిస్తూ... రాజమ్మ... పలకబోయేదంతా... తలలో కలగా కలియవేసుకునే మౌనంలో...నన్ను సావధానుణ్ణి చేసింది.

––నేనూ అలాగే అనుకున్నాను మొదట: అంతో యింతో అయినా అతనితో సుఖపడలేక పోతానా అని: ఎంతకైనా ముందు యీ చెర తప్పుతుందికదా...

అవును? నాకా బ్రతుకు నిజంగా చెరగానే అనిపించింది: ధర్మపన్నాలు చదవడం లేదు: అదివరకంతా చేసింది పాపమని కాదు నే ననేది: అందరూ నాతో సుఖపడుతున్నారు: ఆ కథకు అంతు తెలిసింది గనుక... తెరిపిగా నే నెందుకు సుఖపడకూడదూ అనుకున్నాను. అందుకు తగినట్టుగా... ఆ రోజుల్లోనే అతను... నన్ను పెళ్ళి చేసుకుంటానన్నాడు:

అందుకు నేను పొంగిపోలేదు: మనిషిలాగా ఉండవచ్చును కదా అనుకున్నాను: 'కాసిచ్చిన గరాసుకెల్లా దాసి' గా ఉండే... తనంపోయి – వేళకు ఆదమరచిన నిద్రకు నోచుకునే –– భార్య సామాన్య హక్కు – దక్కుతుంది కదా అని – ఒప్పుకున్నాను: తెగువతనానికి లోకులు ఇచ్చిన మెప్పులన్నీ అతనికి అప్పగించి –– అందరితోబాటు దాన్ని.. అదోమాదిరిగా నన్నా అయి... తగినచోట తలదాచుకునే తావు దొరికిందా... మనసిచ్చి... మచ్చికలకు గాక –– తనదాని ననుకోదలచిన – దయాశాలి... తన కబ్బిన తరువాత –– ధనమే జీవనమైన తనువుకు –––

. ఎందుకూ... కల నిజం కాకపోతే...ఈలాగే దానంతట కవిత్వం ముంచుకువస్తుంది. దీనిల్లు బంగారంగానూ?

అంటే జ్ఞాపకం వచ్చింది; దుకాణం కట్టిపెట్టి ఒక యింటిదాన్ని అవుతానని మాటవరుసకు మా అమ్మతో అంటే; 'అదేమి ఊహే నీయిల్లు బంగారంగానూ?' అన్నది. 'అందుకేనమ్మా – యిల్లు బంగార మౌతూన్నకొద్దీ – పరుగెత్తుతూ బరువులెత్తాలి: సంపాదించలేనని కాదు; చాలు నీకు – ఇక నాకా – బంగారుకొండ దొరుకుతున్న దమ్మా' – అని – ఏవేవో చెప్పాను:

–– సరే ... యింటిపేరు మారింది; నాతీరంతా మారింది. నెలరోజులు...అందమైన చోట, హాయిగా కాపురం చేశాము – అదిగో నవ్వుతున్నారు... నేను ఒట్టు వేసుకు చెపుతా వినండి...సంసారితనంలో ఉండే ముచ్చట సానికే తెలియాలి: ఇది నిజం:

నన్ను నేను మరచిపోతున్నాను: కాని, లోకులు నన్ను మరచిపోలేదు... అంతా తలక్రిందు నాటకం... మునుపటికన్న...నా చక్కదనం పెరగలేదు... ధర విపరీతంగా పెరిగింది.

నిజం – అదివరకంటే...అందరితోబాటు...నేనూ ఒకతెను. యిప్పుడు.. వాహిని హెచ్చించి: ఫలానివాడి భార్యతో అనేటప్పటికి ... ఎంత ఖరీదైతే మాత్రమేం?... అలాగే... నేను విదిలించి కొట్టిన కొద్దీ... పెంచారు...పెంచారు: నా తరతరాలవారూ చేసుకున్న పాపంలాగా... ధర పెంచారు: బేరంసారం భారీగా సాగేందుకు యిదో కొత్త ఎత్తు వేశానని...అందరూ ...అనుకోవడం...అవును ఏమైనా ...సానినేగా...

దొంగచాటున చీటీలు పంపడం... ఆయన యింటలేని జాడ కనిపెట్టి రాయబారాలు నడపటం... నాకు విసుగు ఎత్తినా. .. దుమ్మెత్తి పోసి పోసి సత్తువ చచ్చినా... విరామం ఎప్పటికా భగవంతుడాఅనిపించేది – కొన్ని రోజులకు దొడ్డివాకిలి సందడి దాని పుణ్యమా అంటూ దానంతట అదే అణగింది. ఇక గట్టెక్కవచ్చును అనుకున్నాను.

కాని – యింకో భాగవతం మొదలు...

– రాజమ్మ ముఖం కండలు చించుకుంటూ మాటాడుతూంది: నేను వింతపడుతూ వింటున్నాను. అందులో – అమె అనుకున్నంత అవ్యాయం నాకు కనుపించలేదు: ఆరితేరిన వాడిని కాబట్టి – అయినా – ఊరికే వింటూ ఊఁ.. అఁ.... అంటూంటే బాగుండదని, మాటకు అడ్డం వెళ్ళి...

"–ఆయనతో చెపితే ఎలావుండేదో – నీకు అంత అనవసర హైరానా తప్పిపోయేది: అతనికి తెలిసిందని వింటే నిన్ను ఎవరూ తేరిచూడక పోయేవారేమో–" అన్నాను. రాజమ్మ, చనవు – చిరాకుతో – 'కాసాకు వినండి – ప్రశ్నలు వేయవలసింది నేను, మీరు కాదు –' అని గదమాయించి... అంతలో ఆ కవళిక మార్చేసి –

'అఁ– ఎక్కడిదాకా చెప్పాను! మరి–హాఁ – ఆయన సంగతే చెప్పబోతున్నాను. అంత మంచివారు: ఊరందరూ స్నేహితులు – అందరికీ మా యింట అయిన వేళా, కానివేళా – విందులు...

అందులో ఏదో కిటుకు ఉన్నదని నా మనసుకు తోచినా – నోరు ఎత్తడానికి వీలులేదు. ఆయనతో లేనిపని కల్పించుకుని – ముఖపరిచయం ముదురు స్నేహంగా మార్చుకుని ఏదో వంకతో యింటికి తయారయే పెద్ద మనుష్యులు... నా వంక దొంగచూపులు చూడడానికే... కాఫీ అందుకునేటప్పుడు చేతికి చెయ్యి తగిలించడానికే... చూసీ చూడనట్లు నన్ను రాచుకు తిరగడానికే.. అని నాకు స్పష్టంగా రోజు రోజూ అనుభవం అవుతూఉన్నా... అలాఅని చెపితే ఆయన అపార్థము చేసుకుంటా రేమోనని... నన్ను నేనే కాపాడుకుంటూ... పాడుమాట రాకుండా, బ్రతుకుతూ నాలో లోకులకు వంకదొరకనీయకుండా చేసుకుందామని విశ్వ ప్రయత్నమూ చేశాను:

చూశాను... చూశాను: చివరకు నాకు తరంగాక... ఆయనతో చెప్పిచూశాను... నావంక వింతగా చూసినవ్వి ... నాకేమీ భయంలేదని భుజంతట్టి బుజ్జగించి... నేనూ పల్లెటూరి పడుచులాగా పరాయి మొగవాడి నీడచూసి ఉలికి పడటం భావ్యంగా లేదు... ఎవరూ కొరుక్కుతినరు... అని యింకా ఏమేమో మాటలు చెప్పి ఊరడించారు:

అవి మాయమాటలని...నాకు రూఢి అయిపోయింది... ఎందుచేతనంటే...కళ్ళూ చెవులూ ఉండి, కని వినే మనిషి.... జరుగుతూన్నది అర్థం చేసుకోలేనంత అబిసి కాడని తెలుసును: విప్పిచెప్పినా అకళించకపోతే...ఏదో మునుగుతుందని నాకు గుండెలలో రాయిపడ్డది... నిజంగా: నన్ను అనుమానించి...నామీదలేని నిందెలు వేసి.... నిమిషానికోమారు కజ్జాకు కాలుదువ్వినా... ఆయన్ను ఏమాత్రమూ శంకించేదాన్ని కాను: ఆయన అలా సహించి.... ఏమీలేదని కమ్మీచేసేయడంలోఉన్న దారుణం...నాకు అనుభవానికి...అతిత్వరగా వచ్చింది...

నేను చెప్పేమాట. వివి... సిగ్గుపడి తలవంచుకోండి... మీ స్నేహితులలో...ఇంత నీతీ, జాతీ లేనివాళ్ళు ఉంటారని ఇదివరదాకా మీకు తెలియదేమో...ఇప్పుడన్నా...నమ్మండి...

ఆయనకు డబ్బు అవసరం వచ్చింది... అవును ఎందుకు రాదూ మరి, సంపాదనకు ఎనిమిదిరెట్లు ఖర్చు చేస్తూంటే.... అప్పు కావాలంటే ఎవరుపడితే వాళ్ళు ఎగపడి యిస్తున్నారు.... చెల్లు వేయడం... నా మీదకు వదిలేశారు...

—— వింటూన్న కొద్దీ నిలువునా నీరవుతున్నాను. అవసరం ఎంతకంఠంమీది కత్తివాటమైనా.... అంత లాచారీ తనానికి జారే నీచత్వం... అతనిలో అంతర్భూతమైనదైతే... అన్నాళ్ళనుంచీ మే మెరుగున్నా మనుకుంటూన్న మనిషి... అతను కానేకాడు... ఊహుఁ... అది కాదు. లోతు తరచి నైజం గ్రహించలేని మా కల్లబొల్లి స్నేహానికి...అది ఫిరంగీ బారు...

కాని ఏమనగలను?...

అనేవి అన్నీ...ఒకటీ వదలకుండా ఆమె అంటూన్నది గుచ్చి గుచ్చి...

నాటకాల్లోనూ...చచ్చురకం సినీమాల్లోనూ అనేకసార్లు మీరుచూసి ఉంటారు. నాయకుడు... తన నాయికను అవసరం కొద్దీ...అంటే, సాధుసంతర్పణకో... సత్యపాలనకో... తార్చడమో, తనఖా ఉంచడమో...జరుగుతూ ఉండటం... తీరా మోసి...అంత పెట్టుబడిపెట్టి అవతలవాడు ఫలసాయానికి తేబోయేసరికి...నాలుగు చేతులవాడో, నాలుగు ముఖాలవాడో అమాంతం ఆకాశంమీదనుంచి ఊడిపడి అదమాయించి...సిద్ధాన్నం చెడగొట్టడం...పాపి ఎవడో, భక్తుడెవడో తెలియకుండా తారుమారు చేసేటందుకు...పతివ్రతను ముందుకుతోసి... ఉహుఁ...ఊరాద్ధాంతం సాగిన కొద్దీ అంతు ఎక్కడిది కాని...అసలు దోవకు వస్తాను...

– బలవంతాన చేయిచేసుకోగల చొరవ కొనుక్కున్న ఆ పెద్ద మనిషినే నిలవేసి... ఆయన, బండార మంతా కనుక్కున్నాను.... పాలు తాగుదామనే ధ్యాసలో... పొరబాటున ఆముదంగిన్నె పెదవులకు అందిచ్చుకున్నప్పటి...అసహ్యం...ఆయనమీద నిలు వెల్లా వేసింది...

మధ్యలో, యింకో ధర్మ సందహం...యిరికిస్తూన్నాను. భార్యనైనా పైసాకోసం పరాయివాడికి అప్పగించటానికి టొంకులేని ఘరానాతనమే కాదూ...ఆయనది? – నేను భార్యనైనాను...ఏం లాభం...?

అక్కడితో నేను తిరగబడినాను. వెనుకటిగుణం మానడానికి వీలులేక పోతే...అదివరకులాగా...అది అమ్ముకుని––నేను బ్రతకాలిగాని...మధ్యవచ్చిన ఎవడో వెంకటరాముడికి...ఎందుకు సొమ్ము చేసిపెట్టాలి. అందరికీ నా ఒళ్ళు అమ్ముకుని? (మోటగా వచ్చేస్తూంది, నోట) నాకు, మూటగట్టుకోవడం చేతగాకనా; తలచుకుని, దానికే మళ్ళా దిగితే, బేరాలు తెచ్చేవారు లేకనా?...అలా కుదిర్చే నడి మంత్రపు వాడికి...దయతలచి మేము కాసో వీసమో రాల్చడమేకాని...అర్ధం ప్రాణం ఆచార్యుల పరమన్నట్లు అంతా అప్పగించి ఊరుకునే రివాజు మా కులాన ఏనాడైనా ఉందా? – మీకు తెలియని దేమన్నా ఉందా... చెప్పండి...

ఆయన ముఖంమీద అనేశాను: నేను, ఏలాగూ మగనాలిని కాలేకపోయినాను కదా: ఆయనకు ఆలినిగానే ఉండి... ఆ బెట్టుమీదనే సానినై... ఆ లాభం నేనే దక్కించు కుంటాను: అప్పుడు – వ్రతమూ చెడదు.

తనకేమీ లోపం చేయను; నా పెంపుడుకుక్క ఓ యెత్తూ, ఆయన ఓ యెత్తుగా చూసుకుంటాను... తాను మాత్రం నాకు చేదోడువాదోడుగా వుండి... యింటికి వచ్చిన సరసుణ్ణి గౌరవించడం... వెళ్ళేటప్పుడు సాగనంపడం ... తెల్లవార్లూ తలుపు తీయడం...వేయడం...అలసి సొలసి ఉంటానా... నేను రెప్పవాల్చేదాకా... కాళ్ళూ నడుమూ పట్టడం... ఇలా చెప్పినట్టుగా విని... ఒళ్ళువంచి పనిచేస్తే...కావలిస్తే...కారుయెక్కి తిరగడానికైనా లోటు ఉండదు; ఎన్ని వేషాలైనా వేయవచ్చు... ఒకరికొకరు చాటు అభినయిస్తూ యెన్ని ఆటలైనా ఆడవచ్చు...

ఇదేమీ... ఆపిల్లవాడికి మ్రింగుడు పడలేదు. నేను మొరాయించి కూర్చుంటే... గడిచే యెత్తులేక... విడిచి ఉడాయించేశాడు...కథ యిలా కంచికి వెళ్ళడంకూడా, ఒకందుకు...మన మంచికే వచ్చిందని... సంతోషిస్తున్నాను. ఏమంటారు...? చూడండి, ఇప్పుడు నాకు యెంత వీలో...అప్పుడూ యిప్పుడూ అదేపనే అయినా –– సానికాక, "మగని కనారగిన మానిని" అయితే –– మగవానికి మోజింతంతా? – గుట్టు బయటికి తెలియరాకుండా – అఘాయాలోనే నిలిచి – మేహకాయుల దగ్గరనుంచి – గుంజుకున్నది – నాకు నాలుగో తరందాకా ఫొక్తుగా గడుపుకుంటే చాలును:

'మరి... యిప్పుడు ఎందుకు దరిశనమిచ్చావు... ఆ మాటలన్నీ నిజమే అయితే' – అని సందేహంగా మీరు ప్రశ్నవేయడానికి – సిద్ధపడుతున్నారని నాకు తెలుసును: ఏమీలేదు. ఉత్తినే సరదాకు: ఊరికే తినికూర్చుంటే, ఏలా ప్రొద్దుపోతుందని, ఏదో కాలక్షేపంకోసమనీ – తరువాత, పెరిగి పెద్దదాన నైనతరువాత, పుణ్యమూ పురుషార్థమూ... బుద్ధి తెలిసినప్పటినుంచీ – యిదేనాయెను, ఇంతకాలం, యిలా వెళ్ళినమీద – యిప్పుడు లేనిపోకిళ్ళకు పోయి – అన్నీ ఉడిగినదానిలాగా మడిగట్టుకు కూర్చుంటే ఎవరిని ఉద్ధరించినట్లు? యథాశక్తి – దేశానికి మనవల్లా రవంత ఏదో రూపేణా ఉపకారం జరగవలసిందే కనుక ––

"కాఫీ త్రాగుదాం..." రాజమ్మ యింకా ఏమేమో ఎంతోసేపు అలా మాట్లాడుతూనే ఉంటుందని... ఆ అవకాశానికి సరిగా...మనసును పరధ్యానంలోకి దించేసి...అలా ఆలకించుతూ అవునూ కాదూ అనకుండా... విశ్రాంతిగా కుర్చీలో వాలిపడుకుని ఉన్నాను: చెప్పేదల్లా మాట ఛప్పున తుంచేసి వరుస మార్చింది.

కాఫీ యిద్దరమూ కలిసి త్రాగాము. నేను సిగరెట్టు కొసవరకు సిగరెట్టుగా అరగా అరగా, తోరణంగా అంటించుకుంటూ...ఆలోచన సాగని ఉక్కిరిబిక్కిరిలో ఉన్నాను. రాజమ్మ...మరీ ఒత్తుగా...కుర్చీ కమ్మీమీదనుంచి నా మీదికి జరిగి చక్కిలిగిలిపెట్టినా – నేను ఉత్సాహం చంపుకునే కూర్చున్నాను––

'మీరు వెక్కసంగా త్రాగినట్లుగా ఉన్నారు...' అని రాజమ్మ వెక్కిరించింది.––

'ఏం...'

'ఏమో – ఏమీలేకపోతే – ఎందుకంత నిద్రమత్తు? – మీసత్తా తెలియనిదాని దగ్గిర వేయండి మీ వేషాలు –– మేలుకొలుపులు పాడించుకునే ముచ్చట ఏమన్నా ఉన్నదా? ప్రొద్దెంత ఉందో తెలుసునా? ––'

'ప్రొద్దెంత పోయిందో తెలుసునుగనుకనా – పోయింది పోనీ–––'

'రమ్మంది – రానీ – అని నే నందీయాలా?'

"అందుకు సందీయనిదే–"

"— మరి — ఎందుకూ నేను వచ్చింది? —"

'అందుకే ననుకో—–'

'—అనుకున్నది - మీరు కొనుక్కుంటారనే—' మాటలతో పాటు - మనచేత ఏమవుతుంది? - మనసు బాగా లేదన్నాను. ఆమె చెప్పినది విన్నమీదట - ఎన్ని చెప్పి తప్పించుకుందా మనుకున్నా - రాజమ్మ - తనకు మాలిన ధర్మము కాదని - తనిసేదాకా - దయదలచి ఊరుకుంది కాదు - నా మనసులో ఇంకా ఎన్నో ప్రశ్నలు - ఆమె కవళికలో అవేవీ తేరిచూడలేని - అమాయకపు హాయి - ఆమె అవునన్నది... నేను కాదనగలవాడను కాను—

ఇంకా - ఎంతసేపైనా ఆమె ఉంటే బాగుండును - కాని - యింతలో తెల్లవారుతుంది.

సరే - యింతలో సరిపెట్టుకుని - తిరిగి పంపేస్తాను - మరి - వచ్చిన దోవనే, ఉత్తచేతులతోనైనా—? కాని, నేను విలుచుకునేది - సాటివాని అభిమానమైనప్పుడు - దానికి ధరకట్టగల తాహతు —

ఆమెకు ఆ మొగమాటమేమీ లేకపోయినందువల్ల - నేను ఒకందుకు బ్రతికిపోయినాను. "కష్టే ఫలీ" అని నవ్వుతూ నా అదరాన్ని - జాగ్రత్తగా లెక్క చూసుకుని - సంతోషించింది. రాజమ్మ ఎంతో తెలుగుమీరినా - వెనుకటి గుణం మాననైంది కదా అని - అదృష్టం ఎదురుతిరిగి ఒరసి రాటుదేరిన ఆమె సాహస ఉత్సాహం మెచ్చుకొనబోయే ఉబలాటం పడుతూన్న నాకు, ఆ బేరగత్తె తేరగా దక్కకపోవడమో ఏమో - లోలోపల అంతు చిక్కని ఉసూరు - తనం కమ్మించి - క్రుంగదీసింది - అర్థంఅయీ కాక - అంతు చిక్కనిదాని దేనికొరకో - మనసు వెదకులాడడం నా కన్నులలో - రాజమ్మ కనులు మరోవిధంగా గ్రహించుకున్నవి -

సముదాయింపుగా - దయగా - "ఎన్ని ఉన్నా — అన్నీ ఆలోచించకుండా కాల్చేయడం - అవతల - పొరబాటున, ఒకటన్నా మిగిలి ఉండకూడదా అని - ఒప్పులో తప్పుకోసం వెతుక్కోవడం - మగజాతికి తగిపోయింది - లెండి. ఎంత దేవులాడినా ఖాళీ అయిపోయిన టిన్ - కనీ పెంచేదా ఏమైనా - మీకోసం, లేని సిగరెట్‌ను - ఎక్కడ నుంచి పుట్టిస్తుంది - " అని కవ్వించింది.

"అందుకోసం - కాదు -" అని, ఆమెకు తెలిసి పోతూన్న అబద్ధం ఆడాను—

"మరెందుకోసం—"

— వేళ తరుముకు వస్తూన్న ఉద్రేకంలో సాఫీగా - సానీ సరసుడూ - హాయిగా అయిపోయినాం.

నిదుర మబ్బునిండిన కన్నులతో - రాజమ్మ నిలవ లేక తూలిపోదామనుకుంటున్న నన్ను - నిలువంతా గిలిగించి -

దాచి ఉంచిన సిగరెట్ - వెలిగించి - చిలిపిగా మెలకువకని - పొగఊది - నా పెదవులకు దాని నందించి - దయ లుంచమని -

- కారులో వెళ్ళిపోతూంటే ఆమె మౌన - హాసం - నేను కలగంటూన్నంత సేపూ ఉన్నది—

★ ★ ★

# ముఖచిత్రం

నిన్న రాత్రి కలమాత్రం వచ్చింది: నీవు రాలేదుగదే జవరాలా!--

ఝామూ ప్రొద్దుపోయింది; మా యిల్లు మాటుమణిగింది:

తాతగారు, మండువా దగ్గిరగా, పట్టెమంచంమీద, తలక్రింద చేయి గుమ్మరించుకుని, పడుకున్నారు; అమ్మమ్మ, ఆ సరసనే మర్యాదా అంతా ఎడంగా, చాప పరుచుకుని, బొంతమీద బొంత తీర్చి దిద్దుకుని, తల క్రింద తాళం చెవులు, తలాగడ దిక్కున మర చెంబూ పెట్టి, నడుం నొప్పిగా రంగణ్ణి స్మరించే – ఆవలించి, అమ్మయ్యగా ఒరిగి ఒత్తిగిలింది.

తాతగారు, పనస చదివినట్లు పై వాక్యం అనగానే, అమ్మమ్మ అపసోపాలు మానేసి తనలో తాను నవ్వుకోవడం ప్రారంభించింది: నవ్వు ఆపుకోలేకుండానే –

"ఎందుకండీ, తీరిపడుకుని అలా కలవరిస్తారు?" – అంటూ లేచికూర్చునేందుకు ప్రయత్నిస్తూనే ఉంది, తాతగారు, చక్కిలిగిలి అయినంత గందరగోళంగా లేచి కూర్చున్నారు.

పక్కగదిలోనే నేను పడుకున్నాను. ఏదో పుస్తకం నామీద పడుకుంది; నా అంతట నాకు ఎప్పుడూ రాత్రి నిద్రరాదు. దీపం తగ్గించే దీవెన పుట్టింటికి వెళ్ళింది –?

పెళ్ళాం అనేది అయోనిజ అయితే, ప్రతి మగరాయడూ బ్రతికిపోతాడు కద! పుట్టిల్లంటూ ఉండగానే – చీటికి మాటికీ ఆ యింటివారు రమ్మనడం – ఆ గాలిసోకగానే యీ పిల్ల – తల్లి, అమాంతం ముద్దులకూతురై అమ్మ చెంగు పట్టుకు వదలకుండా, కట్టుకున్న వాడిపోరు, కన్నవాడి పోరూ చెవిని పట్టకపోవడం – ఏతావతా అందరూ కట్ట కట్టుకుపోవడం – అరగా అరగా ఆ అటలేకితనం పోయి, మళ్ళీ యిటు మళ్ళేలోగా – ఇక్కడ యీ నాథుడనేవాడు, ఒంటిపోచ జంధ్యమల్లే అఘోరించుతుండడం – ఇదంతా పుట్టిల్లంటూ ఒకటి ఉండటం మూలాన వచ్చిన అనర్థమేకదా!

పోనీ, నీ మనసులో మమకారం కొద్దీ – పంపనంటావనుకో – అందరూ కలిసి యిల్లు తీసి పందిరి వెయ్యరూ? ధారాపాతంగా కలకంఠి కన్నీరు నీ ఆవరణ యావత్తూ ఒలకదూ?

అప్పుడు నీవు చేయని తప్పుకు ఎలాగూ చెంపలు వేసుకోవడం తప్పదు.

తాతగారు ఎంత అదృష్టవంతుడు! ఆయన భార్య – అనగా అమ్మమ్మ – కాపురానికి వచ్చిన వెనువెంటనే, వాళ్ళ పుట్టిల్లు ఉన్న ఊరుకు ఉప్పెనవచ్చి, ఒక్క ఆ పుట్టిల్లంటూనే కాకుండా, దానికి ఏ మాత్రమైనా సంబంధం అంటూ ఉన్న యిళ్ళు యావత్తూకూడా – అజాపజా లేకుండా గుటక వేసుకుపోవడంతో –

తాతగారికి, అటువైపు బాధ ఉత్తరత్రా లేకుండా పోయింది; అది అలాఅయిపోయింది కదా అని ఎన్నడన్నా తలుచుకు గునిసేందుకున్నా తీరికి లేకుండా – తాతగారు సంసార పక్షంగా చక్కదిద్దుకుంటూ వచ్చారు – ఆయన అదృష్టం ఆయనిది: – నేను అసూయపడితేమాత్రం, ఇలా తప్ప మరోవిధంగా – తెల్లవారుతుందా?

తాతగారన్నది విన్నాను: అమ్మమ్మ నవ్వగానే మన కెందుకు పోనిద్దూ – తప్పు: చూడకూడదు – అనుకుంటూనే దొంగచూపు చూశాను – ఇద్దరూ ఎక్కడున్న చోటే ఉన్నారు – తాతగారి గడ్డం రేకలుమాత్రం, గాలి లేకపోయినా చూచాయగా రేగుతూన్నట్టు అనిపించింది:

"ఏమండీ – మంచినీళ్ళు కావాలా?"

"ఆఁ? ఏమిటీ చోద్యం!–" తాతగారు మునుపటి ఘన సత్తువగా అడిగారు: లేచి నిలుచుని, పరకాయిస్తూ –

"ఏమే వయ్యారీ – ఇరవై యేళ్ళ ఈ నడుమ ఏ రాత్రి అయినా నాకు దాహం వేసినట్టు దాఖలా ఉందా? ఉన్నట్టుండి – ఈ ఏదీ కానివేళ – ఇలా కోరకబోయినావేం?"

తాతగారు, బహు వడుపుగా – త్రిభంగిగా – అమ్మమ్మ చెక్కిలిమీద కొనగోరుతో – అలా అన్నాడు: ఆవిడ ఝుళుక్కున కులికి ఎన్నో మెలికలుగా నవ్వుకుంటూంది:

నాకు కోపం, నవ్వూ విసుగూ వేసుకు వచ్చింది: వీళ్ళు ఈ వేళప్పుడు ఇలా శివాలాడటం మొదలుపెట్టారేం, కృష్ణా రామా అంటూ, ఏ నడుం నొప్పితోనో పడుకోక – మూలుగుతూ!

అమ్మమ్మ గొంతు మళ్ళీ రవంత సడీ – చప్పుడూగా కిచకిచలాడుతూంది.

"అబ్బ! ఇష్ –' ఊరుకోండి – ఇద్దెక్కడ అప్రదిష్టమ్మా! ఏమిటీ చేష్టలు? – పిల్లవాడు చూచిపోయేను."

తాతగారు తెగించి నవ్వుతున్నాడు – తిట్టినట్టు అంటున్నాడు – "చూస్తే – బాగుపడిపోయేను!"

"అమ్మీ! – ఆ వెన్నెల చూడు – ఆ నక్షత్రాలు చూడు! – ఎక్కడో మలయపర్వతాన్నుంచి అనేక వ్యయ ప్రయాసలకు ఓడ్చి, మనల నందరిని ఉద్ధరించాలని ముంచెత్తడానికి వచ్చిన చల్లగాలిని చూడు ––

ఈ వేళప్పుడు – మునుపు మనం ఇలాగే వున్నామా? – నీవు మీ పుట్టింట వుంటే – నేను వుసూరుమంటూ, రొమ్ము మీద ఏ పుస్తకమో కప్పుకుని ఆపసోపాలు పడుతూ, గోడమీది బల్లుల సరసాలు చూసి వులికిపడుతూ వుండేవాడినా? ఒక్కరోజైనా బీరుపోనిచ్చావా? ఎంత నిశి – రాత్రి అయినా, రెక్కలు కట్టుకు వాలేవాడిని కాదూ!"

ఇంతసేపటికి అర్థం అయింది నాకు తాతగారి ధోరణి – పండబారిన ఆ రతీమన్మథులు – వాళ్ళ మనసు నా మీద పదును పెడుతున్నారు.

కసి తీర్చుకుంటున్నట్టు – తాతగారు ఉపదేశించినట్టే చేశాను: నేను మెసులుతూన్న అలికిడి, వాళ్ళకు సోకనీకుండా – బట్టలు వేసుకుని వీధి తలుపు దగ్గిరగా పెట్టి హుటాహుటీ బయలుదేరాను.

ప్రొద్దుపోయినమాట నిజమే – కాని మా బావమరిదికి పరీక్షలాయెను: వాడింకా కంట్లో వత్తులు వేసుకుని చదువుతూనే వుంటాడు – బుద్ధి తెలిసినవాడు గనుక – నన్ను – నా రాకా చూసి మనసులో నవ్వుకున్నా, మామగారల్లే పట్టుకుని అనేది మొగాన అనేసి; నాపని ఎందునా గాకుండా చెయ్యడు: వాడినే బ్రతిమాలుకుంటే – మా పెళ్ళికూతుర్ని నిద్రలేపుతాడు – ఇహ ఆ తరువాత – "సర్వమున్ అతని దివ్యకళామయము–"

కాని, ఇంత సంబరంపడుతూ వెళ్ళిం తరువాత, వెళ్ళిన బులలాటం గుమ్మంలోనే బొప్పికట్టింది. అంత ప్రొద్దుపోయినా వాడు అరుగుమీద లేవిణీవేసి చదువుకుంటున్నాడు – వాళ్ళ అక్కయ్య మేలుకునే కూర్చుంది.

నిజంగా, ఇలవేలుపులందరూ ఈ పాలిట వున్నారని, ఉవ్వెత్తున గంతేశాను: గుమ్మంలోకి అడుగు వేశాను –

వాడు – తల ఎత్తి చూసి – ఏం బావా – ఎక్కడనుంచి! – అని చదువుకునే వాక్యంలో కలిపి ఉచ్చరించాడు: వాళ్ళ అక్కయ్య నేను మడి అనుకున్నట్లు ఎగిరి దూరంగా గంతేసింది:

తెల్లపోయి – గుండె గతుక్కుమని ఆ వంక చూశాను: ఎంతో జాలిగా – పదవి కదలించింది.

అంతే! తిరిగి ఎలా ఇల్లు చేరుకున్నానో – నాకే తెలియదు – కాని, తలవంచుకుని, ఇంట్లోకి పోయేందుకన్నా వీలులేకుండా – తాతగారు, అరుగుమీద చుట్ట కాల్చుకుంటూ, నా కోసం ఎదురుచూస్తున్నట్టు కూచున్నారు:

అడుగు అక్కడే ఆగిపోయింది;

తాతగారు, అతి సజావుగా –

"ఏం రా నాయనా! వచ్చావూ!" అన్నారు. రాక పోయినా బాగుండేది: తెల్లవార్లూ – ఊరంతా బలాదూరు తిరిగినా బాగుండేది; ఓ చాప ఇవతల వేయించుకుని నేనూ, ఆ అరుగుమీదే మనికితే బాగుండేది కాని –

తాతగారు – నన్ను పొదివిపట్టుకుని సరసను కూర్చోబెట్టుకున్నారు:

"నన్ను అడిగితే – నేను చెప్పకపోదునా? ఈ కాలం వాళ్ళకు సరిగా కూడికలూ, తీసివేతలూ అయినా రావాయె. ఏ నెల కానెల యావజ్జీవమూ ముప్పైరోజుల్లో మూడు ప్రొద్దులు అలా వుంచాల్సిందే:–"

నవ్వేందుకు నాకు ధైర్యం చాలలేదు – ఇంతలో అమ్మమ్మ గుమ్మంలోకి వచ్చింది – మా సరసం చూసింది.

"పోనిద్దురూ! వాడినేం వేధిస్తారండీ! – వడసారం పసివాడు" అంటూ సర్దిచెప్పబోయింది – తాతగారు, నమక పారాయణ చేస్తున్నట్టు.

"పసితనాన వంటపట్టకపోతే – మనసు బోసిపోదుటే అమ్మీ:– ఔనుగాని, ఇది తాతామనుమల వరుస! – నీవు నిష్క్రమించు–" అంటూండగానే ఆవిడ ఇంకా ఏం సరసం రువ్వుతాడో అని లోపలికి దూసుకున్నది – మిగతా పారాయణ నా పాలబడ్డది.

"కంటికి కన్ను అంటిపెట్టుకుని ఎన్నియుగాలైనా గడపవచ్చునే - ఎందుకు వచ్చేశావోయ్ వచ్చి ఇక్కడ దేవర బావుకునే దేమిటోయ్ -

నా మనుమరాలిని కళ్ళు వార్మీకి వర్ణించాడురా, నాన్నా? నా తపస్సు ధారపోశాను: నీకు దక్కించాను కాని - మడిగట్టుకున్నావ్! - బ్రాహ్మడివి!"

తాతయ్య రాసిక్యం - నే నెప్పుడూ కళ్ళకు అద్దుకునేదే! ఆయనలా చీల్చి చెండాడుతున్నా నన్ను ఎంతో ఆప్యాయంగా వెన్ను నిమురుతున్నట్టు వుంది: ఇవ్వాళ తప్పు చేస్తేనేమో నావంటి అజ్ఞానులు రేపు తరించేది అనిపించింది.

"ఊఁ! ఇక పోయి పడుకో, అహితాగ్నీ! నీతో కూచుంటే, వెన్నెల వెలా తెలాపోతుంది - మా కన్నెకుమారి - కన్నులపండువు చేయాలి!" అని తాతగారు - గదమాయింపుగా లేచారు - నేను చెర వదిలించుకున్నట్టు లోపలికి దూకపోయినాను. ఆయన నవ్వుతూ చెయ్యి వడిసి పట్టుకుని -

"రేపూ ఇంతే అనుకునేవ్! తెల్లవారిన తరువాత - పిల్లది, తల ఇక్కడే ఆరబెట్టుకుంటుందిలే?" అని జాజిపాద కదిలినట్టు నవ్వాడు - నన్ను వదిలేశాడు.

★ ★ ★

# అనవుడు - నావుడు

మా గ్రామం పొలిమేరనుఉన్న లంజదిబ్బల్లో ఒక దానిని త్రవ్వించడానికి పురాతత్త్వశాఖవారు, మొన్న మొన్ననే పూనుకున్నారు.

ఆ ప్రదేశంలో ఉన్నది ఒక్కటే దిబ్బ కాదు సుమండీ! చెల్లాచెదురుగా, వెరసి చిన్నా పెద్దా కలిపి మూడు! చీకటి పడిన తరువాత సాధారణంగా, ఆ చాయలకు అసాములెవరూ పోరు. దయ్యాలూ, భూతాలూ ఉంటాయని కాదు! ఆ చుట్టుపక్కల అంతటా వల్లమాలిన గచ్చపొదలు? రాత్రి, ఓ జాము పొద్దువేళనుంచీ, తొలికోడి కూసేదాకా, – "గల-గలా: చెంగ్-చెంగ్" మంటో సన్న సన్నగా గాలి వాటున సవ్వడి వినబడుతూ ఉంటుంది!

ఆ మూడుదిబ్బలూ ముగ్గురు అక్కా చెల్లెళ్ళట. అందులో పెద్దది అప్పగారు – తతిమ్మావి చెల్లెళ్ళు: వాళ్ళు, కొల్లేరు పేద్ద సరస్సుగా శాపంతో మారక మునుపు అక్కడ రాజ్యంచేసిన రాజుగారి కూతుళ్ళట.

ఆ ముగ్గురు కన్నెలకూ యుక్తవయసు రాగానే రాజుగారు దేశదేశాలా స్వయంవరం చాటించారట! ఆకాశమంత పందిరీ, భూమంత వేదికా వేయించి, మూడు పెళ్ళిళ్ళకూ ఒకే మూహూర్తం పెట్టించి, కోలాహలంగా, సప్తసన్నాహాలూ చేశారట! ఏలేవారి ముగుదల శిరసా వహించి ఆ సీమలో ప్రజలందరూ, అబాలగోపాలమూ ఎవరింటో పొయ్యి వారు త్రవ్వేసుకుని, పట్టు తాపితాలు చేత బట్టుకుని, – అన్ని వర్ణాల వారూ దేవతార్చనకు, రాజుగారి దేవిడీకి తరలివచ్చారట: ఇక లెక్కకు నాలుగు రోజులుంది స్వయంవరం: అది, కాగానే వారం తిరిగివచ్చేసరికి సుముహూర్తం!

ఇది, ఇలా ఉండగా, ఆయేడు అదేం మాయోకాని, వర్షాలు, ఒక్క మాసం ముందుగానే ముంచుకొచ్చాయట! రథాలెక్కి, ఏనుగులెక్కి సిబ్బందితో సింగారంగా పెళ్ళి నడకలతో తరలివస్తున్న ఛప్పన్న దేశాల రాకొమరులూ, రాజ్యానికి రెండు మజిలీలు ఆకడనే ఆగిపోవలసి వచ్చిందట.

గంగ మడుగులు, కాలువలైనాయి – కాలువలు నదులైనాయి – నదులు ఏకసముద్రం కాగా, – ఎక్కడి వారక్కడే హరినామస్మరణ చేసుకుంటూ ఆగిపోవలసిన తిప్పలు వచ్చినాయి! కాకిచేత కబురంపుదామనుకున్నా – ఎటుచూసినా అంతనా నిరామయంగా ఉంది. ఎక్కడా, ఏ దిక్కునా పిట్ట ఆడటంలేదు:

దిగబడిన రథాలు దిగబడినట్టే ఉన్నాయి. ఏనుగులూ, గుర్రాలు, తక్కుంగల చిల్లరమల్లర జంతువులూ, సేనా సమూహాము, ఒక్క ముక్కలో చెప్పాలంటే రథగజ తురగ పదాతి సమూహాము ఒక్కుమ్మడిగా, రొంపపట్టి దిక్కులు మార్మోగేట్టు తుమ్ముతూ పడుందట.

ఈ పరిస్థితులన్నీ తాము స్వయంగా కొంతమేరకు చిత్తగించీ; మహామంత్రులు మనవిచేయగా ఆలకించీ - బయలుదేరి వచ్చిన పెళ్ళికొడుకు లందరికీ - ఒక్కసారి దిగ్భ్రమ చెందటంతో మతిపోయిందట: అందరి మట్టుకూ ఎవరికి వారే హతాశులై, జాతకం ప్రకారం తమకు యీ సంవత్సరం కళ్యాణయోగం లేదేమో అని అనుకునేంత స్థితికి వచ్చారట.

ఇక్కడ, మాటకు అడ్డంవచ్చి, ఒక్క ముక్క మనవి చేస్తేనేకాని, స్వారస్యం ఉండదు. అందరికీ రొంప పట్టిందనుకున్నామే అది కొంచెం అతిశయోక్తి! తరలి వచ్చిన మందీ మార్బలంలో కొందరు మడేళ్ళుండక తప్పదు కదా! ఎల్లకాలం ఎండలో ఎండి, వానకు తడిసేవాళ్ళకు - యీ రుతువుమార్పు చీమ కుట్టినట్లు లేదు: ఆ గుంపు గుంపూ ఒక్కతుమ్ము తుమ్మిన పాపాన పోలేదు.

వాళ్ళందరూ, ఏరథంచాటున తలదాచుకుని, ఏం గూడుపుఠానీ చేశారో కాని, ఒకనాడు, సాయం సమయమున వాళ్ళలోకి కులవృద్ధు, వ్యాసులవారిలాటి మడేలు, మహారాజ బిడ్డ లందరికీ నమస్కారంచేసి, యిలా మనవి చేశాడట.

"ఏలిన వారందరూ, యీ చాకలివాడి మనవి కాదనకుండా, చిత్తగించాలి! మహాప్రభువులందరూ యిక్కడ చిక్కుపడ్డారు! తమ జాడ తెలియక పెళ్ళికొమార్తెల కన్న ప్రభువుల వారు అక్కడ చికాకుపడుతూ ఉంటారు.

అయ్యాల సెలవైతే, నా చేతి క్రింద పడుచువాళ్ళను ముగ్గిరిని, ఆగమేగాలమీద తమరు చేరువకు వచ్చారని - కబురు చెప్ప నగరానికి తరుముతాను. ఒక్క కబురుకు ముగ్గురెందుకంటిరా -

దారిపొడుగునా, అగడ్తాలూ, ఆగాధాలు గంద! ఒక్కడైతే మునుగునో, తేలునో - మనిషికి మనిషి ఆసరా ఉంటే - తప్పినా జారినా అడుగుతీసి అడుగు వేయవచ్చు-

ఇద్దరైతే చాలదా అంటారేమో ప్రభువులు! ఒకడు ఊబిలో దిగితే, వాడికి చేయందిచ్చి రెండోవాడూదిగబడితే పిలిస్తే పలికేందుకన్నా - అట్లైందని, మనకు వేగు తెచ్చేందుకన్నా మరోడుండాలి గందా! - అందుకని - ముగ్గురుండాలని మనువు లిచ్చుకున్నా" నన్నాడు! "సరే" నన్నాడు - పెళ్ళి కుమారులందరూ!

అందరూ అంటే ఎందరో అనుకునేరు - యింతకు ముందా మాటచెప్పడం మరచిపోయినా, వచ్చింది, ముచ్చటగా ముగ్గురు మరైతే ఛప్పన దేశాలవారు తరలి వస్తున్నారంటివి గందా - అంటారా? - అవునయ్యా - వస్తున్నారు - వెనకాతలే వస్తున్నారు - కొందరు వెనక మజిలీలో - మరికొంద రా వెనక మజిలీలో - ఉన్నారు! నెమ్మదిమీద వస్తారు!

ఆఁ మళ్ళీ దోవకు వద్దాం - ఎక్కడున్నాం - పెళ్ళి కొడుకులు సరే నన్నారు కాదూ - అంటే మడేలూ సరే నన్నాడు: ముగ్గురు చిన్న వాళ్ళనూ ముందుకు రప్పించాడు. చేరవలసిన కబురేదో ముమ్మారు చెప్పించాడు! ప్రాణాలకు తెగించైనా పట్నం చేరుకుంటామని, వాళ్ళచేత దొరల పాదాల దగ్గిర ప్రమాణం చేయించాడు.

చేయించాడు సరేనయ్యా! వాళ్ళు కాళ్ళు కదపందే! "ఆనవాలిచ్చి పంపండయ్యా"

అని మరోతూరి మనవి చేసుకున్నాడు మడేలు. ఏం అనవాలురా? – అన్నారు. అయ్యలు ముగ్గురూ – "అవే – అవే – పట్టిన కత్తి పెట్టిన పాగా – వేసుకున్నదిరేసూ – యిచ్చి పంపండయ్యా – వట్టి చేతుల్తో – నోటి మాటల్తో వెళితే – చాకలోళ్ళ మాటలు మారాజులు నమ్ముతారా – అయ్యకు చూపేందుకు ఆ హంగులూ; ముద్దురాలికి చూపేందుకు ముద్రికలూ –" యిప్పించమన్నాడు మడేలు: యిచ్చి పంపారు దొరలు:

ఇక చూసుకోండయ్యా, ముగ్గురూ కొరమీనుల్లా వాగుల కడ్డంబడి – లోతనక రొంపనక ఒక్క లగువున రెండు ప్రొద్దులువాలే సరికల్లా – నగరం – పొలిమేరల్లోకి జేరుకున్నారు:

అక్కడ ఓ క్షణం ఆగిపోయినారు. మడేలు చెప్పిన ఆలోచన మనసులో నెమరేసుకున్నారు. తడిబట్టలు విడిచారు: అయ్యలిచ్చిన దిరేసు కట్టుకుని, – డాలూ, వాలూ పట్టుకుని – రొమ్ము విరుచుకుని – కోట గుమ్మంలో కాలుపెట్టారు.

కాలు పెట్టీ పెట్టంగనే కోటలో నగారాలు మ్రోగినాయి. వెయ్యి దీపాలు ఒక్క మెయిని వెలిగినాయి: తడి తడిగా ఉన్న భూమ్మీద అడుగుదీసి అడుగు వేసుకుంటూ రాజుగారు – ఆరతి పట్టించి, అడంగుల చేత దిష్టి తీయించారు.

అక్కడా యిక్కడా కాదని, అబ్బయ్యలు ముగ్గురునీ వెంటతోడుకుని – తానుండే కోటలోకి తీసుకువెళ్ళాడు: మూడుపొద్దులకు, మడేలుబిడ్డలు ముగ్గురూ కడుపునిండా బువ్వదిని కంటినిండా నిద్రపోయినారు:

భళ్ళున తెల్లవారింది. ఫెళ్ళున ఎండవచ్చింది. ఆ పొద్దే స్వయంవరము. కాని, మర్తో దొరకొడుకు ఆ చేరువకు రాందే ––

పోనీ అదీ ఒకందుకు మంచిదే అనుకున్నారు. మహారాజువారు – కుమార్తెలు ముగ్గురితోనూ సంప్రదించాడు: పిల్లలు ముగ్గురూ మారుమాట చెప్పకుండా, చిలకలల్లే ఒకరినిచూసి ఒకరు ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ తండ్రి వంక చూసీ చూడనట్టూ ఓరకంటచూసి తలవంచుకున్నారు.

పరమానంద భరితులౌతూ, మహారాజుగారు, అమ్మాయిల చెలికత్తెలను పిలిపించుకుని, అసలు వెనమేమిటి – చిరంజీవుల మనస్సులో ఉన్న అభిప్రాయం ఏమిటీ – అని వాకబు చేయగా, తేలిందేమయ్యా అంటే –

అబ్బాయిలు ముగ్గురూ గాఢనిద్రలో ఉండగా, అమ్మాయిగార్లు తెలికత్తెలను చాటుచేసుకుని, ఆ చిన్న అవళ్ళు శయనించిన మందిరంలోకి అల్లంతదూరాన్నుంచి తొంగి చూశారట! వారి కిరీటాలూ – కత్తులూ – చూసి మొగం చూడక్కర్లేకుండానే తక్షణం వరించారట – వరించినప్పటినుంచీ – ఒక్కటే తాపంట, ఒక్కటే విరహంట.

అయితే, ఇక స్వయంవరంతో అవసరం ఏముందనుకున్నారు మహారాజుగారు. అయినప్పటికీ మహామంత్రులవారి సలహా నంగీకరించి – కొంత తడవు నిదానించి చూశారు. అనుకున్న వేళకు అతిథి, అభ్యాగతులు మరెవ్వరూ రాకపోయేసరికి, ఆ ముగ్గురికి యీ ముగ్గురూ "శుభం" అనుకున్నారు.

ఈ శుభవర్తమానం – పెళ్ళికొడుకులకు చెప్పేందుకు – మహామంత్రిగారికి ఆజ్ఞాపించారు.

మంత్రిగారు వచ్చేసరికి మందిరంలో ఏం జరుగుతుందయ్యా అంటే - ఎవడికి వాడు నిద్రలేచి, అలవాటు ప్రకారం ఎవడిపనులు వాడు చేసుకుపోతున్నాడు. ఒకడు చీపురట్టుకు ఊడుస్తున్నాడు, ఒకడు దుమ్ముదులుపుతున్నాడు, మూడోవాడు చాపలు చుట్టుతున్నాడు.

మంత్రిగారు, ఒక్క చూపులోనే - వీళ్ళ కులం, వీళ్ళ గుణం తెలుసుకున్నారు: తలుపులు బిగించి - కత్తి చేతబట్టారు కాని - ఒకడికి ముగ్గురుండిరేమో ఒక్కడూ వణకలా? - "ఓ రయ్యా నీ ధాంధూములు మాకాడ కావు - మాట యింటివా సిరసుంటది - రాజ్యంలో సగం సేతుంటది-" అన్నారయ్యా! ఆ మంత్రి ఎంత పాపకర్ముడో కాని - అ సీమపుట్టి ఆ సీమ పెరిగి - ఆ కొలువు కొలిచి అంత పాపానికి ఒడిగట్టినాడయ్యా!

సరేనన్నాడు. చేతిలో చేయి వేయించుకున్నారు: పిల్లవాళ్ళు ముగ్గురికీ పెళ్ళయేదాకా మౌనవ్రతం అన్నాడు: ఎవరూ పలుకరించరా దన్నాడు: అన్నిటికీ రాజుగారు సరే నన్నాడు:

మళ్ళీ తెల్లవారింది: ఇక మరోగడియకు ముహూర్తం: పెళ్ళి కొమాళ్ళు ముగ్గురూ వెళ్ళి కొల్లేరమ్మను కొలిచి వచ్చి బాసికం కట్టాలి. బయలుదేరారయ్యా పెళ్ళికొడుకులు!

వీ రటు బయలుదేరడం చూసి అక్కా చెల్లెళ్ళు ముగ్గురూ గచ్చకాయలు ముందోసుకు కూచున్నారు. - గౌరి దేవి పాట పాడుకుంటూ: పాటయేసరికి ఆట కావాలి: ఆటయేసరికి - మంగళస్నానం - అట్లైతేనే ఆడకూతురికి ఐదవతనం - వేయికాలాలపాటు నిలుస్తుందని - ఏనాటి నుంచో వస్తున్న నమ్మకమాయెను--

అక్కడ - అ శివశక్తిని చూడగానే - ముగ్గురు పెళ్ళి కొడుకులకూ కాళ్ళు వడికినాయి. అడుగు వెనక్కి వేశారు. కాని వెనుక నిలుచున్న మంత్రి, ఓ అడుగు ముందుకు త్రోశాడు: "అది గొర్రెల్నీ మేకల్నీ తినేదిరా - మీ జోలికి రాదని", వెన్ను చరిచాడు: వాళ్ళు వెన్ను విరిచారు: అక్కడే మంత్రికి అర్ధరాజ్యం ధారాదత్తం చేశారు - మీసం మీద చేయి వేశారు.

ఇక చూచుకో అయ్యా! - ఆ తల్లికి ఉగ్రంవచ్చిందో వాళ్ళ పాపం పండిందో కాని -ఆకాశం చిల్లులుపడ్డాయి - సముద్రాలకి కట్టలు తెగినాయి - ఏక వెల్లువైంది - దేశం నేలగలసిపోయింది.

ఆ పొంగులోపడి ఆ ముగ్గురు పెళ్ళికూతుళ్ళూ కొట్టుకొచ్చి - యిక్కడ దిబ్బేసుపోయినారు. ఆ మంత్రి గచ్చ పొద అయిపోయాడు: వెళ్ళిన వాళ్ళకోసం - వాళ్ళు అలాగే గచ్చకాయలాడుతూ కూచున్నారటయ్యా!-

వాన వెలిసి వంగుడు వెలిసిన తరువాత, తరలివచ్చిన రాజు రాలేదా - అంటారా - రాకేం వచ్చారు! వచ్చి చూస్తే, ఏముంది - ఊరున్న చోట ఏరుంది: ఎక్కడికి వచ్చి వెల తెలా పోయినారు - అందరూ అని కొంగలైపోయి - ఆ యేటిమీదే తిరుగు తుంటారయ్యా!

మరి, యింత ఘాతకం తలపెట్టిన ఆ పెళ్ళికొడుకుల గతేమి టంటారా - పెద్దలు చెప్పలా:

తాజాకలం: - దిబ్బ తవ్వించడానికి వచ్చిన ద్రవిడ అధికారితో తాతయ్య యీ కథ అప్పటి కప్పటికి కల్పించి - (యిందుకు తాతయ్య హామీ) చెప్పగా -

పెళ్ళీడు పిల్లలున్న అగ్రహస్థు, అయ్యోపాపం అని ముక్కు మీద వేలేసుకుని – ఏతత్ దిబ్బలో, ప్రాచీన సామాగ్రి దొరకదనీ, అది కేవలం అధునాతనమైన పాటిమట్టిదిబ్బ మాత్రమేననీ, ప్రక్కచేలోంచి పాటిమన్ను శాంపుల్సుతో కలిపి – కేంద్ర ప్రభుత్వంవారికి ఒక బృహత్ నివేదిక పంపుకుని – తాతగారింట ముప్పొద్దులు విందు కుడిచి, మరో దిబ్బను వెదుక్కుంటూ వెడలిపోయినాడు.

తాతయ్యలో ప్రగతి శీలత లేదంటారా మీరు: అనండి – ఆయన ఒక్కడిలోనేకాదు – మా ఏ ఒక్కడిలోనూ లేదు: దిబ్బలు, ఆ పొదలూ, ఆ రొదలూ, లేకపోతే, మాకు, మాసీమకు వేడు కేముంది – ముచ్చటేముంది!

వెయ్యి అబద్ధాలాడి ఒక యిల్లు నిలపమన్నారు పెద్దలు – ఒక్క అబద్ధం ఆడి, మూడు దిబ్బలు కలకాలం నిలిపాడు తాతయ్య స్వస్తిరస్తు.

★ ★ ★

# శుద్ధ అబద్ధం

అవాళ, మిట్టమధ్యాహ్నం, ఉన్నట్టుండి కారు కమ్ము కొచ్చింది. అప్పటినుంచీ, కుండపోతగా వాన ఎడా తెరిపీ లేకుండా పడుతూంది.

ఆ పూట రోజూకన్న పెందరాళే ప్రొద్దుగూకింది. వణుకు పుట్టినట్లు, చీకటి తెరలు తెరలుగా ముంచుకొచ్చి, పొడుచుకున్నా కన్ను కనపడకుండా గుయ్యారంగా ఉంది.

పోరగాడి కడుపు ఏడుస్తూంది. ఈదురుకొట్టి అవు ఎగచేపింది. పొయ్యి అంటించి బువ్వవండుదామంటే చుట్టూ గుడిసె గాలికి ఉండుండి అదిరిపడుతూ, ఎప్పుడు ఎగిరిపోతుందా అన్నట్టు వుంది.

ముక్కిరి బిగదీసుకుపోయి - అవు, చెట్టు క్రింద మూలుగుతూంది. చంటివాడు ఎక్కిళ్ళు వచ్చేవరకూ గుక్క పట్టి, సొమ్మసిల్లి, మ్రాగన్నుగా తల్లి ఒళ్ళో పడివున్నాడు. సుబ్బడు కంట్లో వత్తులు వేసుకుని కొంగజపంచేస్తూ కూచున్నాడు.

వాడికి ఆకలివేసింది. పిల్లవాడి బొజ్జ తడిమిచూశాడు. రత్తి నవ్వింది. "పోవే!" అన్నట్టుచూసి - కట్టులోంచి ఓ చొప్పదంటు లాగి, నమలడం మొదలు పెట్టాడు.

పిల్లవాడు మసిలాడు: రత్తి వాడిని రొమ్ముకు ఒత్తుకుని, కాసిని నూకలు కచ్చాపచ్చాగా నమిలి పిల్లవాడినోటికి పట్టింది.

వాళ్ళు కూచున్న మేరా, తాటాకులు యెగిరిపోయినాయి: జల్లు పడేసి మొగంమీదికి కొట్టింది. కొంప అంటుకున్నంత మెరుపు మెరిసింది. కరణం గారింట్లో, బిందెలూ, తప్పాలాలూ, అటకమీధనుంచి పడ్డట్టు - ఉరుము ఉరిమింది. అవు - అంభా అంది. కట్టుతాడు వదులై, తడికి, భార్లాగా లోపలికి గుద్దుకుంది.

తడికకు కుంది అడ్డం వేద్దామని సుబ్బడు లేచాడు. గుర్రూగుర్రూమంటూ మట్టిరోడ్డుమీద చప్పుడు దొర్లు కుంటూ వచ్చింది. "ఎవరురా లోపల" అని పొల్లు కేక వినపడ్డది.

సుబ్బడు బయటికి తొంగి చూశాడు. ఎవరో ఓ కుదిమట్టం - కారు నెట్టుకుంటూ వచ్చారు: ఓ మీసాల అసామి, మీసాలతడి దులుపుకుంటూ ముందుకు ఓ అడుగువేసి "ఎవరది?" అన్నాడు

ఒత్తుగా చినుకు పడుతూంది కాని, జల్లు వెలిసింది. సుబ్బడు బయటికి వచ్చి "ఎం అయ్యా!" అన్నాడు.

"ఆ గొడ్డును విప్పేయి - కారు పెట్టాలి" అన్నాడు అసామి.

"దానికి నిలవ తావులేదయ్యా! తడిసి తడిసి వుంది. మెరాబాలో విడిస్తే దొమ్మ కొట్టిపోతుంది" అన్నాడు సుబ్బడు.

"అంతగాపోతే మరోటి కొనిపెడతాలే – పదివేల రూపాయలకారు పాడైపోతుంది. విప్పేయ్..." అని గదమాయించాడు ఆసామి. సుబ్బడు చిత్తమన్నాడు కిక్కురు మనకుండా.

కారులోంచి అబ్బాయిగారు "డాడీ" అని పిలిచాడు. "ఎస్‌బాబ్" అని ఆసామి దగ్గరకు వెళ్ళాడు.

"అది "కౌ" కాదూ!"

"ఎస్ బాబ్."

"వండర్‌ఫుల్ "కౌ". మిల్క్ యిస్తుంది కాదూ?"

"ఎస్ డియర్!" అన్నది పక్కనుకూచున్న అబ్బాయి అమ్మ.

"హౌనైస్:– మమ్మీ నాకు మిల్క్ కావాలి."

"అలాగే బాబ్!" అని తలనిమిరి "డాలింగ్" అని నాధుణ్ణి కేక వేసింది. ఆసామి సుబ్బణ్ణి కేక వేశాడు.

"మా అబ్బాయిగారికి పాలు కావాలి."

"లేవు బాబూ."

"పితుకు."

"ఇవ్వదు బాబూ, మా పిల్లగాడికే లేవు."

"నీ పిల్లగాడికి లేకపోతే మా బాబుకి లేవంటావా? వేషాలుపోక – కావాలంటే ఓ పావలాయిస్తా – పితుకు."

"డాలింగ్, డాలింగ్! పావలా టూమచ్! టు అనాస్, ఓన్లీ టు అనాస్–" అంటూ విలవిలలాడుతూంది ఆసామి భార్య.

"అమ్మగారూ, టు అనాస్ యిచ్చినా, టు రుపీస్ ఇచ్చినా అది పుచ్చుకోదమ్మా! అది డబ్బేం చేసుకుంటుంది తల్లీ, తవురికి ఎరిక లేదేమో కాని, కులంవున్న ఏ గొడ్డూ ఏదీ కాని వేళ – చేపదు" అంటూ సుబ్బడు కారు దగ్గిరకు వెళ్ళాడు. ఆసామి భార్యకు, కడుపులో తిప్పినంత పనై – ముక్కు చిట్లించుకుంది. ఆసామి, సుబ్బడిగాలి కారుకు సోకకుండా, అడ్డం నుంచున్నాడు.

"అలా దుంగలా నిలుచుంటాడే – కారు చెట్టుక్రిందకు నెట్టమను డాలింగ్!" అని కోకిలకంఠంతో హెచ్చరించింది ఆ యమ్మ. మోటారు కారు చెట్టు క్రిందకు చేరింది.

మళ్ళీ గాలి – సాగింది. ఒక్క విసురుకు మండ విరిగి కారుమీద పడ్డది. లోపల కోకిల కంఠం కెవ్వుమన్నది, బాబ్! యింగ్లీషులో నేచర్‌ను ధారాళంగా తిడుతున్నాడు.

అబ్బాయీ, అమ్మగారూ – కారుదిగి, గుడిసెలోపలికి వచ్చారు. డ్రైవరు తినుబండారాల పెట్టె లోపలికి జేర వేశాడు.

రత్తి–వచ్చినవాళ్ళను చూసి పిల్లవాణ్ణి భుజాన వేసుకుని నిలుచుంది. అమ్మగారు రత్తి వంక చూసి – ముక్కు మరింత చిట్లించుకుంది.

ఆసామీ – కోటుతీసి, నేలమీద పరిచాడు. అమ్మగారూ, బాబూ గునుస్తూ కూర్చున్నారు. బాబ్ బిస్కత్తుల పొట్లం చించాడు. అమ్మగారు ప్లాస్కు మూత సుతారంగా తిప్పుతూంది.

బాబ్ బిస్కత్తులు తింటున్నాడు. రత్తి చేతికి పిల్లవాడి బొజ్జ గుర్తు కొచ్చింది. "అమ్మగారూ!" అంది. "మాపిల్ల గాడికి ఓ రెండు ముక్కలు పడేయ్యండి" అంది. అనీ అనడంతో చెంప ఛెళ్ళుమంది. సుబ్బడు – మరోసారి చేయెత్తి "శుద్ధీ బుద్ధీ ఉండక్కర్లా. అవి దొరలు తినేవి. అలాంటి మా రాజులు తినేవి..." అని ఉరిమాడు.

"మీరు కొంచెంసేపు బయటికి వెళ్ళండి..." అన్నది అమ్మగారు. సుబ్బడు సకుటుంబంగా, బయటికి నడిచాడు. "తలుపు దగ్గిరేసిపో! మా డ్రైవర్ని – ఇలా రమ్మను" అన్నాడు అసామి. డ్రైవర్ని లోపలికిజేర్చి తలుపు తడికి గట్టిగా కట్టేశాడు సుబ్బడు.

ఉన్నట్టుండి, మళ్ళీ జల్లు ముంచుకొచ్చింది – గుడిసె ఎగిరిపోయేట్టుగా గాలి కొడుతూంది. సుబ్బడు – కారు, చెట్టు క్రిందనుంచి అరబయటకు నెట్టి, గోవును పొడిచోట కట్టేసి, సకుటుంబంగా కారులో ఎక్కి తలుపులు వేసుకున్నాడు.

గాలి ఎక్కువైంది. గుడిసె చిందులు వేస్తూంది. ఎప్పుడు కూలుతుందో? – తడికె లాగిచూస్తే – రావడం లేదు. తాడు కోసేందుకు కత్తిలేదు. డ్రైవర్ని తాడు కొరకమన్నాడు అసామి. కాని డ్రైవరుది బోసినోరు, అయ్యగారు కొరుకుతూ కూర్చున్నాడు.

బయట వాన కొడుతూంది. కారులో మహా వెచ్చగా ఉంది. ఒకళ్ళ దగ్గిరగా ఒకరు జరిగి కూర్చున్నారు. మరింత వెచ్చగావుంది. అలాగే తెల్లారింది. తెల్లారుతూండగానే వాన వెలిసింది.

సుబ్బడు – ఇక బయటపడదామని తలుపు నెట్టాడు. ఉహూఁ... రాందే! గడియ తీయడం తిరకాసు వాడికి తెలియదాయెను...

పెదవులన్నీ పగిలి, చిగుళ్ళరక్తం చిమ్ముతూంటే – అసామీ – సుకుటుంబముగా తాడు నమిలి తడికెవిప్పిన – అనంతరం బయటకి వచ్చాడు. ఒక్క ఉరుకున ఆ కుటుంబం కారుదగ్గిరకు వచ్చిపడ్డది, తలుపు తీసింది. లోపల సుబ్బడి కుటుంబం అదమరచి నిద్రపోతూంది.

బయటవాళ్ళ అరుపులకీ, పెడబొబ్బలికీ – లోపలివాళ్ళు లేచి – కారు దిగారు. "తవురి ధర్మమా అంటూ పొడిచోట నిదురోయినాం, అయ్యా!" అంటూ సుబ్బడు వినయంగా కళ్ళు నులుముకున్నాడు. పిల్లవాడు మెలకువవచ్చి – ఆవులించాడు.

"డ్రైవర్! తలుపులు ఎందుకు లాక్ చెయ్యలా?"

"లేదుసార్!"

"నిన్ను డిస్మిస్ చేశాను."

"రైట్‌సార్, నాకు ఈ నెల జీతం – రూల్సు ప్రకారం మూడు నెలల బోనస్ ఇప్పించండి సార్."

"ఇంటికి రా. – చెక్ బుక్ తేలేదు."

"రైటోసార్, నాకు సొమ్ము ముట్టేవరకూ, అమ్మగారి నగ ఏదన్నా యిప్పించండి. లేకపోతే డిస్మిస్ అర్డరు చెల్లదు."

రత్తి, సుబ్బడూ చోద్యంగా ఈ మాటలు ఆలకిస్తున్నారు.

"ఏమా తలపొగరు. నీకు దిక్కున్న చోట చెప్పకోపో - ఒక్క కానీ యివ్వను--"

డ్రైవరు వెళుతున్నాడు.

"ఏయ్ డ్రైవర్!"

"సార్!"

"కారు తాళాలు ఏవీ!"

"అడగడం న్యాయమా సార్, - డబ్బు యిప్పించండి."

"డ్రైవర్ మమల్ని అధ్వాన్నపు అడవిలో ఇలా యిబ్బంది పెడతావా?" అమ్మగారు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది.

"ఇయ్యి బాబూ వారిసొమ్ము వారికియ్యి..." అన్నాడు సుబ్బడు.

"మరి, నా రెక్కల కష్టం -?" అన్నాడు డ్రైవరు -

"ఎక్కడికీ పోదు. కారుకొనుక్కున్న సామంతులు - నీ జీతం డబ్బులు ఎగేస్తారా - యివ్వవయ్యా! - ఆతల్లి అడిగినందుకే యివ్వచ్చు -" అని బ్రతిమాలాడు సుబ్బడు. డ్రైవరు - యిచ్చేశాడు.

"మావంటి వారి దగ్గర యిన్నాళ్ళూ నౌకరీచేసి - చివరకు చెట్టు క్రింద బ్రతికేవాళ్ళచేత చెప్పించుకునే గతి పట్టిందానీకు!-"

"బుద్ధిలిలా ఉండబట్టే-మీకు పూటకు గతి ఉండదు-"

-అయ్యగారూ; అమ్మగారూ ఏకగ్రీవంగా తిట్టి కారు కదిల్చారు-

"ఇదిగో - ఒరేయ్-!" అని ఆసామి సుబ్బణ్ణి కేక వేసి - ఒక బేడ అమ్మగారు అందివ్వగా - సుబ్బడిమీదికి గిరవాటు వేశారు -

సుబ్బడు - నేల పడ్డది - తీసి కళ్ళకు అద్దుకుని -

"ఆహాఁ - ఏం మనుష్యులయ్యా!" అన్నాడు డ్రైవరుతో -

కారు, - ధూకుడుగా నాలుగు బారలుసాగి - ఆగింది. బాబు - "డ్రైవర్! - డ్రైవర్" - అని పొల్లు కేకలు పెడుతున్నాడు.

డ్రైవరు - సుబ్బడివంక చూసి నవ్వాడు - "మాఅయ్యగారికి ఆర్భాటమే కాని, కారు తోలలేరు -"

"అన్నా! - అన్నా! - నీకు పున్నెముంటుంది - పెద్దవారి బుద్ధులు ఎసుమంటి వైతేనేం - లోన పోరగాడున్నాడు- తిన్నగా - తోలుకు పో - అన్నా! -" అని రత్తి బ్రతిమాలింది. డ్రైవరు - తల్లి మందలించిన పిల్లవాడిలాగా - తలవంచుకు ముందుకు సాగాడు.

"ఒక్క క్షణం కారు నిలుపన్నా - మా మనిషి చేత పాలుతీసి అంపుతా - ఆకలి పడుంటాడు - పిల్లగాడు -

'ఇదిగో నయ్యోవ్ పెద్దమణిసీ! - ఆ బేడకాసెట్టి కోమటింటికాడ గొబ్బెరకాయట్టుకురా - కొట్టి సూర్యబగవాన్లకు దణ్ణమెట్టుకుందాం! - అలాటి బక్కోళ్ళను సల్లగా సూడమని' - అంది రత్తి.

★ ★ ★

# నాన్యఃపంథా

"నేను వాడి పీక నులిమేశాను –

"నేనే చంపింది. నమ్ముతావా, లేదా –

––నమ్మదామా?... అప్పటికే మూడో కాలంలో ఉన్నాడు. ఎన్ని సీసాలో ఖాళీ అయినవి, కాని ఆ కళేబరం ఇక అంతైనా భరాయించుకునేటట్టు ఉంది. మాట ఎక్కడో సముద్రం అట్టడుగునుంచి వస్తూన్నట్టుంది. దానికి విలువ ఏమిటి?

... నమ్మకపోదామా...అతడికి త్రాగుడు తల కెక్కినకొద్దీ, నిదానం హెచ్చుతుంది.... మెదడు పూర్ణంగా వికసించి సబబుగా పనిచేయ మొదలు పెడుతుంది... కాని, ఏమో...

అప్పటికి అరడజనుసార్లన్నా, నామీద ఈ వాక్యం ప్రయోగించాడు. నాకు ఎటు అనడానికీ పాలుపోవడం లేదు. చూపులు అప్పగించి కూర్చుని – ఎదట, ఎప్పుడో చల్లారి తెరకగట్టుకుపోయిన టీవంకనైనా చూడకుండా, అతడు రెట్టించినపుడల్లా కొత్త ఖంగారు పుట్టి ఉలికిపడుతూ "ఇలా వచ్చిందేమా భగవంతుడా?"అని మనసులో అనుకుంటూ ఉన్నాను.

నిండుకుండ జారి క్రిందపడినట్టుగా – పట్టించిన మధురసం ఇముడుక, ఉన్న చోటనే భళ్ళుమన్నాడు – తెళ్లుకు – తెళ్లుకు –

నేనూ, మరో వెయిటరూ సాయంపట్టి, పైన గదిలోకి చేర్చాము. ఒళ్ళు తెలిసిన తరువాత, ఓ పట్టానికి సత్తువ చేసుకుని లేచి, దిండ్లమీద ఒరిగి కూర్చుని కాఫీ త్రాగి – సిగరెట్టు, దమ్ము కొకటిగా, అయిదు నిమిషాలు ఊదేసి... అప్పటికి బాగా తేరుకుని...సోఫామీద నా పక్కను సర్దుకున్నాడు. ఇక గ్రంథంలోకి దిగుతున్నాం – అని నాకు వెంటనే అనిపించింది.

"నీవు నమ్మవు కాదూ?" ఒక్కొక్కమాట ఒక్కొక్క స్థాయిలో – గుణించుకుపోయే ఊతంతో, నన్ను జవాబుకు మొగమాటపెడుతూ నొక్కులుగా ఉచ్చరించాడు. నేను అప్పటికీ ఏమీ అనలేకపోయినాను. అతనికి మతి పూర్తిగా పోయిందేమోనని, దిగులూ, భయం పూర్తిగా కమ్మేసి ఊపిరి సలుపనీయడంలేదు.

"అవునులే–నమ్మవు. నాకు తెలుసునులే, నీవేకాదు, మనవాడెవడైనా ఇంతే – స్నేహితులం కాదుటోయ్, ఒకరి మీద ఒకరం ఈగ వ్రాలనిస్తామా? స్నేహమైనాక...ప్రాణమైనా...ఊ... ఈ స్నేహమే వాడి ప్రాణం తీయించింది.

"నే నిలా ఎందుకు అయినానో గ్రహించావా? వాడి మూలానే: ఇదివరకన్నావా... సరదాకు త్రాగాను : ఇవాళ – సరదా ఇహనుంచీ చచ్చిపోవాలని... నాగొప్ప హృదయం–ఇతరుల కష్టాలు సహించలేని దొడ్డతనం – వీటి మీద ఈ బ్రాందీ నోటితో ఖాండ్రించి – ఉమ్మేయాలని, ఏదీ సిగరెట్?"

ఒక చేతికియిచ్చి కేసు అతనికి అందుబాటులో ఉంచి, నేను కొంచెం ఎడంగా జరిగాను. ఒక సందర్భం చెప్పడం, ఒకగుక్క పొగలాగడం, ఇలా ఆసాంతమూ నడిచింది – చూపుల్లోకాని – ధోరణిలోకాని ఉద్వేగం – నరాల దడదడ తప్ప నిబ్బరము మాలిన తూలుడు అగుపించడం లేదు. అందువల్ల, చెప్పేది వినడానికి – నమ్మినా నమ్మకపోయినా – ఇకమీద నా కేమీ బెదురు కలగలేదు.

"వాడింత ఛండాలు దౌతాడని – గుండెలు క్రుళ్ళించుకుంటాడని నేను ఎన్నడూ అనుకోలేదోయ్ – పన్నీరు బూడిద రాసి మీద ఎన్ని కడవలు కుమ్మరించినా – ఎందుకులే, ఎవరి ననవలసినపనేముంది? – సరేలే – అసలు అరవీశె ఉపోద్ఘాతం అరువీశెలూ అవుతూాందే – ఓహో –

"నేను దాసును చూసేటప్పటికి వాడి మనసు మండి మారణహోమ మైపోయి ఉన్నాడు. లోకం కోసం – మధ్య మధ్య తనకోసం – పద్యాలలో ఏడ్చి ఏడ్చి – తరుక్కుపోయిన మనసుముక్కలన్నీ దేశంమీద విసిరివేసి – కొవ్వొత్తి ఆరిపోయేముందు గులేబులాగా ఉన్నాడంటే – చదివి తలలూపి భేష్ భేష్ అన్న ఒక రండాకొడుకన్నా – బతిమాలి, తెప్పించుకుని ఉల్లాగా అచ్చు వేసుకున్న ఒక్క ఎడిటర్ అన్నా – అలాటి రత్నాలు వెదజల్లుతూన్న వాడు ఏమైనాడో, తినడానికి తిండి ఉందో లేదో – అని ఎవడన్నా కనుక్కున్న పాపానపోయినాడా?

"చూసేటప్పటి కల్లా నాకు కళ్ళవెంట నెత్తురు చుక్కలు రాలినాయోయ్. దేవతలు వర్షాలిచ్చే ఉద్యోగాలలోంచి రిటైరై – ఉపకార వేతనాలు పుచ్చుకుంటున్నారు కాదూ – ఈ పచ్చి కలిలో దేవుడల్లే నేను వాని పాలిటికి కనబడదా మనుకున్నాను. ఆ అహంకారమే ఇంతముంచింది.

"పక్కా కవికి ఉండే పొగరుమోతుతన మంతా ఝళిపించి – నన్నూ, నే చేయబోయే సహాయాన్నీ గడ్డిపోచ క్రింద దులిపేశాడే మొదట! ఆ మూర్ఖపుపట్టు, వాడు విడువకుండా – లొంగిపోకుండా ఉన్నా – బాగుండేదే – నాకోసం కాదు–లోకం కోసం నా యేడుపు.

"కలలోనైనా ఉట్టిమీదకు ఎక్కించకూడని పుణ్య నిర్భాగ్యమూర్తిని – కళ్ళు తెరచుకుని ఒక్క మాటుగా ఆకాశంలోకి ఎగురవేశాను. పడింది – నేను చేతులార చేసిన పాపం తోడి అదీ బ్రద్దలైంది.

"ఏం కావాలో – అతడు కోరుకోకుండానే అన్నీ యిచ్చానోయ్. దారిద్ర్యమనేది వాడికి ఆమడ దూరంలోనైనా కాలుపెట్ట వీలులేకుండా చేశానోయ్. ఇంతవరదాకా చిల్లర రత్నాలు దొరికిన గనిలో యిక ప్రతివేటుకూ తగిలేది కోహినూరే ననుకున్నానోయ్...

"నందదేవీ శిఖరానికి ఎక్కడానికి జర్మను పండితులు ప్రయత్నం చేద్దామని వచ్చారని పత్రికలో చదివి ...నేనూ వాళ్ళలో కలుద్దామని వెళ్ళిపోయినాను...అన్ని కష్టాలూ పడి ... ఏమీ సాధించలేక, ఆరునెల్లకు వాళ్ళు...హతమారగా మిగిలినవాళ్ళు...ఓడ ఎక్కారు. నేనూ యింటి ముఖం పట్టాను.

వచ్చిన మర్నాడు, దాసును వెదుక్కుంటూ... వాడుంటూన్న యిల్లు కనుక్కుని పోయినాను. నా పిలుపు అంది, నౌకరువచ్చి, లోపలకు తీసుకువెళ్ళి... "అయ్యగారికి చెప్పివస్తాన"ని వెళ్ళాడు. దగ్గరగాఉన్న వాలుకుర్చీలో కూలబడి...గది అమరిక చూసి,

మురుస్తూ "మనవాడు ఇంకా ఫాయాలోనే ఉన్నాడు కదా...డబ్బుకు కొదవలేదా యెను...వ్రాసిన పద్యాలు...సంపుటాలుగా... ఎంత అందంగా అచ్చు వేయించాడో...నాకు అవన్నీ యిస్తాడు కాబోలును, ఎన్నాళ్ళకు కనబడ్డావని నన్ను అమాంతం కౌగలించుకుంటాడు కాబోలును, కొన్నాళ్ళదాకా అక్కడే తనవద్దనే ఉండమని బలవంతంచేసి, నిలిపివేసుకుంటాడు కాబోలును... అలాగైతే యెంత కులాసాగా కాలక్షేపం అవుతుంది; ఒక వేళ...యెవరన్నా ప్రేయసి ఏర్పడిందేమో... అంతవాడు కోరాలిగాని... అసలు అందాకా అక్కర్లేదు, అతని పేరువిని...రచనలు చూసి నేనంటే నేనని...యెందరెందరు రావణుని కోటగుమ్మంలో దివ్యసుందరులులాగా పడికాపులుగా ఉండరు?... నేనుండటం ఆ పక్షంలో... అతనికి అభ్యంతరంగా ఉంటుందేమో...అయినా

"-- ఇన్ని కలలతో దాసు లోపలికి వస్తాడా అని ఎదురుకాచుకుని...గుమ్మానికి ఉన్న కర్టెన్ రింగులు చిరుగాలికి రవంత గలగలమనినప్పుడల్లా...అతడే వచ్చాడని భావనలోనుంచి మేల్కొంటూ--"

---తలుపు టకటక మంది: "కమిన్" అనిపించుకుని వెయిటర్ వచ్చి కాఫీ కప్పులు, గోడదగ్గిరగానున్న టీ పాయ్ మా యెదటికి లాగి. మీద ఉంచాడు. త్రాగుతూండగా, టిన్ను అంచుతో మీట వెనుకకు నెట్టి గోరువాటం నొక్కి గిర్రుమనిపించి డిప్ప ఊడదీసి...కాగితం చెవి పట్టుకు పైకెత్తి - డబ్బా బల్లమీద పెట్టాడు. చెరో సిగరెట్ తీసుకున్నాము. "ఏయ్ అవి తీసేయ్..." వెయిటరు వాజులోంచి వాడిన పూలను తీసి కప్పులు పట్టుకు వెళ్ళిపోయినాడు...అతడు అగ్గిపుల్ల మంటమీదుగా నా మొగవంక చూసి "నాకు, పనికి రానివంటే పరమరోత"... అని పొగ భుగభుగ మనిపించాడు.

--"వచ్చాడు; దాసు, అరగంటకి...దర్శనం ప్రసాదించాడు. మనం అంతవరదాకా గాలిలో కట్టిన స్కైస్క్రేపర్సు అన్నీ ఒకమారు పునాదులంటా కదిలి...

"ఎలా ఉన్నాడనుకున్నావ్...పుల్లా హవుతాం... ఫుడ్కా హవుతామ్" అదీ కథ...అదీ దీక్ష. ఛంద్రనిప్పులు కళ్ళుమాత్రం...కర్రకొనకు కట్టిన మందారమొగ్గలులాగా....

"ఒంటరిగా దయచేశాడా? పుదుచ్చేరి సీతారామ విగ్రహాలుంటాయి. చూశావూ - వీడి భుజంమీద తలవాల్చుకుని-పద్మినీజాతిదానికన్నా నీరసించిపోయిన వాడి నడుము చుట్టూ-ఒక చెయ్యి మలుపుకుని- చీకటిపడగానే క్రీనీడల్లో ఏ సందులో చూసినా మనకు తగులుతుంటారే చిల్లర శ్రీమహాలక్ష్ములు- అదొకలే.

"చూశాడు - వేయబోయే అడుగు ఎత్తి అలాగే ఉంచి భగీరథుడులా - చూశాడు-చూశాడు.

"ఆ పిశాచం, కోరమొగంవేసి కళ్ళు చికిలించింది - ఇద్దరూ అక్కడనుంచి ఒకటే ఇకిలింపు - మాటలు పెగలని విరగబడటం-

"దాసూ"

"ఏం...దుకోయ్ వాసూ!"

"అందాకా యెక్కింది"

"నం-ద-దేవిదాకా...మళ్ళా...దిగింది....ఇహి హీయ్"

"—ఇదీ–మా సంభాషణ – పిశాచాలు తరుముకు వస్తూన్నట్టుగా – ప్రాణం గుప్పిటలోకి తెచ్చుకుని బయటకు ఒక్క ఉరుకు ఉరికాను.

"ఆ ఇహిహీలు" నాకు స్పృహతప్పేదాకా చెవులల్లో గింగురుమంటూనే ఉన్నవి: పక్కమీదనుంచి లేచి కాలు క్రింద పెట్టేటప్పటికి పదిహేనురోజులైంది. కాని, అంతటితోనైనా ఈ దేహికి బుద్ధి వచ్చిందా?

"నీరసం వదలకుండానే – మళ్ళా వాడికోసం – పడుతూ లేస్తూనే పోయినాను – కాని – వాడు ఆ యిల్లు వదిలేశాడు. ఏమైనాడో ఇరుగూ పొరుగూ యెవరిని విచారించినా తెలియదన్నవారే. వెదికాను– పట్టణంఅంతా గాలించగా, చివరకు ఓ మారుమూల, ఎక్కడో అధ్వాన్నపు అడవిలో, ఓ పెణక కూలిపోయిన వసారాలో, చొక్కా అయినా లేకుండా చింకి చాపమీద రెల్లు పుడకలాగా కొట్టుకుంటూ పడి ఉన్నాడు.

—"చూసి నేను వెనక్కు తగ్గాను. దాసు లేచివచ్చి నా మీద తూలి కౌగలించుకుని వెక్కి వెక్కి ఏడవటం మొదలు పెట్టాడు. నాకు తలతిరిగిపోయింది... అనునయంగా... చేతితో వీపు నిమిరాను...ఏం మిగిలాడు...ఎముకలైనా గుప్పెడయే టట్టులేవు! అయినాఇప్పటికైనా ఫరవాలేదు. చేసినదంతా తప్పని తెలుసుకుంటే, ఇదే పశ్చాత్తాపమైతే...నీరు అంటే పచ్చి నిలవాలి కాని...యెంత మ్రోడైతేమాత్రం... ఎంతలో చిగిర్చి పువ్వులు ఘుమాయిస్తుంది...దోహదం మనచేతిలో...

— "అప్పటికీ మన బుద్ధి గడ్డితింటూనే ఉందోయ్. అంతా అబద్ధం: నే ననుకున్నదంతా శుద్ధతప్పు. ఆ వగల మారి ఏడ్పు లెందు కనుకున్నావ్? రంభకు సాక్షాత్తూ పినతల్లికూతురు, ఆ...ఉందే, ఆ లోకైక మోహిని...వీడి మూటాముల్లెతో గూడా మరొకడితో రైలెక్కి ఉడాయింం చేసింది. అందుకోసం... ఈకన్నీళ్ళన్నీ...దాన్ని చూడందీ...దానితో కలసి ఉండందీ బ్రతకలేడు... కవిత్వం లేదు... లేదు. కవినని అసలువాడికి జ్ఞాపకమే లేదు."

—"నవనాడులు క్రుంగిపోయి...లేచాను. నాకాళ్ళు పట్టుకుని వదలడే...దాన్ని ఏలాగైనా వెదకి నేను తీసుకువచ్చి...ఇక ఆ పైమాటలు వినిపించుకోకుండా...డబ్బు ఏమన్నా యివ్వమన్న దానికిమాత్రం, రేపు వస్తానని ఓ కేక వెనుకకు విసిరివేసి అటు తిరిగిచూడకుండా వచ్చేశాను.

"రెండు దినాలదాకా, ఆ చాయలకు పోలేదు. పోదలచుకోలేదు. మనసు సలాసలా మరిగిపోతూంది. పరిపరివిధాల ఆలోచనలు పోయినవి. ఆ పీడకలలోంచి దూసుకుపోయి...మళ్ళా హిమాలయాల్లో పడదామనుకున్నాను. కాని–

– "వెళ్ళాను. అప్పటికే ఉసురు లోడిపోయి చీమలు పట్టి ఉండవలసిన దేహం...ఇంకా ప్రాణజ్యోతిని కొండ ఎక్కనీకుండా ఎలా అంటిపట్టుకుని ఉన్నదో – దాసును లేచి రమ్మన్నాను. "ఎక్కడికి" – అని త్రాణ లేనందువల్ల పనస చదివినట్లు ఎగుడుదిగుడు స్వరంతో – మాట ఊదాడు. "స్వర్గానికి" అన్నాను – విషంగా.

"లేని అసలు – లేనిసత్తువ, తెప్పించుకుని నావెంట బయలుదేరాడు: పవలల్లా మహారాజులలాగాగడిపాం. అంటే వాడు, కడుపుకు వెక్కసమయేదాకా తిని – పొర్లి వచ్చేట్టుగా త్రాగుతూంటే – నేను – ఇంకా ఇంకా అని ఉసికొల్పుతూ–

"చీకటి పడిన తరువాత మాంచి బందోబస్తయిన సీమాటెని – అనుకున్నదాని కిబ్బడిధర యిచ్చి – ఆ గది లోకి – సింహాన్ని లాగా వదిలాను – ఎక్కిళ్ళూ – నవ్వులూ – బుసలూ – అన్నీ ఆ ప్రళయ – శోభనపు గదిలోంచి – తెల్లవార్లూ వింటూ– గుమ్మందగ్గిర – కంటిలో వత్తులు వేసుకుని, కునుకకుండా కాపలా కూర్చున్నాను.

"చీకట్లు విచ్చుతూండగా – తలుపులు నెట్టుకుని లోపలికి వెళ్ళాను –చెల్లాచెదురుగా – ఇద్దరూ ఒకరిసరసను ఒకరు యుద్ధభూమిలాగా ఉన్న పక్కమీద పడి ఉన్నారు – వాడికి శ్వాస యింకా ఆడుతూనేఉంది–

ఎండుపుల్లను ఫెళుక్కు మనిపించి నట్టుగా – వాడిగొంతు నులిమేశాను. ఆ రవంత గొరగొర – దాని గుర్రుహోరులో కలిసిపోయింది – ఈ నిశ్శబ్దపు – అలజడికే అది మేలుకుని – చూసి గ్రహించి – ఒకపొల్లు కేక వేసుకుంటూ – లేచి – దౌడాయించింది.

"ప్రొద్దునుంచీ – ఆ గది వదలినప్పటినుంచీ – దోవాతెన్నూ అనకుండా – తిరుగుతూండగా – నీవు కనుపించావు – రెండేండ్లనుంచీ సీమలోఉన్న నీవు–సరిగా యీ సమయానికే ఊడిపడటం –ఒకందుకు మంచిదేలే–

"నేను – ఇక ఎవరి ఎదుటా నోరు మెదపదలచుకోలేదు. లోకం ఏమనుకుంటే నాకేం –"

"నేను చేసింది నా మనసుకు నచ్చిందా లేదా – అయ్యవారిని చేయబోగా – కోతి – కొండముచ్చుగామారింది. వాడి దేహాన్ని సుఖపెడదామని – మతిమాలిన ఎరువు వేసి – మనసును కుళ్ళించాను – అక్కరకు వచ్చి... తెలుగుజండా –– దేశదేశాల త్రిప్పవలసిన... మహాకవి... నా దరిద్రపు ధర్మగుణం మూలాన – ఇంత పనికిమాలినవాడై పోయినాడు... అసలే ఎడారిగాఉన్న మన కావ్య క్షేత్రంలో – మరో మోడుకూడా ఎందుకూ – పూల మొక్కకు పురుగు అంటించినవాడే – కుళ్ళగించి వేయడం – ధర్మం.

"సబబవునా కాదా .... ప్రకృతి ... సజావుగా ఉండక...మస్కా కొట్టినప్పుడు ... ఎదురుతిరిగి దానికన్నముందు మనం...దాని విశ్వనేత్రాల్లో దుమ్ముకొట్టి...సంహార కార్యం అంటూ వచ్చేటప్పటికీ...నీకు తీసిపోయేవాడిని కానేవ్....అని చూపించడం....క్షాత్రమవునా కాదా?

"నీవు...ఏమంటావ్?

––ఆ మాట చెవిని పడి...నా ఆలోచనలు సుడితిరగడం...వడి తగ్గకముందే...పోలీసులు వచ్చారు.

★ ★ ★

# పీఠిక

(మా మనుమడు ఈ నడుమను.... ముక్తసరిగా... కలగన్న, కథ)

ఆన 1957 సం॥ జూలై నెలాఖరు లోపుగా ఇలా జరిగి తీరుతుంది.

నేనూ, వాళ్ళ లక్ష్మిని. ఇప్పటికి షుమారు నాలుగు మాసముల పదిరోజులనుంచీ ప్రేమిస్తున్నానని, మా నాన్నకు ఏమాత్రం అచోకీ తెలిసినా, ముందు మా కొంప అంటుకుంటుంది; ఉత్తర దక్షిణంలో వాళ్ళ కొంప అంటుకుంటుంది; (ఉహూ...అ మాత్రం వ్యవధానంకూడా ఉండదేమో, రెండు కొంపలూ, ఒక్కసారే అంటుకుంటాయి).

(సరే, మన సంగతి అలా ఉంచి, లక్ష్మికి వచ్చే ప్రమాద మేమిటో ఆలోచించుకుందాము.)

ఆర్షేయ పౌరుషేయములు ఈ అయిదారు సంవత్సరములనుంచీ విచారించి, వాళ్ళ అమ్మా నాన్నా చివరకు ఎలాగయితేనేం సిసలు చేసిన...ఆ సంబంధానికి లక్ష్మి ఎన్నటికీ ఒప్పుకోదు.

ఒప్పుకోక ఏం చేస్తుందయ్యా. (ఉత్తమోత్తమమైన సాంఘిక నవలలో, కథానాయిక చేసేపనే చేస్తుంది) "మనసా – వాచా – కర్మణా ఫలానా సుందరుణ్ణి ప్రేమించాను. ఇప్పటికి రమారమి ఆరుమాసములనుంచీ, అతడు నా నిలువెల్లా నిండిపోయినాడు; కనుక, ఈఒక్క జన్మకే కాదు, దీనితో కలిపి వేయిజన్మలు చెల్లేవరకూ నాకు మరోసంబంధం అంటూ మీరు విచారించేందుకువీలులేదు..." అని ఖచ్చితంగా చెప్పేస్తుంది.

తల్లిదండ్రులు ఇద్దరూ పరిపరి విధాల, నయానా, భయానా చెప్పిచూస్తారు. బ్రతిమాలుకుంటారు, ఎవరికి చేతనైనట్లువారు కంటతడీ, నీరూ పెట్టుకుంటారు; చివరకు విసివి, వేసారి, ఉగ్రులై, ఆ గాలివానలో, చీకటి – అంధకారంలో, వీధి తలుపు ఛెళ్ళునతీసి, (తాము ఏకగ్రీవంగా 16 సంవత్సరాల క్రితం కడుపార కన్న) కూతుర్ని నిర్దయులై ఇంట్లోంచి వెళ్ళగొడతారు.

ఆ అమ్మాయి, కంటక – పథాన్ని పడి, అడుగులు తడబడుతూపోయి, (అమెమీద కనికారంతో), (ఆ పూట రెండు గంటలు ఆలస్యంగా వచ్చి కాచుకుని పడిఉన్న) మెయిల్ లో ఎక్కేస్తుంది...(తరువాత రెండు సంవత్సరాలు, చరిత్రలో అంతా అంధకారం...)

–కాని, నేను ఈ షుమారు ఏడువందల దినములూ, ఆ అమ్మాయిని మరువలేదు. కాని, నాన్నకు వినపడకుండా మనసులో రోజా జపం చేస్తూంటే గుండెలు రుద్రాక్షలుల్లాగా గల – గలలాడేవి. కాని, నేను ఎన్నడూ ఆయన కళ్ళ ఎదుట పడేట్లు నిలువునా నీరు కాలేదు.

ముక్కానీకార్డంతమేర, ముప్ఫై పేజీలకు మించిన ప్రేమగీతం వ్రాశాను ఆ అమ్మాయిమీద అంకితం ఇత్తు కుదరక, అయిదారు పుస్తకాల్లో పేజీలన్నీ పాడుచేశాను. (ఈ శ్రమంతా అనవసరం) నా జీవితంలో ఈ భాగం, రామాయణం అంత కావ్యంగా పెంచి, ఆమె అడుగు దమ్ములు ఎక్కడున్నాయో ప్రస్తుతం, వెదుక్కుంటూపోయి, అంకితం అయి పొమ్మని, ఈ నడుమనే తోలేశాను (కలలో).

నా జీవితము యావత్తూ ధరీ అంతూ లేని సహారాగా మారిపోయింది. కాని, తోవా తెన్నూ లేని ఆ ఇసుకలోపడి నడవగా, నడవగా, ఎన్నో యుగాలు గడవగా, ఏనాటికో ఓనాడు, అమాంతం నా కళ్ళకు, ఆ రేవతి కనబడక తప్పదు.

...పరీక్షలు దగ్గరకు వచ్చాయి. ఈ వారంరోజులూ ప్రేమసంగీతం కట్టిపెట్టాలి. మళ్ళీ జూలైదాకా, ఆమాటే, ఆపాటే షికారుగా పాడుకుంటూ ఉండవచ్చును--

కాలేజీ తలుపులూ, కిటికీలూ బార్లగా తెరిచారు. అందరిలోకీ నేనే చిక్కి శల్యమై, వేయి తలలపెట్టు విరహభారాన్ని ఒంటిచేతిమీద మోస్తున్నందుకు, నన్ను చూసి నా మనసు గర్వించింది.

ఆ ఏడాది, నేను నడపలేదు. అదే నా చెవి మేలేసి పట్టుకుని, పన్నెండు మాసాల బారునా, జర – జరా ఈడ్చుకు వెళ్ళింది – ఆ వెళ్ళడం – వెళ్ళడం యకాయకి పరీక్షల్లోకి వెళ్ళింది. పరీక్షలు సజావుగా "ప్యాస్"లో--

-- విశ్వవిద్యాలయం వాళ్ళు, నాకోసం పట్టామీద అక్షరాలు చెక్కిస్తున్నారు. పత్రికవాళ్ళు నా బొమ్మను నిలువుకు – నిలువునా పత్రికల్లోకి ఎక్కిస్తున్నారు. సినీమాల వాళ్ళు నేను వేయాలిసిన వేషంకోసం తొక్కిసలాడుకుంటున్నారు.

(చాలా పొరబాటు, ఈ వివరాలన్నీ వ్రాయడం. రెండు సంవత్సరాలూ అంధయుగమని, వెనుక పేజీల్లో ఎక్కడో వ్రాశానన్న సంగతి ఇప్పుడు జ్ఞాపకం వచ్చింది – ఇంతవరకూ వ్రాసిన ప్రేలాపన అంతా కొట్టివేసినదాంట్లో జమ. దీన్ని చిత్తు ప్రతిగా భావిస్తున్నాను.)

(ఇంకో గొప్ప పొరబాటు, రెండు సంవత్సరాలని వ్రాశానే, అది శుద్ధ – తప్పు – నేను, కథకు నాయకుణ్ణికాగల విశ్వవిఖ్యాతి సంపాదించుకునేందుకు, అధమం మరోవారం రోజులైనా ఎక్కువపట్టేట్టు చేయడం, సమంజసము. కనుక –)

ఆవాళ, ఏం వారమో జ్ఞాపకంలేదు. నిదురమంచం మీంచి లేచి, గుమ్మంలోకి వచ్చి అలకింతును కదా, నా పేరు పరిపరి విధాల, రోదసిలో మారుమ్రోగిపోతూంది. దాని పుట్టంతా మునిగిపోయినట్లు, ఈ వాడనుంచి ఆ వాడ చివరకు హలో లక్ష్మణా అంటూ అంచె – లంచెలుగా దొర్లుకుపోయే ప్రతి బస్సూ, ఏదో రంగులో, ఏదో ఓ భంగిమలో, నా అంగసౌష్టవాన్ని భరిస్తూంది. ఖాళీగా ఉన్న ప్రతి గోడకూ, నా బొమ్మతో పుస్తీ కట్టారు కొన్ని మూర్తులు గోడెక్కి, మేడెక్కి కూర్చున్నాయి. ఊరు మొత్తంమీద, ఎక్కడైతేనేం, నా మొగాన, చిన్నా పెద్దా కలిసి, ఓ వెయ్యి దీపాలన్నా వెలిగినవి.

(ఆత్మకథ ఇంత విస్తీర్ణంగా ఘోషించవచ్చునా అనే అనుమానం, ఇప్పుడు బాధించడానికి ప్రారంభించుతూంది. ఇటు మొగ్గు ఎక్కువౌతూంది – దాళా కట్టాలి. ఇంకో అనుమానంకూడా కద్దు. సినీమా ప్రముఖులు, మొగతార మొగాన ఇంతసొమ్ము

తగలవేస్తారా? – ("తగుల వేయుట"లో వైచిత్రికి వేంకటరాయశాస్త్రిగారికి కృతజ్ఞత) – ఈ అనుమానాలు రెండూ, తీరేవికావు. గనుక–

(–ఇంతకూ చెప్పవచ్చిందేమంటే, అసలు సంగతి చెప్పడం మరిచిపోయినాను. నేను, పట్నంలో ఒక దివ్య భవనంలో దాసదాసీ జనంబులు చామరంబులు వీస్తుండగా రోజూ కొంతసేపు ఉయ్యాలలూగుతూ, కిటికీ కమ్ములలో నుండి చెర్లాటలాడే ప్రకృతి శోభను తిలకించడం నిత్యకృత్యముగా పెట్టుకున్నాను. "నిజమైన–జీవితం"లో (ఇంగ్లీషులో కాని దీని భావం తెలియదు) నా అందచందాలన్నీ వెండి తెరకు అర్పణచేసిన త్యాగిని గనుక, వయసుకు మించిన జ్ఞాన వృద్ధుణ్ణిగా కనబడుతూన్న మాటలో కొంతవరకు నిజంలేక పోలేదు–) (నాలో, నాదర్జాలో ఇంతమార్పు రావడానికి కాలపరిమితి ఎంత నిర్ణయించాలో తేల్చుకోలేకుండా ఉన్నాను–)

(మాటల ధోరణిలోపడి లక్ష్మిమాటే మరచిపోతూన్నాను. ఇన్ని పంక్తులు ఆడదిక్కు లేకుండా గడపటం, నడపటం ఛాందసం)

–మళ్లా ఒకనాడు – ఎన్నో ఏళ్ళకు– ఫోనుగంట మ్రోగడం ప్రారంభించింది – లక్ష్మిగొంతు, తీగెల మీద ప్రాకి వచ్చింది –

నన్నే పిలుస్తోంది అనుకున్నాను. కాని, హతవిధీ! లక్ష్మి నాతోకాదు మాట్లాడుతూంది! తెరమీద చూపిన నా వేషాన్ని పేరెట్టి పిలిచి, కామంలోకి కవ్విస్తూన్నది. తీగెలద్వారా, లక్ష్మి, నాతో మనసారా వ్యభిచరించింది. కొంతకాలం, మా ప్రేమలేఖలు, సకాలంలో జారీచేయలేక తపాలాశాఖ యావత్తూ గగ్గోలెత్తిపోయింది – (అలంకారాలూ, పదగుంభన; మాంచి పకడ్బందీ పాకములో అమర్చగలిగిన నలుగురు – గజవ్రాతగాళ్ళను, ప్రత్యేకం ఈ పని కోసం ఈ సందర్భంలో మనం జీత – బత్తెము లిచ్చి పోషించడం జరిగిందని చదువరులు గ్రహించే సూచన ఇముడ్చాలి?) – ఇలా కొంతకాలం గడిచింది – (చస్, కాలం వృధాగా చాలా దుబారా చేస్తున్నాను కాని, కథ ఇంకా రక్తికీ – రంగానికీ రావడంలేదు. ఇహనుంచీ కొంచెం జరభ్గా నడవాలి.)

నా చేవ్రాలుతోఉన్న బ్రహ్మాండమైన చిత్రాన్ని లక్ష్మికి బహూకరించాను. (స్త్రీ – తారను కాను గనుక, దస్కత్ నాదికాదనిగాని, దస్తూరి స్వహస్తలిఖితం కాదని గాని, చదువరులు అనుమాన పడేందుకు అవకాశంలేదు)

–ఒకనాడు లక్ష్మి నన్ను వెదుక్కుంటూ వస్తుంది. (నన్నంటే నన్ను కాదు. నేను అద్దెకు ఉంటున్న వీధిలో నా తలుపుమీద ఉండే అంకెను) నేను అప్పుడే కారు ఎక్కి స్టూడియోకు పోతున్నాను. గేటులో ఉన్న ఘూర్కా యోధులు లక్ష్మిని అక్కడ నిలవేయడం గమనించాను. (ఇది ఏ పిక్చర్‌కూ కాపీ కాదుగద!)

మా యిద్దరికళ్ళూ కలుసుకున్నాయి. నేను లక్ష్మిని గుర్తించాను. ఆ అమ్మాయి నే నెవరో బూచాడిని అనుకుంది. (ఆ కంటిమాటను యీ కన్ను అర్థం జేసుకుంది) (తెరమీద నాయకులు నిత్యజీవితంలో అసహ్యంగా ఉండి తీరాలనే అజ్ఞానానికి నన్ను నేను మన్నించుకుంటున్నాను.)

యోధులు నా డ్రైవరుకు సలాముచేశారు. అది నేను అందుకున్నాను. లక్ష్మి చెయ్యి ఎత్తింది, కారు ఆగింది.

'బాబూ, ఫలానా వారి భవనం ఇదే కదూ?' అంది కోకిలై: నాకు కోపం వచ్చి జవాబు చెప్పలేదు.

"తాతగారూ, యిదేనా అండీ వారి యిల్లు" అంది. బిగ్గరగా, నాకు చెవుడు అనుకుంటూన్నట్లు.

కారు పోనీయమని, తల ఊపాను. ముందుకు ఒక ఊపు ఊగి, తారురోడ్డు ఎక్కి ఆగింది. [ఎందుకు ఆగింది? – కారణం ఏమిటో వ్రాయడానికి కొంత ఖాళీ వదలాలి] –

నేను తిరిగి యింటికి వచ్చేటప్పటికి గుమ్మంలో పడుకుని కునికిపాట్లు పడుతూన్న కుక్కపిల్ల, నిద్రమత్తులోనే తోక ఆడిస్తూంది. లోపల హాల్లో, దీపం నీడలో, సోఫాలో పడుకున్న ఉన్న లక్ష్మి, వెలుతురు హెచ్చుగానే ఒళ్ళు విరుచుకోబోయి, (ఒత్తిగిలుతూంది?–)

ఆ తరువాత ఏం జరిగిందంటే, మరే .... (ఏం జరుగుతుందో తెలియదు; ఇంతవరకూ అధ్యాయాలుగా చించి, బాగా పెంచి, మొదటి భాగంగా ప్రచురించుతాను. మా ఆవిడ కాపురానికి వచ్చినతరువాత నింపాదిగా, మిగతా పేజీలు వ్రాయవచ్చును: రైటో...గో బ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం etc.)

ఎర్రసిరా––

ఎదిగిన పిల్లదాని తండ్రికంట, ఈరాతలన్నీ పడితే.... మా కుంకకు, పిల్లను ఎవడిస్తాడండీ? వట్టి అరుపుల గొడ్డు అని, అనుకోడూ: వీడి ఈడు కప్పడే వీళ్ళనాన్న, కిక్కురు మనకుండా ఆ పరాత్పరుడికన్నా తెలియకుండా ఎంత గ్రంథం నడిపాడో!...కళ్ళ ఎదురుగుండా, ఆ పిల్లది అలా ఉసూరుమంటూ, వీడి పెళ్ళాం కాపురానికి వచ్చి ఓనమాలు దిద్దించే దాకా, సోఫాలో పడుకుని ఉండాలిసిందేనా? – మావాడు ఒక్కడేనా, లేక ఈ కాలం కుర్రకారంతా ఇదే మచ్చా?... పోనీ, ఆ రవంత తరువాయీ, నేను పూర్తిచేతునా?...

★ ★ ★

# టుప్‌టీక

మేడ మెట్లమీద --

ఎక్కి....పైకి వెళ్ళిపోయి...గదిలో తలుపులు బిగించుకు కూచుని....ఏరాతో చదువో మొదలు పెట్టి...లేకపోతే యింకా పై అంతస్తుకు వెళ్ళి ...ఎక్కడో బజారులో రేగే రొదకు చెవిదోరచేసి ఏమైనా ఆ మూలుగుమాత్రం వినలేక. ..ఏమైనా చేసేందుకు, తన చేతిలో ఏమీలేక...తల్లడిలిపోతున్నాడు: అక్కడ నిలవడానికి, తరం కావడంలేదు.

పళ్ళు బిగివిని నాలుగుమెట్లు ఎక్కాడు. అయిదో దాని మీద అడుగు వేయబోతూండగానే....ఇక కాళ్ళు చప్పగా చప్పబడ్డవి. క్రిందనుంచి, మళ్ళా, మూలుగు వినబడ్డది. ఇక అంతటితో నిలుచున్నవాడు అపాళనే అక్కడే కూలబడి పోయినాడు.

అంథా- గందరగోళంగా ఉంది. ఆ గదిదగ్గర అందరూ, కొందరు లోపలా, లోపల యిరక లేనివారు బయిటా చేరి, ఒక్కసారిగా మాట్లాడుతూ, రణగుణధ్వని చేస్తున్నారు. అంత మోతలోనుంచి ఉండి ఉండి మూలుగు వినబడుతూంది.

తాను అది, వినలేడు; పిల్లది ఉవ్వెత్తుగా మూలిగినపుడు లోపలికి జొరబడి పాదివి పట్టుకుని నీకేం భయం లేదమ్మా తల్లీ నేనున్నాను అని గడచి బయటుపడేదాకా అక్కడే కూర్చుంటే...

ఉహూ....గుమ్మందగ్గరకు వెళ్ళేటప్పటికి...అత్తగారు అడ్డంగా నుంచుని, కదలక, మెదలక, ధీమాగా "ఇక్కడ మగవాళ్ళ ప్రమేయం ఏమీలేదు...నీవు అవతలికి వెళ్ళు" అని ఉన్న సందుకు చేయి అడ్డం జాపింది; ఆ మాట లెక్క సేయకుండా అలాగే, లోపలికి, నిలుచున్న చోటునుంచి అంతమేరా సాగి...తొంగి చూశాడు. అమ్మాయి ముఖం మాత్రము, కనబడ్డది.. "నేనుచచ్చిపోతున్నాను, నాన్నో!" అని, గావుకేక వినబడ్డది...తనకు యిక ఆగక.. .బావురుమన్నాడు...అత్తగారు అందుకైనా చలించకుండా...కనికరం, జాలీ, ఏకోశానా లేకుండా... నిర్లక్ష్యంగా అవతలకు... దృఢంగా నెట్టివేసింది. మూతి నాకడానికి ఎగిరి...ముట్టెమీద దెబ్బతిని...కంయి, కంయి...మనకుండా తోకముడుచుకునే పరువుగా అక్కడనుంచి బయటికి వెళ్ళి పోయే...జాతికుక్క...దాని నోరూ వాయాలేదు. దానిలాగునే...ఉన్నా...తాను లోపల కుమిలిపోవలసిందే...

అక్కడ - అలా దిగులుగా - మోకాళ్ళమీదకు తలదించుకొని కూర్చుంటే, ఒక్కరూ వచ్చి ఓదార్చరేం? ఆ అల్లుడు వెధవాయ - అవతలగదిలో కూర్చుని - ఫోను విడవకుండా పాడిస్తూ - చక్రం తిరగవేసే వ్యవధిలో - కూని రాగం అఘోరిస్తూ - అక్కడలా భార్య తాను పెళ్ళి కూతురులాగా - చెంగ్ మంటూ తానక్కడ కూర్చుని ఉండగానే - నాలుగు మాట్లు - తనని రాచుకుంటూ - తప్పుకోమని అయినా అడగకుండా - పైకీ క్రిందకీ పరుగులెత్తుతూంది -

పలుకరించేందుకన్నా – ఏం, అలా కూర్చున్నారని ఒక్క ముక్క అనడానికైనా ఆమెకు ఆ సంబరంలో – అసలు తానక్కడ ఉన్నట్టు కనబడితేనా ––

అమ్మాయి – అక్కడపడుతున్న బాధ వినలేక పోతున్న కొద్దీ – తనలోకి – తానుగా – వెనుకకు వెళ్ళిపోయి – మనసులో ––

అప్పటి ముచ్చట – తానూ – తను చేసిన నిర్వాహకానికి – తలక్రిందులైపోతూంటే – చీమన్నా కుట్టనట్టుగా కుదురుగా కూర్చున్నాడు. మామగారు, ఎదురుగుండా నూతిగట్టు అరుగుమీద – తాపీగా చుట్టకాల్చుకుంటూ – పాదాలదగ్గిర రెడ్డిగం వేసుకుని కూర్చున్న పాలెకాపుతో – అంతకుమించి, ముహూర్తం కుదరనట్టు...అప్పుడు వ్యవహారం ఏడుస్తున్నాడు. ఇక, తన భార్య...తామూ చిన్నతనంలో – తెలిసినంతవరకూ యింతకన్న...యిప్పటివాళ్ళకన్న...ఎక్కువముద్దూ ముచ్చటతోటే ఉన్నారు.

కన్నులు బాగా తెరవక ముందే... గారాబాల కూచి గనుక..కాపురానికొచ్చింది భార్య. యిద్దరికీ బాగా పసితనమే...పైన కనిపెట్టి చూసే...పెద్దలు ఆకాశంలో ఉన్న వారి, వారి పెద్దలూ తరించేందుకు...పండుగలో అదొకటిగా పడకలుగా ఏకం చేశారు...కడుపు పండితే ఆ పండును చూచుకుంటూ....కన్నులున్నందుకు...

అందరి తపసూ ఫలించినది...అనుకున్నంతపనీ జరిగింది...ఇక...అమ్మాయికి నూడిదెలూ...అసలు...ఒక్కపిల్ల... అందుకని...అరచేతుల్లో పెట్టుకు పెంచారు...ఇక...అక్కడనుంచి నెత్తినే పెట్టుకుని...ఆఁ అంటె అమ్మాయి, ఓపలేనిది...ఎక్కడ అరగిపోతోందో అని...అతి గారాబంగా...సరి, అదంతా బాగానే ఉంది...

తానూ...అందలంలోంచి దిగలేదు:

ఆ గడియ వచ్చింది.

అక్కడ ....లోపల...మామగారితో, అత్తగారు... "అమ్మాయి...యిందాకనుంచీ... కొంచెం నలిగి ఉంది. ఆడేపొద్దులే...ఎందుకైనా మంచిది – కేకేసిరండి––" అనడం విన్నప్పటినుంచి...బిక్కమొగం వేసుకుని––అటూ యిటూ తిరుగుతూ...ఆవాళకూడా, మామూలుగా భార్య, గదిలోకి నిద్రవేళకు వస్తుంది కదా. అప్పుడు చేతనైన ఉపచారం చేయవచ్చునని –– ఆదుర్దాగా – అక్కడే తారట్లాడుతూ....అడుగులు లోపల చప్పుడుకాగానే...ఆమె... వస్తూందని ...ఆలకిస్తూ...ఆవలింతకు....చేయడ్డము పెట్టుకుని అపుకుంటూ––

అత్తగారు...ఏదోపనిమీద – ఆవేపునుంచి మరో గదిలోకిపోతూ...తన్ను చూచి –– "పోయి పడుకోనాయనా, ప్రొద్దుపోయింది...అమ్మాయికి...బద్ధకంగా ఉంది–– అది యిక్కడే పడుకుంటుంది––అనక లేద్దుగానివిలే...." అంది... అంతతో ఆరాటం హెచ్చై – ఆ అమ్మాయి పడుకున్న చోటికి ... ఒక్క అంగలో వెళ్ళాడు–– సన్నంగా మూలుగుతూంది; మీద, చేయివేసి – ఏమేమో అడగబోయినాడు; ఉలిక్కిపడి....కళ్ళు తెరిచిచూసి––పళ్ళు బిగించుకుని. ..నిట్టూర్పు విడిచి – ప్రక్కకు ఒత్తిగిలి – పడుకుంది –

అత్తగారు – అంతలోనేవచ్చి – వెనుకనుంచి పకాలుమనగానే – తగని బిడియవేసి, అక్కడి నుంచి...తలవంచుకుని – వచ్చేస్తున్నాడు – మంత్రసాని – లోపలికి వస్తూంది – మామగారు, – అంత పెద్దవాడు, మర్యాదస్తుడు – తనవంక కొంటెకోణంగిలాగా

చూసి – వినబడేటట్టు గొంతు సవరించుకుని – అదిగో ఇవాళలాగానే అక్కడే అదేమాదిరి – ఆ అరుగుమీదనే బాసిపట్టు వేసుకుని – చుట్టుకొస కొరుకుతున్నాడు–

ఏం చేయడానికి తోచడంలేదు – ఎంత అణచుకుందామన్నా, ఆగక, వెక్కి వెక్కి ఏడుపు పెగుల్చుకు వస్తూంది. ఎవరూ వినకుండా – ఎవరికీ కనబడకుండా, తోట వెంటా, దొడ్డివెంటా, అంతసేపూ, కాలుగాలిన పిల్లిలాగా తిరుగుతూ – తోచిన దేవతల కెల్లా మ్రొక్కుతూ – ఎంతసేపో – వేళ తెలియలేదు.

అమ్మాయి – భూమ్మీదపడ్డది – తెల్లవారుతూండగా ఆ మాట – తాను ఏమూలో ఉండగా – ఎవరో వెదుక్కుంటూ వచ్చి – చల్లగా – చెప్పారు:

మంచి నక్షత్రం – ఏవిధమైన శాంతి – దోషమూ లేదు – అందుకని – తెల్లవారినతరువాత ఆ గదిలోకి – తానొకసారి వెళ్ళి, పిల్లనూ, తల్లినీ చూడవచ్చునన్నారు.

కందగడ్డలాగా ఉంది – కనుముక్కు తీరు ఏం – కనుబడలేదు–పొత్తిళ్ళలో అణగిమణగి – అమ్మప్రక్కను – నీళ్ళు పోసుకుని అప్పుడే – పడుకుందట: మోకాళ్ళమీదికి బట్ట ఎగలాక్కుని జేనెడు పీటమీద గొంతుకూర్చుని అక్కడ కనిపెట్టుకునిఉన్న ముసలమ్మ "అచ్చంగా నీ పోలికేరా బాబూ! అ జుట్టూ – ఆ నొసలూ – ఆ గొంతూ – అన్నీ అచ్చంగా నీవే – – అమ్మాయి పోలిక ఒకటీ అబ్బలేదు – అడపిల్లకూ ...అదీ ఒక అదృష్టమే – " అవిడకు ఉత్సాహంతో బాటు గొంతుకు హెచ్చిపోతుంది – ఆ గొడవకు – తన భార్య – కన్ను తెరచింది––

కనబడేటట్టు, యింకా ముందుకు వెళ్ళినిలుచుకున్నాడు.

తెరచిన కన్ను – తననుచూసీచూడగానే – మూసుకుంది.

కాని, ఆ రెప్పపాటులోనే – అలా ఆ చూపులో –

అమిత భయం – తలచుకుంటే జలదరించిపోయే అసహ్యమూ – కళపెళలాడినవి.

తల్లికావడంలో – అంతకుముందు ఆ యాతన కలలో అయినా ఊహించని అమాయకురాలు – తల మునకలైన హడలు – తన భార్యలో – ఆ క్షణం నుంచీ – అలాగే, నిలిచి పోయింది.

బాలింతతనము తీరిన – మొదటిరోజుల్లో, మరీనీ తాను కంటబడితే – దయ్యం మీదకు వస్తూన్నంత భయంతో, దద్దరిల్లి పోయేది; కాలంగడచినా – ఎన్ని విధాల – అనునయించి, ఆ భయం తీర్చాలనీ – తన శాయశక్తులా ప్రయత్నం చేసినా – ఎన్నికలో – మన్నికలో మామూలుగానే ఉండేది; కాని, మనసుపట్టలేక – ఆమాట ఊసు ఎత్తేసరికి – అక్కడితో ఆమెకు వెర్రు లెత్తుకు వచ్చేవి.

ఎవరితో చెప్పేసంగతి కాదు: ఎవరూ తీర్చేది కాదు.

ఏమిచేసి, ఆమెను మళ్ళా దోవకు మళ్ళించాలో, తోచలేదు.

ఎన్నో పుస్తకాలు చదివాడు, ఎన్ని ఉపాయాలో ఆలోచించాడు.

ఎందరెందరినో – ఏదో కథగా – దీనికి విరుగుడు ఏం ఉంటుంది – అని – శాస్త్ర చర్చగా – కదలేసి చూశాడు. ఎవరికి తోచిన ఉపాయాలు వారు ఉపదేశించారు – కాని, వేనివల్లనూ వీసంఎత్తు పని జరగలేదు...

ఆ అమ్మాయిలో, అంతకుమించిన మార్పేమీ లేదు.

అనురాగానికీ, ఆదరణకూ, ఆమె తనకు – ఆమె ఆ విధంగా ఎన్నడూ – ఏలోటూ చేయదు.

కాని, అదొక్కటే, తీరనిలోటు.

ఆఖరికి – ఇక ఆ మాట తలపెట్టకుండా అమ్మాయి ముద్దుమురిపాలు చూసుకుంటూ, అలా కాలం వెళ్ళబుచ్చడమే – యీ జీవితంలో – ఆ తొలిరోజుల ముచ్చటయేగాని, మళ్ళా అంత అదృష్టంపట్టే యోగం కరవైందని – రూఢి పరచుకున్న తరువాత – అమ్మాయిని చూసుకుంటూ – యిద్దరూ, అదోమాదిరి – హాయితోనే బ్రతుకుతున్నారు – పిల్లదానితోబాటు, పెరిగి పెద్దవాళ్ళవుతున్నారు. అంతేగాని అంతకు మినహాగా, మారిపోయేందుకైనా – అనుభయం అంటూ ఏదీ?

తన – నడినెత్తిన – వెనుకటికన్న కొంచెం – జుట్టు ఎత్తు తగ్గి పలచబడుకుంటూ వస్తూంది: తనభార్య, అప్పటికన్న కొంచెం బొద్దుగా ఉంది – నిగనిగలాడే ఆమె మొగమూ, నున్నని బుగ్గలూ – చూసి – ఎన్నడన్నా – ఓనాడు – ఎన్ని ఏళ్ళకో ఓమారు – మనసులో – చిన్నతనం, జ్ఞాపకం ఆగక, బెల్లించబోయినా – బెట్టుచెడి – గుట్టుదాగకపోవడమే కాని సరి – ఏమనుకుంటేనేం – ఏనాటి పాపం – ఏమో – పుణ్యమో, ఎవరి ఎడబాటుకు ఏ జన్మంలోనైనా – తాను కారకుడు ఏమో – యీనాటికి – తనదోషం ఏమి లేకుండానే – తనకు, తనతో ఆమెకూ, సౌఖ్యపడేయోగం కరవవడం –

అయిపోయిన దానికి కాదు – ఆలోచన –

అమ్మాయి – అల్లారుముద్దుగా–వాళ్ళ అమ్మకు వాళ్ళ అమ్మా నాన్నా చేసినదానికన్న ఎక్కువ గారాబంతో – పెరిగి పెద్దదయింది –

తాను – యిల్లరికం – తనతోబాటు – తన అల్లుడూ యిల్లరికం – ఆ యింటనే–అలా ఎన్ని తరాలదాకా అయినా – ఉండేందుకు అన్ని విధాలా వసతి ఉన్నది.

అందుకు కాదు – అనువాయత తప్పకుండా వస్తూందేమో అని – తపించి పోతూన్నది–అందుకూ; అత్తవారికి తన భార్య తరువాత మళ్ళాసంతులేదు–అంతే దేవుడిచ్చాడో లేక–

అలా అనుకున్నప్పుడే – గుండె తల్లడిల్లుతూంది. ఆ యింట ఉన్న ఆడదానికి – కదలీవంధ్యా – దోషం – అమ్మాయికీ – తల్లిముత్తవల – చాలిక – తప్పదా ఏం – చిలకా గోరింకల్లాగా, వాళ్ళైనా – యిల్లు పదియిళ్ళయేటట్లుగా – కలసి కడుపు ఫలింపజేసుకోకుండా – తమలాగానే – తయారవుతారా –

ఆ మాటే – ఆ ఆలోచనే – భయంవేసే సుడిగాతలలో – తనలో తిరిగిపోతూ – మిగతా ఊహల నన్నింటినీ పీల్చుకుని ముంచేస్తూంది. అమ్మాయి – జీవితం – తమలాగా కాకూడదు – ఆ కోరికే – ఉపాంశువై – జపమౌతూంది–తన నిలువెల్లా అదే కోరిక.

అమ్మాయి–అక్కడ మరీ మూలుగుతూంది–కొండల పెట్టున వస్తున్నాయి–

నెప్పాలు–తన పేరెత్తి పిలచి – గగ్గోలవుతూంది – తండ్రీ – దగబోలూను! తాను ఉండి – ఏం ప్రయోజనం?

అక్కడ ఉండలేదు –

అప్పుడే తూరుపు తెలావెలా బోతూంది.

అంతసేపూ రాపాడిన మనసు – ఆకలిలో – ఆలోచన లన్నింటినీ మింగేసి – తనలో తాను హరించుకుపోయింది. ఎంతసేపు ఎక్కడ తిరిగాడో – ఏ మాత్రమూ తెలియదు. కాళ్ళకు – బుద్ధివచ్చి – వాటంతట అవే – మళ్ళా యింటికి మళ్ళించుకు వచ్చి – విడిచినవి –

ఎండ ఎక్కుతూంది–

లోపలికి వెళుతూంటే – శకునపక్షిలాగా మామగారు – రొంటిన చేతులుపెట్టుకు – రొమ్ము విరిచి నిలుచుని – చూడగానే –బిగ్గరగా సకిలించి...ఎకసెక్కెంగా... "తాతగారూ...దయచేయండి" అని పక్కకు తప్పుకున్నాడు... అత్తగారి ముఖం...కలకలలాడుతూంది...తనభార్య...

ఆమె వంకనైనా చూడకుండా అమాంతం...పురుడు వచ్చిన గదిలోకి...వెళ్ళి ఆ ముసలివా డవుతున్నా ననుకున్నవాడల్లా...పసివాడల్లే...చూసి పొంగిపోయినాడు... అమ్మాయి...పసిపాపను పక్కన బెట్టుకొని... దానితల మీదుగా తన చేయి తలగడగా చేసుకొని...జాపి...మునివేళ్ళతో...దగ్గరగా కూర్చుని –– మీదకు వాలినట్టుగా – ఏదో కబుర్లు చెబుతూన్న...మగని చెక్కిలి...చక్కిలిగిలి పెడుతూన్నది...ఇద్దరూ నవ్వుకుంటున్నారు...

అమ్మాయి, కొంచెం నీరసంగా ఉన్నది కాని, దానిని కమ్మేసే, కొత్త అందం, కొత్తకళ ఓడిపోతూంది – అక్కడ నుండి తప్పుకుందామనుకున్నాడు. తానలా చూస్తూ నిలుచుంటే, వాళ్ళు ఏమనుకుంటారో– పసివాళ్ళు – బిడియపడి–

అమ్మాయి – తనవంక చూసింది – చూపు తిప్పుకుని కనులతో, మగనికి సైగ చేసింది. అతడు తిరిగిచూసి, నవ్వి, తను ఉన్నానని అయినా సిగ్గులేకుండా, భార్యను ముద్దుపెట్టుకున్నాడు. అమ్మాయి, చెయి, అతని మెడమీదకు వేసింది.

అక్కడ నిలుచునేందుకు, ఎందుకో మొగం చెల్లక, యివతలకు వచ్చేశాడు––

అల్లుడూ, కూతురూ, మునుపటికన్న ఎక్కువగా పసిదానికి మూడునెలలు వెళ్ళినప్పటినుంచీ, చెట్టాపట్టాలు వేసుకుంటున్నారు. పసిదాన్ని వదలరు. ఓ నిమిషం ఏమారితే, ఎందరున్నారు, నెత్తిన ఎక్కించుకునేందుకు...! తన అత్తా, మామా, యిల్లాలూ, పసిపాపకు అంగరక్ష. తనజోలి ఎవరికీ అక్కరలేదు. తనవంక చూసేవారేలేరు ––

ఉదయం నిదురలేచి, లోపలినుంచి, తోటలోకి రాబోతుంటే, అంతచీకటిలోనూ అమ్మాయి, అవతలగా వసారా చివరను కూర్చుని, చెవులు మూసుకుని కక్కుకుంటుంది.

పరుగెత్తుకు వెళ్ళి, నీళ్ళు తీసుకువచ్చి, ఆమె పక్కను ఉంచి, కూర్చుని వెన్ను రాస్తున్నాడు. పుక్కిలించి ఉమ్మేసి లేచి నిలుచున్నది. తూలిపడుతుందేమోనని, పట్టుకోబోయినాడు: "అక్కరలేదు, నాన్నా" అన్నది: "ఏం తల్లి, ఎందుచేతనమ్మా," ఎంతో ఆదుర్దాగా అడుగుతూ తల నిమురుతూన్నాడు: అమ్మాయి, తనవంకచూసి

చిరునవ్వుతో, తలవంచుకున్నది. పోయి పడుకో అమ్మాయీ అని గది దాకా సాగనంపి, క్రిందకు దిగి చర చరా లోపలికి వెళ్ళాడు. వంట యింటి పక్క వసారాలో, అత్తగారు కాఫీ సామాను చుట్టూరా పరచుకుని ఆ ప్రయత్నంలో ఉంది – భార్య ఫలహారమేదో తయారు చేయడానికి, నాలుగూ చక్క బెడుతూంది: మామగారు, ఎదురుగుండా తులసికోట చప్టామీద కూర్చుని, కబుర్లు పేనుతున్నాడు.

అదంతాచూసి – మండుకొస్తూంది. అక్కడ అమ్మాయి అలా ఇదవుతూంటే, దిక్కూ మొక్కూ చూడకుండా -యిక్కడ వీళ్ళు ––

'ధుమధుమగా – అమ్మాయి, వెళ్ళబోసుకుంటూంది' అని తన భార్యకేసి ఉరిమాడు!

అప్పుడు, తాను గుమ్మంలో నిలుచున్నట్టు, అందరూ గమనించారు–

భార్య, తలఎత్తి తనవంక చూడనైనా లేదు. మాట వినిపించుకోలేదు.

అత్తగారు, తనలోతాను ఏమో గొణుక్కుంటూ నీళ్ళు ఉడికినాయో లేవో, అని మూతతీసి చూస్తూ, ఆ ధ్యాసలో ఉంది–

మామగారు గరుసెక్కిన గడ్డం–అరచేత్తో ఎగువకూ, దిగువకూ తడుముకుంటూ– ఎవరినీ ఉద్దేశించి కాకుండా ఎటువైపూ చూడకుండా–ఏదో మాట వరుసగా, "అలాగా పాపం–దానికి, అంతేకావాలి – ఏడాదికోసారి అంతే కావాలి" అని ఆడవాళ్ళవంక చూస్తూ, "ఎందుకూ మీరు ఉన్నారు–గళ్ళేలా పసరాగా–చూడండి, మీకన్న ఎన్ని వెనుకలు చిన్నది–మరి–చిచింద్రిలాగా, చూపిస్తే, అందుకు పోతూంది– అదీ వరుస–అలా ఉండాలి. అదీ, దాన్ని మించిన ఘనుడు నీ అల్లుడూ–ఎందుకు మళ్ళా మనం ఉన్నాం తగుదునమ్మా అంటూ–––"

ఈ వరుస అంతా – తనకేసి చూస్తూ, పనసలాగా ఏ కరువు పెడుతున్నాడు – తనకు, తలదీసివేసినంత పనవుతూంది.

అమ్మాయి, అక్కడకువచ్చి వెనుకనిలుచుని ఉంది – తాతగారు –

"ఉన్నదానవు, ఉన్నట్టుగా ఊరికే ఉండలేవుటే, నీ యిల్లు నిలువెత్తున బంగారంగాను – నీకు తెలియకపోతే మీ అమ్మమ్మనూ, అమ్మనూ చూసి నేర్చుకోరాదూ – పోనీలే చెపితే వినేనేర్పు ఉంటేనా, యీ కాలపు పిల్లలకు. మరీ రెచ్చిపోతున్నారు. సరేలే, ఏలాగూ తలపెట్టావు కనుక, ముందు, ఓ గంపెడు కూతుళ్ళను కను – తరువాత కొడుకుల నెత్తుదువుగాని – మా వారడీ, నీ వారడీ, అంతకూ నీవే తలచుకోవాలి. ఎత్తుకు నెత్తిన మోసేందుకు, ఎదిగిన పిల్లలం యింటో పనీపాటా లేకుండా, మేం ఉన్నాముగా..."

మనుమరాలిని, అన్నీ అనివెక్కిరించాడు–అమ్మాయి, బుంగమూతి చేసుకుని, అందరితో బాటు కలసి, అంతలో నవ్వేసింది––

ఆ కిల కిలే, ఆ పవలంతా – తన తలలో, గలగల లాడుతూంది, కవ్విస్తూంది. బయట చీకటిపడినా, మనసులో మసక బారలేదు. వెన్నెలవుతూంది.

ఆ రాత్రి, అరుబయట, తను పడుకుంటూండగా, అడుగులు తడబడుతూ, తబుకులో తాంబూలం వంచుకుని తనభార్య, అన్ని యేళ్ళయినతరువాత, తన దగ్గిరకు – తన కోసం – వచ్చింది. తలవంచుకుని, నిలవబడినది. తలవంచుకున్నాడు.

తలల్లో అంతవరకు అలవికాని కలలన్నీ – పలక బారినవి – కాని, కలలు కలకలలాడకుండా, నోయనినోములు వాటిలో ఒక్కటి అయినా మిగలకుండా చెల్లాచెదరు చేయబోతున్నవి. అందులో, ఒక్కటి దక్కినా – ఆ జన్మకు ఎంతో ఎక్కిదక్కి --

మనసుతోబాటు చేతులూ, తన ప్రయత్నం లేకుండా ముందుకు జాచుకుంటూన్నవి – అందుకో బోతూండగా --

అమ్మాయి, తామిద్దరనీ చూసి, నవ్వుతూన్నట్టు – ఆ నవ్వు జ్ఞాపకం వచ్చింది – చేతులు వాలిపోయినవి.

తలఎత్తి, ఒకరునొకరు చూసుకున్నారు – యిద్దరి చూపుల్లో – ఆశను దక్కించుకోలేని అమాయకత్వం, పండించిన ముదుసలి కళ తెలివై – మెరిసింది. యిద్దరి నిట్టూర్పులూ దేనికదై ఒకటై ఒకదానికొకటి చిక్కకుండా దేనితోవను అది గాలిలో దోవచేసుకున్నది–

తన భార్య, తల మరీ వంచుకుని – అమ్మమ్మకు అమరిక అయిన ఒదుగుతో – పెద్దతనంతో – తిరిగితిరిగి చూడకుండా యింట్లోకి వెళ్ళిపోయింది. తనకు, ఇదే – ఎప్పటికిమల్లే – తానే.

★ ★ ★

# చూర్ణిక

తీర్థయాత్రకు పోదామంటే ఏ తిరుపతో, కంచో, కాళాస్తో అనుకున్నాగాని, – ఇక్కడికొచ్చామేం – అంటావా?–

ఒరే – నాకు ఈ ఊరిమీదే గురి! – ఈ ఊరు, అనాదిగా, బాపన్నపల్లి – ఇప్పుడు లచ్చుమ్మపేట!–

మా మేనత్త – అంటే – మేనమామ భార్య – అ లచ్చుమ్మగారు, ఆవిడ పుట్టి పెరిగిన ఊరు: మా మేనమామ జోలెపట్టిన ఊరు.

మా ఊరినుంచి ఈ ఊరొచ్చి – ఇక్కడనుంచే నేను పట్నం పారిపోయొచ్చేసింది!

అంటే ఊరు తరిమికొట్టలేదు – మానాన్న ఇక్కడకూ తరుముకొచ్చి హడలకొట్టాడు, మనం ఉడాయించాము:

మా అమ్మ పుట్టిల్లా ఈ ఊరే, మాతామహులు వృత్తిలేక ఉపాదానం చేసుకునేవారు! ఒక్క కొడుకు, ఒక్క కూతురు: అ కూతుర్ని అంటే మా అమ్మను...తన ళాగానే సీతారామాభ్యాంనమః అనుకుంటూ జీవిస్తూన్న మా నాయనకు కాళ్ళుగడిగి ధారపోశాడు: మా నాన్న, –ఉన్నంతలో ప్రయోజకుడే – నోటిమంచితనాన, – అందరినీ అయ్యాబాబు అంటూ, – అలాగే అలక్ష్యం కొద్దీ, నలుగురూ తోల తృణమూ ఇవ్వగా,–అ పరకలు పోగుచేసి, – యజ్ఞం చేశాడు – పెద్ద పెట్టునే–కాని, బ్రతక నేర్చినవాడు కాకపోవడంతో కాస్తోకూస్తో వెనకేసుకోలేదు; అ మర్నాటి నుంచి, తానూ తన రాగిచెంబూ...యథాప్రకారమే:

మానాన్న చూశావ్...బయట పరమ సాధువేకాని–ఇంట ఫాలాక్షుడు: ఎవరిమీదా కోపం కాదు, – ఎందుకో ఒకందుకని కాదు...ఎప్పుడూ ఒకటే ధుమధుమ: అలా అని పెళ్ళాన్ని వేపుకుతినేవాడా... అక్కడ పిల్లి! – నామీదమాత్రం ఒంటి కాలుమీద లేచేవాడు.

ఉపనయనం చేశాడు: తనతో బాటు, – ఓ రాగి చెంబిచ్చాడు...నేను ఊహూ అన్నాను: ఒక దరువేశాడు: నేను దులిపేసుకున్నాను: మరోవిడత ఉదికాడు: పారిపోయి, – రాజావారితోటలో జామచెట్టెక్కాను: దిగిరా, తాట వలుస్తానన్నాడు మానాన్న...మూడురోజులు అట్లానే ఉన్నాను...కటుక్కాయలు కొరుకుతూ...మా అమ్మ మజ్జిగా అన్నం కలుపుకొచ్చి... అఘోరించావు కాని, దిగిరా అంది. ఎదిరించేందుకన్నా సత్తువుండాలి. తిని ఏడు!...అన్నాడు నాన్న: ఊహూ అన్నాను: సరే నీకర్మం నీది...ఎన్నాళ్ళెండుతావో ఎండు...అని, – పదండి ...అని నాన్నను మళ్ళించుకుపోయింది...నేను కిందికి దూకి, – మరో మాను మండ విరిచి, – బిళ్ళాకర్రా చేసి, – కూత పట్టుకుంటూ మా అత్తయ్యగారి ఇంటికి చేరుకున్నాను...అ యిల్లు చూపిసాగా...

ఈ ఊళ్ళో కమామీషు ఏమిటంటే...హనుమయ్య గారని, మా అత్తయ్య నాన్న...మోతుబరి...వేదం చెప్పకుని వ్యవసాయంలోకి దికి...దస్తు కూడబెట్టి...పాలు కొచ్చిన పక్క చేలు కలుపుకుని...ముప్పైపుట్ల ఖామందు అయినాడు: అదోతరహా మనిషి...పేదసాద నోకంట కనిపెట్టేవాడు: కలిగినవాడు, పిసరంత పొరబాటు చేసెనా కత్తి కట్టేవాడు: వస్తుతః పిల్లికి బిచ్చం వేసే తరహా కాదు. పేద వాడింట పెళ్ళంటే అక్కడ ప్రత్యక్షమయేవాడు: నేనున్నానురా అనిపించేవాడు: అడగనివాడిని పిలిచి చేబదు లిచ్చేవాడు: వాడు యివ్వలేకపోతే, – తిట్టి, మళ్ళీ పెట్టుబడి పెట్టే వాడు: వాడు అదీ ఇదీ ఎగేసి – ఊరు విడిచి, పారిపోతే, – వెంట తరుముకుపోయి, ఎక్కడున్నా వెదికి పట్టుకుని, సిగపాయదీసి తన్ని, మొగంవాచే చివాట్లు పెట్టి, వాడి కష్టసుఖం ఆరాతీసి, – వాటిలోటు తీర్చి వచ్చేవాడు: అదో తరహా...

ఓనాడు...తనంత మోతుబరే...ఒకాయన...కొడుకు బడికిపోవడం ఠలాయిస్తే...బళ్ళోకి లాక్కెళ్ళి కుర్రాళ్ళముందు పడేసి బాదాడు: ఇది తెలియడంతోనే హనుమయ్య తాత,–పోయి వాళ్ళ అరుగుమీద తిష్టవేసి, –– తనంత ఆసామినీ...తనకన్న ఏడో ఆరో, పెద్దవాణ్ణి, గుమ్మం ఎక్కకుండా నిలవేసి, దుప్పటీ దులిపినట్లు పట్టుకు దులిపేశాడు. మొగం వాచిపోయేట్టు కొట్టాడు:

"తండ్రి పేరెట్టుకుంది, తన్నేందుకట్రా అప్రాచ్యుడా...

మీనాన్న కడుపున పుట్టింది...యిందుకట్రా...

నీవు బ్రాహ్మడివా లుచ్ఛావాడివా?–

ఒరేయి...యీయేడు––మీనాన్న ఆబ్దికానికి...బ్రాహ్మణ్యం రాదు: నీకిదే శిక్ష...పోయి కాశీలో పెట్టరా...

బళ్ళో పిల్లలకు పప్పూ బెల్లాలు పంపించు: యీ పూటే కాశిపో–తిరిగి వచ్చి...మీ నాన్న పేరు చెప్పి గుళ్ళో అభిషేకం చేయించి అప్పుడు యింట కాలెట్టు...బళ్ళోవాళ్ళకీ మాబోటి బయటవాళ్ళకీ యింత పప్పూ వణ్ణం బెట్టు"...అని ఆసామీని, –– అక్కడే ఆపి– లోపలికిపోయి... 'అమ్మాయ్...మనవాడు కుర్రవేషాలు పోయేప్పటికి...కాస్త కూకలేశాలే – అవన్నీ ఘట్టిదెబ్బ లనుకునేవ్ – అదిగో చూడు నక్కముద్దల్లెనే ఉన్నాడు... కాశీపోయి వచ్చేస్తాడు కాని,–కిత్తనార సంచిలో, కావలసినవి వేసియియ్యి...బత్తెఖర్చులు మనింటిదగ్గరనుంచి... భోంచేసి పట్టుకెల్తాడులే...యాత్రకు వీడి సంపాదనలో వద్దు...ఫలం ఉండదు...' అన్నాడు:

అలాగే అన్నయ్యా! అని, – అమర్చి యిచ్చింది ఆ యిల్లాలు:

ఆసామి కిక్కురుమనకుండా...చెప్పినట్లు చేశాడు...

హనుమయ్యగారి మాటంటే అందరికీ శివాజ్ఞ. అది ఓ తరహా!

ఆ కూతురికీ తండ్రి పోలిక వచ్చింది...

ఒక్కతే కూతురు...ఎనిమిదో యేడు...పెళ్ళి కెదిగినట్లు లెక్క. వాళ్ళ లెక్క ప్రకారం...అందరూ ఆ సంబంధం అన్నారు. యీ సంబంధం అన్నారు: కానీ కట్నం అక్కర లేదన్నారు...ఎవరొచ్చినా. ఆస్తిలో పిల్లకో రేజా యివ్వను...ఎవరు చేసుకున్నా మా బాగే అన్నాడు హనుమయ్యగారు: అంతటితో, ఒక్కడూ ముందుకు రాందే...

మా మామయ్య...వారి యింటికి నిత్యమూ మధూకరానికి వెళ్ళేవాడు: లచ్చమ్మే వేసేది...

ఓనాడు అలాగే వెళ్ళగా - ఆ వేళకు హనుమయ్యగారు యింట్లో ఉండి...ఒరే రాముడూ---ఆ జోలె అక్కడ పెట్టి - పంచపాత్రలో నీళ్ళు పారపోసి, కాళ్ళూ, చేతులు కడుక్కుని ఆచమనంచేసి రా: అంగోస్త్రం అక్కడ పారేసి నా ధోవతి కట్టుకుని,-పోయి, మీ నాన్నను పిలుచుకురా అన్నాడు...

అలాగే పిలుచుకుని వచ్చాడు...చేతులు కట్టుకొచ్చాడు మాతాత!-

కూచోమన్నాడు!-కూచున్నాడు.

చూడు గంగన్నా...ప్రతినిత్యమూ వీడు జోలె కట్టుకు రావడం...తన మల్లేమో యిక్కడ దాచిపెట్టినట్టు...

వీడు వచ్చేవేళకు యీవిడ వణుక్కుంటూ పళ్ళెంతో పప్పూ, అన్నం పెట్టుకు సిద్ధంగా ఉండటం...ఏమిటో నాకు బాగుండలా?- చూడగా చూడగా...వీడికి వేళకింత తిండిపెట్టేందుకు పుట్టినట్టుందిది! - సరే అనేకుంటే పోలా? - ముహూర్తం పెట్టిస్తాగాని, తర్లిరా! - అన్నాడు. మాతాత తబ్బిబ్బై...చేతులు పట్టుకుని...మీ అంతరమేమిటి- మా అంతరమేమిటి బావా!- చిన్నదానికి అన్యాయం చేస్తున్నావు: ఏ మహారాజులింటో పడవలసిన పిల్ల... నిదానంగా ఆలోచించుకో...ఏనుగు నెక్కిస్తానన్నావు, కాని మాకా తాహతు? - అని ప్రాధేయపడ్డాడు...

గంగన్నా...ఉపాదానానికి వస్తాన్...వట్టి బియ్యమే నీకుదక్కుడు-వీడు జోలెకట్టాడు - అన్న ప్రాప్తి అయింది.

ఆ జోలెలో - మాలచ్చమ్మ పప్పూ అన్నం వేసింది.

అదేమిదేమని... నేను మా లచ్చమ్మనే వేశాననుకో-కాదంటవా? - అంటేమటుకు నే నూరుకునేది గనుకనా. ...మళ్ళీ నోరెత్తకు...అన్నాడు: అలా మా అత్తయ్య పెళ్ళి జరిగింది...మామయ్య యిల్లరికం...వేళపట్టు కింత వర్రగా తినడం...వీధి అరుగుమీద కూర్చోడం...యిలా ఏడేళ్ళు ఎండ కన్నెరగకుండా పెరగటంతో -- మాంచి నునుపు తేలాడు...ఓ యింటివాడైనాడు...

వాళ్ళకు యిల్లప్పగించి నిశ్చింతగా, ఆ పెద్దవాళ్ళిద్దరూ కాశీకిపోయి అక్కడే ఉండిపోయినారు. దక్షతఅంతా లచ్చమ్మది. ఏడాదైంది. రెండేళ్ళయింది: మామగారు యీ గడప తొక్కలేదు...రామన్న అటూ పోలేదు... చూసి చూసి ఏమిటదని నిలవేసింది లచ్చమ్మ...పోయి మీ అమ్మా నాన్నను పిలుచుకురా... ఇంకా ఆ ఉపాదానా లెందుకు?-- అన్నది.

"నే తింటున్నా చాలదూ: వాళ్ళ కెందుకులే నీ చేతి బిచ్చం" అన్నాడు రామన్న...

"ఆహాఁ! అలాగుటా?- బిచ్చానికొచ్చినా పెళ్ళి కొడుకువే అనుకోవడం తప్పెందేం!-- నే నెవత్తెను ఒకరికి బిచ్చమెయ్యడానికి...మా నాన్నే నన్ను నీకు బిచ్చమేశాడు..."

నీవు బిచ్చాని వెందుకవుతావ్... యింత, కూడోసి కొనిచ్చాడు మీ నాన్న, పొట్ట గడవక అమ్ముకడోయినా ననుకోరాదూ!

నీ జోలిబుద్దులు పోనిచ్చావ్ కావు. ఇంతకూ ఏమిటి- వాళతావా-- వెళ్ళవా?--

చిత్తం చిత్తమని నీ అడుగులకు మడుగు లొత్తుతూ - చెప్పినట్టు చెయ్యకపోతే - నాకు అన్నం పుడుతుందా?-

ఓయబ్బో రోషం...అలిచేత అన్నం తినడమే -- నీ కంత పట్టింపుగా ఉందేం?--పోనీ నీవింతవండి నాకింత పెట్టు...

ఎవడి సొత్తని...

యింతకాలం ఎవరి సొత్తనితిన్నావేం? - అత్తా మామా యింట లేకుండా చూసి - అల్లుడి బెట్టు మొదలెట్టావేం. ఎవరన్నా వింటే నవ్విపోతారుగాని...

నవ్విపోతూనే ఉన్నారు: ప్రతి వెధవా, అడుగో లచ్చమ్మ మొగుడనడం...నేను వినడంలేదా!- మొండి ఘటాన్ని కనుక. ...తిండికిమాలి పడుంటున్నాను.

పడిఉండక...ఏం ఘనకార్యం చేస్తావో?-- తెంచుకుపోతాను:

అలాగేం: నిన్నెవ్వ రాపుతున్నారు:

అయితే యిప్పుడే పోతున్నాను!-

మంచిది: బత్తెఖర్చు పట్టుకు పోయిరా--

అహఁ. ఇందులో మళ్లీ యీ బిచ్చమెందుకు నా జోలె నా కుండనే ఉంది:

నీకు వచ్చిన విద్య - అదొక్కటే కదా!-

ఊ ఆలస్యమెందుకూ...నేను నిన్ను అననుగాని-- యీ ఒక్కమాటా వినిపో...

సముద్రంలో నుంచి ముత్తెం పుడుతుంది...

దాని కక్కడ విలువలేదు...

వింధ్యపర్వతంమీద మంచి గంధం పుడుతుంది...

దాని కక్కడ వినియోగం లేదు...

కావేరిలో పగడం పుడుతుంది...

దాన్ని ఆ నది ఏం జేసుకోను...

నేను ముత్తెమల్లేపుట్టాను...పగడమల్లె పెరిగాను... నీ చెంపకురాచిన మంచి గంధాన్నయినాను... అది, నీకు లెక్కలేకపోయె...

తమబిడ్డ--ఇలా ఇక్కడ వేసీ వేయకుండా ఉన్నా -- అక్కడ కన్నవారు అలా ఉండగా, అదేమా అని నీ కనిపించకపోయె - యిప్పుడు కొత్తగా అహంకారమంటో పుట్టుకొచ్చె -

లచ్చమ్మ మొగుడనిపించుకోవడం నీకు పరువుతక్కువైతే...కన్నవారి పేదరికం నీకు పరువైతే --- నేను నీకు భారమైతే -- సరే...నిన్నాపేదెవ్వరూ -- నేనూ హనుమయ్య కూతుర్ని...ఎవరిచేతా మాటపడలేదు...పడను...క్షేమంగా పోయి రా...

పోతే, మళ్లీ రావడమే...

అలాగేం...సరే...

--అమాయకపు అహంకారానికి అదీ ఫలితం---

రామన్న తనదారిని తాను పోయినాడు... లచ్చమ్మ అత్తవారింటికి వెళ్ళి...మీ కుమారుడు విద్యలకోసం కాశీ వెళ్ళారు...పండితుడై తిరిగివచ్చి మీ పాదాభివందనం

చేస్తానన్నారు...మిమ్మల్ని కనిపెట్టిచూస్తూ నన్నుండి పొమ్మన్నారు: సాలు సాలుకూ ఈ ఇంటికి మూడుపుట్ల ధాన్యం ముద్దినుసులూ, చేతిలో అక్కరకు ఓ మునూ్నరు పంపవలసిందిగా – మా నాయన అల్లుడితో చెప్పిపోయినారు: మీరు అభిమానవంతులు కనుక మీఅబ్బాయి సంకోచించారు: వారు చెప్పలేక నన్ను చెప్పమన్నారు. మీరు కాదనకూడదు: అని, బిడియపడుతూనే అన్నది:

మా తాత అన్నాడు కదా...అమ్మా మీ నాయన గారికి నా మీద అంతదయ ఉంది...అది నాకు తెలుసు: నాకు! కించిత్ అభిమానమూ ఉంది: అదీ వారికి తెలుసు.

అందుకనే వారు నాతో ఆ ప్రస్తావన చేయకుండా నన్ను గౌరవంగా చూశారు:

బిడ్డలు పెట్టగా కూచుని తినవలసినంత అశక్తిస్థితికి మేమురాలేదు...ఏదో మాకాలం ఇలాగే వెళ్ళిపోతుంది... అంతగా ఒకరి అసరా అంటూ కావలసివస్తే...నీవు ఉండనే ఉన్నావుకదా... యింతవరకూ ఏ ఇబ్బందిలేదు...యిహ ముందూ ఉండదు...

నాకు ఒక్కటే అమ్మా చింత...యీయనకీ చదువులేమిటి...అవి ఎప్పటికా్కను...

లక్షణంగా పిల్లా పాప కలుగవలసిన కాలంగదా...ఎందుకు ఇలా చేశాడమ్మా...నీవెంత అమాయకురాలివి కాకపోతే...అలా పంపిస్తావా?...వద్దనలేకపోయినావా?...

వారికి ఎదురు చెప్పడం...యీజన్మకు చేతకాదు మామయ్యా!

పోనీలే అమ్మా...ఒక్కత్తెవూ అక్కడెందుకూ...

సంజెదీపం పెట్టేందుకు...వారు తిరిగిరాగానే ఇద్దరం వచ్చి ఇక్కడ ఉండిపోతాం అని ఉంది:

మాకు అంత ప్రాప్తం ఉండాలికద...

అదేమిటిమామయ్యా...చదువుమీద మొగంమొత్తి రేపీపాటికి తిరిగి రారూ... వారికీ... ఇంతప్పటినుంచీ ఒకర్నొకరు విడిచిఉండటం అలవాటు లేదుకదా...

లచ్చమ్మ ఇంటికి తిరిగివచ్చింది... తనకు చిన్నప్పుడు దాదిగాఉండే ఓ అవ్వను రప్పించుకుని – తోడుంచుకుంది–– ఊరికే చేదోడుగా...నిజానికి ఆవిడకు తోడెందుకు!

ఒకసారి...అంటే రామన్న కాశీవెళ్ళిన కొత్తలో...ఆడకూతురు ఒంటరిగా ఉంటూందికదా అని,–మనకు బారాభాటం అనుకుని...యిద్దరు దొంగలొచ్చారు...దొడ్డి తలుపు ఉతకెత్తి లోపలికొచ్చి... వంటయింటిక్రింద కన్నం తవ్వుతున్నారు: లచ్చమ్మ కునుకుమీద ఉన్నా, ఎలాగో సడికట్టింది...పిల్లిలా లేచి వెళ్ళింది...నిశిరాత్రి... వెన్నెల రోజులు. కాబట్టి కాస్త మసకగానున్నా...మనిషి లీలగా కనబడుతున్నాడు: ఆ ఇద్దరూ అదరా–బాదరా – కొత్తపెట్టి కొట్టంటుకున్నట్లు, బెత్తికలు తీస్తున్నారు. లచ్చమ్మ ఒక్క ఉరుకురికి – అందుబాటులో ఉన్న వాడిని నడుంవిరిగేట్టు తన్నింది: రెండోవాడు ఉలికిపడేంతలో – వాడి డొక్కలో మోచేత్తో ఒక్క పోటుపొడిచి, వాడు తూలేంతలో పిడికిలితో – గడ్డం పగలేసింది:

పడినవాళ్ళు తెప్పరిల్లేలోగానే పక్కను మేటి వేసిన కందికంప – తలోసందెడు వాళ్ళమీదపోసి – చేంతాడుతో మోపుకట్టినట్లు కట్టింది...సరాసరి పెద్దకాపు యింటికి వెళ్ళింది. "సన్నయ్యమామా ఏదీగానివేళ ఇద్దరుచుట్టాలెవరో వచ్చారు: నాకు గుర్తుపట్టడం లేదు...నీవొచ్చి – ఒక్కసారి పలకరించిపో–––" అనగా – సన్నయ్య

వెంటనే అర్థంచేసుకుని, వచ్చాడు: ఇంటిల్లిపాదీ లేచారేమో ...ఒక్క విషయంలో, ఆ కబురు ఊరు అల్లుకుపోయి, వాడకట్టంతా వచ్చిపడ్డది...

వాళ్ళ కట్లూడదీసి - ఫలానా పాలెంవాళ్ళని గుర్తుచేసుకుని సన్నయ్య కర్ర తిరగేయపోయినాడు: లచ్చమ్మ కూడదదంది: పాలెం మనిషిని పంపి, వాళ్ళ ఆలుబిడ్డల్ని రప్పించింది: వాళ్ళచేత, వాళ్ళఎదుట తడిబట్టలతో ప్రమాణం చేయించింది: తలోరెండకరాలు వ్రాయించి యిచ్చి,- పెళ్ళాం బిడ్డలమొగం చూస్తూ పరువుగా బ్రతకమంది... తనబిడ్డలకు సారెట్టి పంపినట్లు వాళ్ళని సాగనంపింది: మళ్ళీ ఈ ఊరికి దొంగలంటూ రాలేదు: అలాటిమనిషి మా అత్తయ్య!

అది జరిగిన పదేళ్ళకు నేను పుట్టాను:

లచ్చమ్మ వేయికళ్ళతో కనిపెట్టిచూస్తూ అత్త మామల ముప్పొదా ఓసింది: అప్పటికి రామన్న కాశీవెళ్ళి పుష్కరం దాటింది:

అప్పట్లోనే - నేనూ అక్కడికి పారిపోయిరావడం:

నిజం చెప్పేశాను: అదేమనలేదు - కూక వేయలేదు. మీగడవేసి ముప్పొద్దులూ మేపేది...

నాకు జామచెట్టంటే ప్రాణమని చెప్పానుగా...యిక్కడ, - నాగేశ్వరస్వామి ఆలయంలో...అదిగో ఆ కనబడుతున్నదే...అక్కడ ఓ మాంచి జామచెట్టుంది: నేను ఊరుపట్టి తిరుగుతున్నాను...అక్కడికి చేరుకున్నాను:

ఆ జామచెట్టుమీద, ఓ అమ్మాయి కనిపించింది... మూగది-కాకిలాగా ఉంది: నన్నుచూసి మూగసైగలు చేసింది; నేనూ కొమ్మకెక్కాను...ఓ కాయ నామీదికి విసిరింది - పంటకరుచుకున్నాను: యిహ గొంతెత్తింది...మూగది, కురూపి, -మతిలేనిది-...పాడిందిచూసుకో...నేను నేర్చుకున్న రవంత సంగీతం ఆ జామచెట్టుమీదే...

పొద్దుననగా చద్దన్నం తినివచ్చాను...తిరిగి చూసేప్పటికి ప్రొద్దు గ్రుంకింది...క్రిందికి దూకాను...మళ్ళీ వస్తానని సైగచేసి, - యింటికి పరుగెత్తాను: అత్తయ్యతో ఈ సంగతి చెప్పాను. నవ్వి ఊరుకుంది:

ప్రొద్దుననగా పోయి రాకపోతే - నాచేతి బువ్వ నీకు వెగటైందేమో అనుకున్నాన్రా భడవాకానా - అది, - మహా యోగినిరా - పుట్టి బుద్ధెరిగింది...మాట రాలేదు...పాటొచ్చింది. ఆ జామచెట్టుమీదే ఉంటుంది: ఎన్నడో ఓనాడు దిగిందో.-ఏ కొబ్బరి చెట్టుకో ఎగబ్రాకి - బోండాం అక్కడే పగలేసి ఆ నీరు త్రాగి వస్తుంది. అందరూ దానికి చేయెత్తి మొక్కుతారురా అంది: నాకు చెప్పరాని సంతోషం వేసింది...ఎన్నో రోజులు అలా జామచెట్టుమీద గడిచినాయి,- ఆ గొంతుతో కలిపి పాడటం నాకు అలవాటైంది.

అలా గడవగా, - ఒకనాడు ఆ పిల్ల గొంతెత్తలా- నన్ను పాడమని సైగచేసింది...ఎలా పాడానో ఎంతసేపు పాడానో నాకే తెలియదు...చివరకు ఓ పళానికి ఒళ్ళు తెలిసి చూదునుగా,-కోతిపిల్లలాగా కొమ్మలూపుతూ ఒకటే మూగగోల చేసింది-నేనున్న కొమ్మమీంచి నన్ను దులిపేసింది...మళ్ళీ చెట్టుకు ప్రాకబోతే కొమ్మలు విరిచి విసిరేసింది - పొమ్మని సైగచేసింది...నేను దిక్కు మొగం వేసుకుని, - యింటికి తిరిగి వచ్చాను. మానాన్న ప్రత్యక్షం: అత్తయ్య అంటే ఆయనకు అమిత గౌరవం,

కొంత జంకూ, ఆవిడ ఎదుట ధాముధూములు చేయకుండా, మెల్లిగా లాలించి బుజ్జగించి, యింటికి లాక్కెళ్ళి అక్కడ తాటవళ్ళే సన్నాహంమీద వచ్చాడు – ఆయనలా ఆపేక్షగా లాలనగా మాట్లాడటంతో నాకు మరింత భయమేసి, నేను రానన్నాను...తెల్లారనీ ముక్కు మన్ను కాకుండా ఈడ్చుకెళ్ళకపోతే...అని ఆయన అని నాలుక కరచుకుని అత్తయ్యతో సర్ది చెప్పబోయాడు: ఆవిడ నవ్వి ఊరుకుంది:

నేను రాత్రంతా నిదురపోలేదు... తెల్లవారు ఝామున, ఆయన మేల్కొనేవేళకు కాలికి బుద్ధిచెప్పాను: చేరుకున్నా...పట్నం...మనకథ కేంగాని,—

అక్కడ మా అత్తయ్య షష్ఠిపూర్తి...యింకా నాలుగయిదేళ్ళుందనగానే ఎందుకో ముహూర్తం పెట్టించింది. అధికమాసాలతో సరిపెట్టుకోవచ్చునులే అని, పెద్దలకు చెప్పింది...చుట్టుప్రక్కల పదిగ్రామాలవారు వచ్చారు: తంతు ప్రారంభం అయింది: సలక్షణంగా జరిగింది...అత్తయ్య ఎవరూ చూడకుండా ఒక్కసారి కళ్ళుతుడుచుకుంది...

ఆ వెనువెంటనే లక్షవత్తులవ్రతం...ప్రతిదీ తనకు అర్థం చెప్పి...చేయించమంది... ప్రాయశ్చిత్తాలన్నీ... పురోహితుడు మొదట సరేనని – ఒక ఘట్టానికి వచ్చేసరికి కప్పదాటు వేయబోయి తటపటాయించగా – అత్తయ్యఅమాంతం గొంతుపట్టుకుంది – ఆయనచేత చెప్పించింది...నిప్పులు గ్రక్కుతూ – ఆ వత్తులూ – ఆజ్యం – హోమగుండంలో పడేసి – ఏం బాబూ – నాకు ముందే ఎందుకు చెప్పలేదు...మీ తోడబుట్టినదాన్ని కానా – సయాం కాకపోయినా...నాచేత – కలలోనైనా చేయనిపనులు చేసినట్లు నలుగురిలో ప్రాయశ్చిత్తం చేయిస్తారా... అని నోరుచేసుకుంది... ఆ మానవుడు కిక్కురుమనలేదు కాని, అమ్మా, లచ్చమ్మా – యిది పుణ్యకార్యం – యిలా అవాంతరం వస్తే ఊరికి చెరుపు. పీటలమీద పెళ్ళి కూలదోసినంత పాదిత్యం...ఎలాగైనా కళ్ళు మూసుకుకానిచ్చేద్దాం— అని బ్రతిమాలుకున్నాడు: తతిమ్మా బ్రాహ్మణ్యమూ అదేమాట అంది: లచ్చమ్మ నవ్విపోయి... మీనెత్తి కూలా–మీదక్షిణ మీకు ఎలాగైనా ముట్టుతుంది—ఊరికి చెరుపు అంటే నేను కాదంటానా – కాని చేసే పని కళ్ళుతెరుచుకునే చేద్దాం– అని యావన్మందినీ, ఆలయానికి దయచేయమంది...

జామచెట్టు క్రింద నుంచునిచేతులుజాపింది: మూగపిల్ల ఆ చేతుల్లోకి వ్రాలింది... పార్వతి అని పేరెట్టి పెళ్ళికూతుర్ని చేసింది...నాగేశ్వరస్వామివారికి – కన్యాదానం, తానుచేసింది... కూతురుకీ, అల్లుడికీ ఆస్తి కట్టబెట్టింది... ఊరిలో ఎవరికీ లేమి ఉండరాదంది—తల్లిదండ్రుల ఆస్తి ఆదాయం–బిడ్డలందరికీ అవసరానికి అక్కరకు వచ్చేట్టు చూడమని చెప్పింది– అందరికీ తన చేతుల్తో దక్షిణలిచ్చింది–అందులో ఒక్కరికి తప్ప పాదాభివందనం చేసింది...

ఎవరిళ్ళకు వారుపోయినారు–మూగపిల్ల మళ్ళీ చెట్టెక్కింది – లచ్చమ్మ – గంధంపూసుకుని – మధుపర్కం కట్టుకుని, మరో చీరా రైకా చేతపట్టుకుని – రాత్రి రెండోఝాము వేళ గుళ్ళోకి వెళ్ళింది: ఆ ఒక్కడూ అక్కడ నిదురలో ఉన్నాడు: పాదములు తాకింది: నిదుర తెలిసి కూర్చున్నాడు... పుట్టని బిడ్డకు పెళ్ళిచేశాం– దేవుడల్లుడైనాడు – ఇంకా నే నిక్కడెందుకూ నన్ను తీసుకువెళ్ళేందుకు ఎన్నటికైనా మీరు వస్తారని తెలుసు...నిన్న జరిగింది, నా వయస్సుకు కాదు, నా ఐదవతనానికి షష్ఠిపూర్తి...అది మీకే తెలుసు: అందుకే వచ్చారుకాదూ–

అవును షష్ఠిపూర్తిఅయితే మరోజన్మ ఎత్తినట్లు కాదూ–

మిమ్మల్ని చూడకముందే: మీరు వచ్చారనిపించింది...ఎక్కడ కూర్చున్నారో తెలిసింది...ఆలయంలో మీచేత దక్షిణ ఉంచుతూన్నప్పుడే ...మరో పుటక పుట్టాను...

పిల్లలు యిహ యిల్లు దిద్దుకుంటారు – మా అమ్మా నాన్నాలాగే మనం... తెల్లారేప్పటికి యిద్దరూ లేరు.

అదీ మా అత్తయ్య సంగతి...యిప్పటికీ లక్షణంగా కాశీలో ఉన్నారు – నేను నాలుగయిదు పర్యాయాలు చూసి వచ్చాను...ఎన్నడో ఓనాడు అక్కడికే జేరుకుంటాను...

మా గురువుగారి దర్శనం చేద్దామంటావా?–

వారు ఆజామచెట్టుమీద యిప్పుడు లేరు–కొంత కాలానికే – వారూ ఎటో మాయమైనారు–

యిది దివ్యక్షేత్రం కాదా?–వచ్చాం స్మరించాము: ఆలయంకేసి మ్రొక్కాము–ఊళ్ళో మనకేంపని, – పోదాం పద!–

★ ★ ★

# మునిగోరింట

ఊళ్ళో, అన్ని మిద్దెలుండగా మేడలుండగా,- ఉదయించే సూర్యభగవాన్లు శకునపక్షికిమల్లే, సీతాయి ఈతాకుల గుడిసెలోనే తొంగిచూస్తాడు-

తిన్నా పస్తున్నా - ఊరు మాటుమణిగే వేళకన్నా, అమ్మకన్న పుణ్యాన, ఓ కునుకుపట్టుతుంది - ఆ ఊరూనాడూ, మెదిలే వేకువజాముకు, గడియో అరగడియో అదమరచే నిదుర కమ్ముకుంటుంది - అంతలో సూరయ్య చురచురలాడుకుంటూ మారాం చేస్తాడు.

నిదురలేచి మాత్రం ఏమిటి చేసేది - చేలకోతకు, కుప్పనూర్పుళ్ళకూ పోయి, ఆ యిచ్చే అర్ధరూపాయి డబ్బుల కోసం, పాచిమాటలు పడుతుందా? - పస్తుంటే నేం?

చేజాపి చాకిరీ చేయించుకోండమ్మా అని, ఏ తల్లినన్నా అడిగినా - మా ఆయన అసలే మంచివాడు కాడు - అందుకు తోడు నీవొకతెవు దాపురించావా అంటే,- ఇక నా కాపురం-

ఆ పై పొల్లుమాట అనిపించుకోకుండానే వచ్చేస్తుంది, ఓపిక తెచ్చుకుని పస్తుంటుంది.

ఊళ్ళో కోరమీసం ఉన్నవాడూ వీడూ, ఒంటరిగా చూసి, ఒక్క నవ్వు నవ్వుతాడు-తలవంచుకుని పోతూంటే దారికి అడ్డమౌతాడు-"అదేమిటి అన్నా!" అంటే, అక్కసు తెచ్చుకుని, "ఆసినీ-" బూతుకూత కూస్తాడు-

అయ్యతో చెప్పుకుంటే మాత్రం - "నన్నిలా ఈ మాయదారివాడు తూలుమాట అన్నాడయ్యా-" అని మొత్తుకుంటే మాత్రం - నలుగురి పాదాలదగ్గిరా బ్రతికే బడుగు - ఏం అదుకుంటాడు - ఏనాడో చల్లగా వెళ్ళిపోయిన అమ్మకు బూతులు తగిలినాయంటే - అయ్యగుండె పీక్కుపోదూ?-

ఈ పున్నమికి రెణ్ణెల్లు దాటుతాయి: కట్టుకున్న మగడు - తెక్కాడక - దండులోపోయి కలిశాడు - కాకిచేత కబురంపనా అన్నాడు - రూకలన్నాడు: కోకలన్నాడు - ముప్పొద్దులూ వెచ్చటి బువ్వన్నాడు - దోసెడు సొమ్ము అనుపుతానన్నాడు: పోయిన జాడన్నా తెలియకుండా పోయినాడు-

అయ్యకు, ఆ పెద్దలోగిలివారు, ముప్పొద్దులూ బువ్వ పెట్టి మూడు రూపాయలు విసుక్కుంటూ మొగాన కొడతారు - నెల తిరిగేసరికల్లా, ఓ పదిపొద్దులు అటూ ఇటూ అయినా - మారాజులు; రోజులు ఆనాటి కానాడు మరీ మండిపోతున్నాయి, నెలకు ముఫ్ఫైరోజులూ - ఆ ముచ్చిక మూడూ కడుక్కు గొంతులో పోసుకున్నా కడుపులోకి చుక్కదిగదు - ఇలానే బ్రతకాలి, కట్టుకున్న మొగాడికి- అక్కడ కాలూ చెయ్యీ ఆడేదాకా-

ఎవడో, ప్రొద్దు మాపటివేళ, మంచి నీమా జామా వేసుకుని, అచ్చంగా దొర దిగినట్టు దిగాడు.

"ఏం తాతా-సీతాయ్ ఏద"న్నాడు-

కుక్కిలో, నడుంవాల్చి కునుకుతూన్న అయ్య, రోషం తెచ్చుకుని-

"ఏం - దానితో నీకేంపనయ్యా!" అని కరవొచ్చినట్టు లేచాడు-

"పండుకో తాతా! - నేను పటాలంలోంచి వచ్చాను. సీతాయ్ నీకూతురే కాదూ? ఊరిలో వాకబుచేస్తే - యిదే యిల్లన్నారు - మీ అల్లు డంపాడయ్యా!" అంటూ మంచం పట్టెమీద కూర్చున్నాడు-

సీతాయ్‌కి ప్రాణం లేచివచ్చింది, వచ్చి వ్రాలి, "నేనే అన్నా! అయన బాగున్నారా!" అని అడిగి తల వంచుకుని సంబరంతో కంటతడిపెట్టింది.

"ఓ, ఒంటికి కండొచ్చింది! ఒకటికి రెండైనాడు. ఆ దిరేసుమీద నీవు పోల్చుకోనేలేవు-!"

పై జేబులోంచి బొమ్మతీసి అందిచ్చాడు, ఆ బారు బారూ, నలకలంటి మనుష్యులు, అందరికీ అచ్చుపోసినట్టు ఒక్కటే, ఒక్క మొయినే చుట్టుకోవడం - కట్టుకోవడం. అందులో ఏ మొగమో, కంటితో వెదకొచ్చుగాని, చేయి మరోడిమీద పడితే, మచ్చకాదూ!-

"అంతుచిక్కలా అన్నా!, అక్కడ చల్లగా ఉంటే చాలు!" అని లోపలికి పోయి. చిటికెలో వచ్చిన బంధువుకు వండి వార్చింది.

వచ్చిన వీరయ్యా - ఆ రేయి ఉన్నాడు - కాదుకూడదని బలవంతం పడితే, అనాడూ ఉండిపోయినాడు. ఉన్నంత సేపూ అక్కడి ఊసులన్నీ పూసగుచ్చినట్టు చెప్పాడు. కోడి కూసే వేళకు లేచి, తెచ్చినసొమ్ము యిచ్చి, పయనమై పోయినాడు. కూనా గుడ్డూ ఉన్న ఊరికి-

ఆ వచ్చినయ్య అటు మళ్ళాడో లేదో, మనిషి విడిచి మనిషి, వేలువంచి చూపేవాడే, ఊరూనాడూ ఏకమై, సీతాయిని అడిపోసుకునేవారే!

ఆ వచ్చిన మనిషి ఎవరు? అక్కడ ఆయనతో బాటే కొలువుచేసేవాడంటే, నమ్మరు.

వచ్చి నీ కేమిచ్చి పోయినా డంటారు. గింజలట్టు కెళ్లేందుకూ మార్చే రూకరూకకూ మచ్చ కడతారు... పుచ్చుకు నవ్వుకుంటారు!

అనాటి కానాడు మరి బరిమీరిపోయినారు. "తాతా మనవణ్ణి ఎత్తుతావుటే!" అంటారు. అయ్య తన్నేమీ పొల్లు మాట అనేవాడు కాడు. అన్నీ విని తనలో తానే గుండె బాదుకున్నాడు. అలాగే మంచం పట్టాడు -

అయ్యా నా తప్పులేదయ్యా... అని ఆ వూసేత్తేందుకే గుండె చాలకపోయింది. "నా మొగవాడు కట్టుకున్న పున్నమే. ఇది! నన్ను అడిపోసుకుంటే మీకు కళ్ళు ఉంటాయా!" అని మనసులో అనుకునేందుకన్నా చీదరే... వూరు...నిందెమోపితే...అన్న అంకిలే నొక్కుకు పోతుంది...పుస్తె కట్టినవాడు నమ్ముతాడా!...

నమ్మడనుకుంటే...బ్రతికేదే కాదేమో...

వచ్చేవాడు రానేవచ్చాడు...యీ ప్రొద్దుకు ప్రాలుతానని కమ్మ అంపాడు...అందులో చెప్పిన జాముకే...ఆ బొమ్మలోఉన్నట్టే వచ్చాడు...

వచ్చేవాడు వూరిమీద ఏం విన్నాడో...ఎంత నమ్మాడో...ఎదురుపడగానే ఎగిరి తన్నపోయినాడు.... దొరల్లే అరచాడు...

"అదేం పాపం ఎరగదయ్యా!" అని అయ్య అంటూండగానే – ఆ మీదకు ఉరికాడు—ఇరుగయ్యా పొరుగయ్యా చేరి, ఆ మారాజునే ఆకట్టుకున్నారుగాని – అదేమి పుణ్యమయ్యా! ఆడకూతురిమీదికి ఒంటికాలుమీద లేస్తావెందుకూ— సీతాయి మా బిడ్డవంటిది కాదూ" అని బిడ్డలున్న సంసారులు ఆ గడ్డమీద యిందరున్నారే, ఒక్కరికైనా పెదవులు మెదిలినాయా?—అదనైందికదా అని, అందరూ తలో అడ్డుపుడకా విరిచారు. తన్నెన్నడన్నా కీడు తలంచిందా, ఆ అయ్యలందరికీ!—

కాపురం చేసినన్ని పొద్దులూ, కడుపుకు ఉన్నా మానినా, ఎన్నడూ కన్నెర్ర చేయనివాడికి – ఈ కర్మ మేమిటి? – సీమా – జామా మార్చుకోంగానే – మనసూ మారిపోతుందా? – ఒంటిపొద్దులు మాని వల్లమాలినంత బువ్వకంటికి అందంగానే – మసకేసుకుపోతుందా? , దండులో ఉన్న పెద్దలు చెప్పే బుద్ధులు ఇవేనా?—

"అయ్యా మీకు మా ఊసే పట్టిందా నాయనా! – బడలివచ్చిన మొగవాడికి – కళ్ళు బైర్లు కమ్మాయి – నేను కాచుకుంటాను – మీ యిళ్ళకు మీరు పొండయ్యా దొరలు – నేను మప్పొకుంటాను—" అంటూ జోడు కేలెత్తి బతిమలాడుకుంది. అందరినీ సాగనంపింది.

"అయ్యా వచ్చిన వాదేమో, ఊరంతా పొక్కింది నీ అల్లుడూ నేనూ మాట తేల్చుకుంటాము – నీవు కునకవయ్యా!—" అని అయ్య నోరెత్తకుండా చేసింది.

"అయ్యా అమ్మా వెయ్యేళ్ళూ మాట వంకర పోకుండా, ఈ నీడలో బతికారు – ఇక్కడెందుకు, యాగీ! – పచ్చని చేలగట్టున – పైరు ముట్టి నిజం ఎరుక చెపుతాను – రా," అని, పసికూన అడిగినట్టు అడిగింది—

"ఒంటరిగా పోయి మళ్ళీ బ్రతికి వస్తావా కూనా," అని అయ్య, విలవిలలాడిపోతున్నాడు.

"మాకు వెయ్యేళ్ళు ఆయుస్సుంది అయ్యా, నావాడు నా వెంటనే ఉన్నాడుగా!—" అని వెన్ను చరిచింది—

పచ్చని చేనుగట్టున పండువెన్నెల్లో మగవాణ్ణి నిలవేసింది –

"నీ పాదాలసాక్షిగా నే నేం నేరం జేశానయ్యా!, నీవు నమ్మావయ్యా!, కడుపులో కూనకు అయ్య నీవు కాదంటావా?, నీ బిడ్డకు మారుతండ్రిని కట్టుకున్నాననుకున్నావా? నేను, ఆ తల్లికడుపున పుట్టలేదనుకున్నావా?" కత్తిమూరినట్టు, కన్నెత్తి మనవిచేసుకుంది—

"వచ్చినవాడు, అది మరగినవాడు ఊరికే చూసిపోతే, ఊరు చెప్పొకుంటుందా ఒప్పొకుంటే యీ తప్పు కాస్తాను: వల్లకపోయినా కూడూ గుడ్డా యిస్తాను—"

"ఈ బిడ్డ ఎవరిసొమ్మంటావు! నీ విచ్చిన వరంకాదా?—"

"పాపం పుణ్యం భగవంతుడికే విడుస్తాను. నీమీద చెయిచేసుకోనులే, నీ బ్రతుకు ఏదో నీవు బ్రతుకు—"

"నిన్ను విడిచా?"

"నేనే పోతున్నానుగా!--"

"పొట్టకు లేక పోయినావుగాని--"

"ఒట్టుకూ సత్యానికీ అయినా, రానులే, నా ఊసు మరచిపో--"

"నీవు కూనకు అయ్య--"

"ఆమాట ఎత్తకు, న్ను కవ్వించక నీదోవ నీదే అంటినిగా--"

"అదే మాటా?"

"అహఁ!, ముమ్మాటికీ--"

"నన్ను కవ్వించకే!-"

"నవ్వుతూనే అడుగుతున్నానుగా,"

"నవ్వెందుకు, నన్ను చూశా, చేసిన తప్పు కాశాననా?--"

"మళ్ళీ అదేమాటా?"

"ఈ జన్మకు యింతేనా!"

"ఇంతేనా?, అయితే ఈ జన్మ ఇంకెందుకూ?-"

మిడినాగు ఎగిరినట్టు బెడిసి, కంఠం కట్టేసింది, కుమ్మి కూలదోసింది. "కట్టుకున్నదానికి మారుమనువు కట్టావా? బిడ్డతండ్రికి మారుపేరు పెట్టావా?, ఆ మాట కంఠంలోనే అదిమేస్తాను," అంటూ, అన్న ఊపిరంతా నొక్కేసింది-

అప్పుడా మొగంకేసి చూసింది ఒక్కటే చూపు, నవ్వినట్టుంది ఆ మొగం, ఆ కళ్ళు చిన్నచూపు చూడటం లేదు, కల్లాకపటం, రోషం కావేషం దూసుకుపోయిన ఆ గుండెమీద తల అన్చుకుని, ఉసురుకు ఉసురు తోడిచ్చింది-

తెల్లవారింది, ఆ యీతాకుల గుడిసెలోకి సూరన్న తొంగిచూచాడు, సీతాయ్ ఏదీ అని తొంగిచూచాడు. మిన్నెక్కాడు -

★ ★ ★

# మొయిలు

అవతల పెద్దమనిషి నామీద ఆపేక్షగానే పలుకరించాడు: నేనూ, చాల మర్యాదగానే సమాధానం చెప్పాను: కాని, వినీ వినడంతోనే, కొంప ముంచేంతకోపం రిమ్మ ఎత్తుకు వచ్చింది అయనకు: "నీకింత తలపొగరా" అన్నంత కొరకొరగా చూశాడు: తిట్టబోయేంత ధూకుడులో దౌడలు ఆడించాడు; కాని, ఏమనుకున్నాడో ఏమో, అనబోయేవన్నీ దిగ్రమింగుకుని, – కాల్చేట్టూ,

"ఏంభాషరా, అది?" అనిమటుకు అని ఊరుకున్నాడు:

నేను, తెల్లమొగం వేసినట్టు, "ఏం!" అనేది తడబడుతూ ఉచ్చరించి – "తెలుగే, మన తెలుగే!" అన్నాను:–

ఆ సౌమ్యుడు తిక్క అదమాయించుకుంటూ "అలాగేం!" అంటూ మెడబెణికేంత రివ్వున రుంజుకుని, నా మొగం చూడడానికి తనకు వేసే అసహ్యం యావత్తూ అడుగులు తాటించడంలో తాహతుమేరకు ప్రదర్శిస్తూ, కళ్ళముందు నుంచీ, ఏతావతా కథలోంచీ నిష్క్రమించాడు–

పోతే పోయినాడు! మన కేం విచారంలేదు! ఆ పెద్ద మనిషికి యీ కథతో యిక ఏమీ ప్రమేయంలేదు.

కాగా, అసలు సంగతి ఏమిటంటే, అతడు నన్ను, అడిగిందేమిటి, నేను చెప్పిందేమిటి, అందులో ఏమన్నా పొల్లుందా, ఏమన్నా తూలానా?, సంగతేమిటో చివరకు తేలుతుంది –

వెనుకటికి ఒకసారి మనవాడికి ఒకడికి యిల్లాంటి చిక్కేవచ్చింది, అది అనవసరంగా లాభించింది:

మనమూ ఆ నోమేపడితే, మన చేతి రాయికూడా, ఎన్నడన్నా తగిలితే, అలాగే నాలుగురాళ్లు రాలక పోవుకదా, అని మానవసహజమైన ఆశ! అలా అనుకునే, అనే, ఇంతకుముందు, ఆ గృహస్థుతో పేచీ తెచ్చుకుంది:

మనవా డన్నానే, వాడికీ ఎత్తుగడ యిలాగే ప్రారంభం అయింది:

తలవంచుకుని, తన మానాన, తన త్రోవను తాను పోతున్నాడు: అదే తరుణానికి, ఆ పక్క డాబాలోంచి, అవిడ, చేటలో కూరచెక్కలు వీధిలో పారవేయడానికి అరుగుమీదికి వచ్చింది: వీడినిచూసి, పాపం, మర్యాదగానే ఆపేక్షగానే పలుకరించింది: వీడూ అలాగే జవాబు చెప్పాడు:

వినీ వినడంతోనే, అవిడమటుకు ఎంగిలి విస్తరిమీదకు కొట్టుకువచ్చినట్లు ఎగిరి వెనుకకు ఒక్కగంతువేసి, తలుపు పగిలేటట్టు విసిరికొట్టింది:

ఈవిడ ఈ అఘాత్యమేమిటో, వీడికి అర్థంకాలేదు: తాను ఏమన్నాడని? అన్నదాంట్లో తప్పు ఏమన్నా ఉందా!, ప్చ్? –ఏమిటో అర్థంకాలేదు:

ఆలోచించిచూసి, ఒక్కటే అనుకున్నాడు. ఈ బెడదకంతకూ మూలకారణం వీరేశలింగం పంతులుగారు బ్రతికి ఉండకపోవడం!–

...వయోధర్మాన్ని పట్టిచూసినా, మాంచి ఉమ్మసంమీద ఉంది: అందరు అమ్మలక్కలు లాగానే మూడు పువ్వులూ ఆరు కాయలుగా కాపురం చేస్తూండవలసిన ఈడు:

ఆ ముద్దూ ముచ్చటా ఏమీ కొనసాగకుండా, ఆ చిన్నదాని బ్రతుకు అలా అయిపోవడం, అయిపోయినదానికి వగపేమిటకని, గుండె రాయిచేసుకుని, ఆ చిన్నదాని గొంతుక్కు మరో మూడు ముళ్లువేయించే దక్షుడు అంటూ లేకపోవడం, ఏతావాతా ఆ జీవితం అలా నిప్పచ్చరమైపోయి, వంటయింటి పాలైపోవడం, ఆవిడ అకారణంగా ఛర్రమన్న దంటే, మన వాడికి ఆశ్చర్యం వేయలేదు. పాప మనిపించింది ఆ బ్రతుకుమీద జాలేసింది:

వెనుకటికి, మహర్షులకు కరవొచ్చేంత కోపం ఉండేదంటే, ఇదే కారణం అయివుంటుంది: ఇదే అంటే, ఆ ఇనుప కచ్చడాలే!

—మేము యిద్దరమూ వాడిగదిలో కూచుని, యీ విషయమే అనుకుంటున్నాము: ఇంతలోకే ఆయన చక్కావచ్చాడు:

ఆయన అంటే, ఓ పెద్దమనిషి, కులగోత్రాలు ఎన్నవలసిన అగత్యంలేదు, సజావైన స్థదా కోటిలింగాల్లో, ఇదో అంకె!–

ఎందుకు వచ్చాడు? వీడితో పోట్లాడడానికి, అది, స్పష్టంగా కనిపిస్తూనేవుంది, ఆ రావడంలో, ఆ కూచోడంలో, ఆ దూకుడంతా?

పోట్లాటదేనికి?, వాళ్లిద్దరూ ఏదో మాట్లాడుకున్నారు: ఎవర్నిగురించో తెలిసింది కాని, అసలు కిటు కేమిటో అంతు చిక్కలేదు.

"నీవలా అనడం మర్యాదా?" అన్నాడు ఆ పెద్దమనిషి: ఆవిడను ఏదో వీడు అన్నాడని, వెనకేసుకువచ్చాడు:

మనవాడు, జవాబు చెప్పేముందు, తొణక్కుండా కొంచెం నిదానంగా ఆలోచించాడు:

"ఆవిడను నేను ఏదో అంటే, మీకు కోపం రావడానికి కారణం,? అని పాఠంచెప్పినట్టు పరకాయించి అడిగాడు: ఆ నోట, తడుముడే తప్ప, సమాధానం వెంటనే పెగిలింది కాదు:

"ఏమిటి ఈ సంబంధం!" అని తనలో తాను అనుకున్నాడు వీడు:

వచ్చిన పెద్దమనిషి గట్టి యిరకాటంలో పడ్డట్టుంది వైఖరి: నావంక చూసి, ఆ చూపే వీడివంక చూసి, "నీతో అయిదు నిమిషాలు ఒంటరిగా మాట్లాడుదామని వచ్చాను" అని నసిగాడు:

వీడు, "ఓ!" అన్నట్టు మొగం కోలచేసి, "రాగానే ఆ మాట చెప్పకపోయినారా, సరే ఒంటరిగా అంటే ఒక్కటే చిక్కు – ఉనికీ మనికీ ఉన్నది ఒక్కటే గది, మనం బయటకన్నా పోవాలి, వచ్చిన స్నేహితుణ్ణయినా ఇక్కడనుంచి తరిమివేయాలి..."

"మీరు కూచోండి. నేను మళ్ళీ వస్తాను" అని లేవబోయినాను: వీడు నన్ను కూలేశాడు.

"అలా కాదులే, ఎందుకైనా మంచిది, రోడ్డు ఎక్కితే, ఉభయులం నిర్మొగమాటంగా మాట్లాడుకోవచ్చును: నీవు కూడా!" అంటూ యిద్దరూ కలిసి వెళ్ళిపోయినారు-

నాకు ఇందాకటినుంచీ ఒక్క ముక్క అర్థంకాలేదు, వీళ్ళిద్దరిమధ్యా ఏమిటో పేచీ, ఎందుకొచ్చిందీ? వీడు సాధారణంగా ఓ జోలికీ శొంఠికీ అనవసరంగా పోడు: కావాలని చెయి చేసుకుంటే తాతలు దిగివచ్చినా బెసగడు. అసలు ఏమిటి సంగతి?-

ఇంతలోకే వీడూ తిరిగి వచ్చేశాడు: పట్టపగ్గాలులేనంత సంబరంతో వచ్చాడు: గదిఅంతా కలయదిరుగుతూ మౌనంగా వెక్కి వెక్కి నవ్వుకుంటున్నాడు.

నా మొగమంతా ప్రశ్నల్లే చేసుకు కూర్చున్నాను! ఒకటి రెండుసార్లు నావంక మిడిమిడిగా చూశాడు. కొంచెం బిగ్గిరిగా నవ్వుకున్నాడు.

"లే-కాఫీ త్రాగుదాం! -"

నోరెత్తకుండా వాడివెంట నడిచి వెళ్ళాను, ప్రశ్నను మ్రింగేసుకుంటూ.

ఇంకో అరగంటకు, అసలు సంగతేమిటో చెప్పాడు.

ఓ వెయ్యి రూపాయలు లంచం యిచ్చి, వీడి నోరు కట్టేసి వెళ్లాడు ఆ పెద్దమనిషి -

ఎందుకూ? -

అందుకే, ఆ సంగతి వీడికి తెలిసినందుకే!-

-అవిడ కడుపుతూంది కన్నది! అంతా గప్‌చుప్‌గా జరిగింది! అది ఎలాగో వీడికి తెలిసింది-

"నీకు ఎలా తెలిసిందిరా! సప్తప్రాకారాల లోపల సంఘటన: పైగా ఆరుమాసాలనుంచీ నీవు ఊళ్ళో లేకనే పోతివి: మాకు ఒక్కళ్ళకూ తెలియదే, ఎక్కడా పొక్కందే!"

"ఒరేయ్! ఆ ప్రశ్నలన్నీ ఆ పెద్దమనిషి అడగవలసిందీ:, నీ కెందుకురా? -"

..."పోనీ ఎలా తెలిసిందో చెప్పరా బాబూ, ఏమన్నా అంజన ప్రభావమా?"

..."అంతేననుకో: రవి కంటపడని సంగతులు, కవి కంటపడతాయ్ అన్న ముసలివాళ్ళు వెర్రివాళ్లా? నాకు తెలుసునని వాళ్ళకు నమ్మకం, నేను కాదంటే ఏంలాభం: ఆ నాలుగురాళ్లూ దక్కకుండా పోవడమేగా!"

"నీ వనేదేమో నాకు అర్థం కావడంలేదు."

అయన వచ్చి కదలేసేదాకా నాకూ అర్థం కాలేదు: ఆ మానవుడి తత్తరపాటులో నాకు చూచాయగా కీలకం అందింది: వట్టిబుకాయింపుమీద నెట్టుకువచ్చాను: పాచిక తంచన్‌గా పారింది -

"అంటే,? - ఇంతకూ నీవు అవిడను ఏమన్నావ్?"

... "ఏ సుమూర్తాన అన్నానో, ఆ ఒక్క ముక్కా అక్షర లక్షలంత పనిచేసింది: బిడ్డకన్న విశ్వస్థమొగం చూడటం అంతయోగప్రదమని నాకు యిదివరకు తెలియదు సుమీ అబ్బీ!"

..."ఇంకా సాగదీయక, ఆ ఒక్క ముక్కా ఏమిటో చెప్పుదూ..."

"చెపుతూంటినిగా"...

అవాళ నేను రైలుదిగి బండిలో వస్తున్నాను; ఈవిడ మేడ వసారాలో, నీరసంగా నిలుచుని ఉంది: ఆవిడ ఆరోగ్యంతో మనకు అంత ప్రసక్తి లేదుకనుక నేను ఆ విషయం అప్పుడంత పరకాయించలేదు. ఆవిడమీద మనకు ఎలాటి ధ్యాస ఉండటం అలవాటు లేదాయెను. అందుకని, అవాళ ఆవిడ కనపడ్డ సంగతే చప్పగా మరచిపోయినాను...

"...ఉపోద్ఘాతం పేనేస్తున్నావు..."

"కొంచెం ఓపికపట్టు, అసలుకాండకు యిదే అయువుపట్టు..."

"అవాళటికి – మళ్ళీ – యివాళ కనిపించింది – పలుకరించింది – అందులో తప్పేంలేదు – ఎబ్బెరికమూ లేదు – "ఏమయ్యా ఎప్పుడు రావడం –" అంది: నేనూ సజావుగానే సమాధానం చెప్పాను – చెప్పాననే అనుకున్నాను–"

"నేను కానిమాట ఏం అనలేదు సుమీ – "మీరు కన్నప్పుడే నండీ!–" ఇంతే నా జవాబు: ఆవిడ, వినీ వినడంతోనే రగిలిపోయి, తలుపు ధణాయించింది కదా!–"

"నేను, అనాలని అనలేదు. అనడంలో, ఎలాటి చెడు ఉద్దేశమూ లేదు – కాని, ఎందుకు అన్నానా? – నా అవస్థ మనవిచేస్తాను."

"అంతకుముందు కొన్ని గంటలనుంచి కవిచౌడప్ప పద్యపాదం ఒకటి నన్ను పట్టుకు గుక్కతిప్పకోకుండా వేధిస్తూంది – ఇదోయ్ – "కన్నపుడు–" ఈ పద్యం నీకూ వచ్చుకాదూ?–"

"ఆవిడ నన్ను పలుకరించడంతోనే జవాబుక్రింద అముక్కే తోసుకువచ్చింది. నేనైతే ఆవంక చూశాను కాని: నన్ను యీావిడ చూసివుంటుందా లేదా అనే ఆలోచనన్నా రాలేదు–ఉన్న మాట అలాగ్గా అనేశాను: ఆమాటకు నానాఅర్థాలు ఉండటంతో, కథ యిలా సాగింది–

"చీకటిలో చేసిన తప్పుడుపని – పైగా, తాత్కాలికంగా కళ్ళు మూసుకుపోయికూడా చేసిందేమో, నేను అలా అనడంతో, నేను పసికట్టానని గంగ వెర్రు లెత్తిపోయింది – ఆవిడ కష్టానికీ సుఖానికీ అక్కరకు వచ్చింది, ఆ పెద్దమనిషే: ఉభయులూ కూడబలుక్కున్నట్టున్నారు: ఎలాగైనా నా నోరు కట్టివేయాలని వచ్చాడు –"

"అయన చెప్పిందంతా విన్నాను – వినగా వినగా నాకే జాలేసింది; ఆ ఆదుర్దాచూసి, పట్టుకు తన్నా లనిపించింది – అసహ్యం వేసింది –"

"నిజం చెప్పాను – కాని, ఆయన నమ్మలేదు: మొర్రో నాకేం తెలియదు – మీరే గంగలో కలిస్తే నాకేం – అని నేను అన్నకొద్దీ – నేను ఖచ్చితంగా అబద్ధం ఆడుతున్నాననీ, నాకు అంతా తెలుసుననీ, ఆయన మొరాయించాడు: ఎలాగైనా పరువు నిలపమని ప్రాధేయపడ్డాడు – అలాటి క్లిష్టపరిస్థితిలో – ఎదటి ఆసామీకన్న ఇనుమిక్కిలిగా, నేను ఇరకాటంలో పడ్డాను – కాదనలేకపోయినాను – ఇందులో నా దోషం అణుమాత్రమైనా ఉందంటావా!"

నేను, అంతావిని; ఏమంటానో అని, నావంక పరకాయించి చూస్తున్నాడు, వీడు: అనడానికి ఏంఉందీ? – మనసు ఉండబట్టలేక ఆవయసులో ఆవిడ అలా చాటుగా మాటుగా ఓమాటో అరమాటో సుఖపడ్డది–అంతకు ఇనుమిక్కిలి గాభరా,

గంద్రగోళం పడ్డది – అది, చివరకు ఇలా వీడికి యోగించింది! ఇందులో నేను అనేందుకు ఏముందీ?–

నేను, నా ఆలోచనతో మౌనంగా ఉండటం చూసి, వీడు అందుకున్నాడు –

ఇన్నాళ్లకు తెలిసివచ్చిందిరా అబ్బీ! గ్రాంధిక భాషలో ఏదో యోగం ఉండబట్టే – వెనుకటి కొమ్ములు తిరిగిన కవులందరూ, దీన్ని పట్టుకు పాకులాడారు: వాళ్ళకూ తప్పకుండా లాభించే ఉంటుంది–

"ఒరేయి, నీ వనేదాంట్లో సబబులేదు–"

"ఉంది, నేను అనే దేమిటో నీకు, విపులంగా అర్థం కాలేదు. వ్యావహారిక భాష అయితే ఎంతసేపూ ముక్కుకు సూటిగా పోవడమేనాయను: అందులో మట్టుకు ఒక్కటే అర్థంగాని, ఇన్ని తికమకలు లేవుకదా!–నాకు ఏం తోస్తూన్నదంటే, చూడగా చూడగా, మనం అనుకున్న అర్థం ఒకటి, అవతలవాడికి అయే అర్థం ఒకటి – అలా అయినప్పుడే ఎన్నడైనా ఫలంపాటు! – ఒక గ్రాంధికభాషకే, ఆ సత్తా ఉన్నదని, – రుజువైందికద! – ఇకనుంచీ, – ఈ క్షణాన్నుంచీ మనం గొడ్డుగ్రాంధికులం!–"

"సరేలేరా, – వాళ్ళను ఇంతటితో వదిలినట్టేనా?"

"ఆవిడకడుపు చల్లగా, – నేను వదిలినా వాళ్లు నన్ను వదులుతారా? – అభ్యాసం కూసువిద్యకాదుటోయ్ – ఇన్నాళ్ళకు దోవలోకి వచ్చినతరువాత, – మళ్ళీ ఆ ఇల్లాలు మడిగట్టుకు కూచుంటుందంటావా? – ఆవిడకు ఏం అగత్యం! – ఇలాగే దైవం చల్లగా చూస్తే – ఏటేటా, ఆవిడ ఎంగిలి పడనూ వచ్చు – పాతికో పరకో పెట్టి, – పరువు ఏక్‌సాల్‌గా కొనుక్కోను వచ్చు! – మనకు, కొన్ని ఏళ్ళదాకా ఈ వార్షికాలు తప్పవేమో అనిపిస్తుంది!"

"ఇది పరువే నంటావా? – ఈ సంపాదన!"

"ఇది కేవలం భాషకు సంబంధించిన విషయం – ఇందులో మంచి చెడ్డలు నిర్ణయించవలసింది ఏ సాహిత్యపరిషత్తో కాని, – మనం కాదు – మనకు కావలసిందల్లా యింతే – భాషను నమ్ముకున్నందుకు, – ఏదో రూపేణా పోషణ జరిగేటట్టు – ఆదేవి అనుగ్రహించింది – ఇక తర్కం చాలిద్దాం – ఈ డబ్బులు ఖర్చయేదాకా, – నాకు చేదోడుగా ఉండు!–"

☆ ☆ ☆

ఈ తతంగం జరిగి ఇప్పటికి చాలరోజులైంది: డబ్బు ఏనాడో ఖర్చు అయిపోయింది – కథ పాతపడిపోయింది – కాని, ఆ ప్రయోగంమాత్రం మనసు అట్టడుగునే మౌనంలో పడిపోయి ఉండాలి!–

అవాళ నన్ను ఆయన పలుకరించి, – "ఎప్పుడు రాక" అని అడగడం, – నేను ఉన్నట్టుండి, – "మీరు కన్నప్పుడే" అనడం, ఆయన ఆమాటకు మొగం కండలు చించుకోవడం – నేను ఉలిక్కిపడటం – ఈ రంధి కంతా అదీ కీలకం–

గ్రాంధిక ప్రయోగం చేసినందుకు, – అవతల మనిషి సౌమ్యుడు గనుక, – అంతటితో విడిచిపెట్టాడు – నా జాతకరీత్యా – అంతే యోగం అనుకోవాలి!–

★ ★ ★

# మధ్యాక్కర

బాగా ఝాము పొద్దెక్కింది: అప్పటి కప్పుడే తాతగారు అనుష్ఠానాలన్నీ తీర్చుకుని దొడ్డివసారాలో, సుష్టుగా బాసెపట్టుమీద కూర్చుని, – పుస్తకంలో బొమ్మలవంక, కడుపునిండేట్టు చూస్తున్నాడు. అమ్మమ్మ పూర్తిగా మడికట్టుకుని – పార్వతీదేవికి మల్లే, అర్ధణా అంత కుంకుంబొట్టుతో సందిట మంచినీళ్ళ కడవ, – మరోచేత్తో, కరివేప రెమ్మలూ పట్టుకుని, – వంట యింట్లోకి వెళ్ళిపోతూ, ఆ చాయలకు వచ్చింది!

అగు! అమ్మీ! అన్నారు తాతగారు: ఆగి అలానే నిలుచుంది: అయన ఫామేదాగా, ఎగాదిగా చూసి:–

భేష్! ఇంకా ఆడదానివే! – అని మెప్పుగా తల ఊగించారు:

అమ్మమ్మకు సర్వసాధారణంగా తాతయ్య మాటలు అర్థంకావు: కాని; అయన నోటివెంట వచ్చేది, అహర్నిశమూ ఛలోక్తులేననీ – అంత పండుతనం వచ్చినా, – ఆమె కంటపడగానే ఆ మారాజు, బాల కుమారుడేననీ, – ఆవిడకు ఓ నమ్మకం! అమ్మమ్మ ముసిముసి నవ్వులతో లోపలికి చక్కాబోయింది;–

అంటే ఏమిటి తాతయ్యా! – అన్నాను రవంత దగ్గిరకు జరిగి:

అంతేనోయ్! – మీ అమ్మమ్మ ఇంకా ఆడదే:–

–అనగా?–

అది, మా తాలూకు రహస్యం! – అయినా, – నీకు చెప్పవచ్చునులే – పువ్వు – పుట్టగానే పరిమళిస్తుంది! ఆడది మటుకు వయసువచ్చినకొద్దీ రెట్టిపోతుంది! ఒంపులు ఒంటపడతాయ్! – చిన్నప్పుడు మా ఆవిడ ఆలవోకగా త్రిభంగిగా నిలిచేది! మీ అమ్మమ్మ అయిన తరువాత, – కడవరొండిన పెట్టుకుంటేనేగాని, ఆ భంగిమం రావడంలేదు!

అదీ, నా అదృష్టమే అనుకోవాలి – కొందరు కుసుమ కోమలులు, – యీ పడిలో, కోరమీసం పెంచుకుని, కొరకరాని కొయ్యలైపోతారు. అమ్మమ్మమటుకు అంతో యింతో ఆడ – రేక దక్కించుకుందయ్యా!–

ఇంతలో అమ్మమ్మ యిటువచ్చింది:–

–రా! – ఇలా కూర్చో? అన్నాడు:

నేను – మడి! – అని జంకింది:

మనం ఒక్కమ్మడి! – రా పిల్లా! – అని అయన చేజాచాడు! – నేను అక్కడనుంచి లేచాను:–

కూచోరా – నాన్న! – అంది, అమ్మమ్మ!–

కాస్సేపు వాడు పరపురుషుడే! – నిష్క్రమించనీ –

నేను లోపలికి తప్పుకున్నాను. అమ్మమ్మ – మోకాళ్ళు పట్టుకుని నింపాదిగా చతికిలపడ్డది:–

తాతయ్య పుస్తకం విప్పి, అమ్మమ్మ ముందుకు జరిపాడు. అది, – అజంతాబొమ్మల పుస్తకం!–

అమ్మమ్మ ఉలికిపడ్డట్టు చూసి, – తాతయ్యవంక కోపంగాచూసి, – "అవ్వ!" అన్నట్టు నోటికి చెయ్యి అడ్డం పెట్టుకుంది, – యిదేం విడ్డూరం! – అనుకుంది!

వెర్రిపిల్లా! తీగెకు కాయలు బరువు టే! అన్నాడు లాలనగా తాతగారు!

ఇదేదో విశ్వామిత్ర సృష్టి – అంది అమ్మమ్మ!–

అవునే అమ్మీ, ఇలాటి సృష్టి సన్యాసి చేతనవుతుంది కాని, సన్యాసికాని సంసారికి తీరుబడి ఉంటుందా?–

ఒరేయ్ బాబూ ఇవి అనుభవంమీద అంటున్న ముక్కలేరా– వింటున్నావ్ కాదూ? – అని నాకు తగిలేట్టు కేక వేశారు తాతగారు – అమ్మమ్మ నవ్వు అందెలమ్రోతల్లే నన్ను తరుముకువచ్చింది. నేను ఇంకా లోపలికి వెళ్ళిపోయినాను –

## 2

తాతగారు, రమారమి ఏడాదినుంచి తీరుబడిగా కూర్చుని గీర్వాణంగా ఒక పద్యకావ్యం వ్రాశారు. అవాళ మధ్యాహ్నం, దాని పీఠిక అంతా తెలుగులో వివరించడం ప్రారంభించాడు. చేగోడీలు ఫలహారంచేస్తూ – అమ్మమ్మ బియ్యంలో రాళ్ళుచేస్తూ సరసనే కూర్చున్నది. నాకు నిద్ర మత్తుగాఉంది. కాని, ఆయన ఎప్పుడు నోరువిప్పినా ఏదో ఒకటో అరో మడతపేచీ రానేవస్తుంది కనుక, – అందుకోసం నేనూ మెలకువగానే ఉన్నాను – తాతగారు తరువాయి ఎత్తుకున్నారు.

..."సన్యాసికి అతి ముఖ్యం సంసారసుఖమని, మనకు ప్రామాణికంగా తేలింది. తాను ఉత్తరోత్తరా తరించడానికీ, యీలోగా తత్త్వాన్ని తరచిచూడటానికి దాంపత్యసుఖం ముఖ్యావలంబనం. గాధిరాజు కొడుకు, ఎంతకాలం జడలు కట్టించుకొని శిఖలోంచి నిప్పులూ సెగలూ క్రక్కించినా! – చివరకు మేనక చేతిలోకాని, కీలకం చిక్కలేదు."

పుట్టీ పుట్టడంతోటే, ఉపనయనానికి ఎదిగి నిలుచున్న పరాశరుడి కొడుకు తల్లి పనుపున – ఆ మాత్రమింగక తప్పింది కాదు. నిన్నో, మొన్నో మన శంకరుడుకూడా ఫలానారాజు శరీరంలో ప్రవేశించి, తద్వారా అంతఃపురంలో ప్రవేశించి, ఆ పాదాలు వల్లించవలసి వచ్చింది.

ఇంతవరకూ విని, అమ్మమ్మ మనసులో "శివశివ," అని గొణుక్కుంటో చెవులు మూసుకున్నది, తాతగారు, చిరునవ్వుతో – "అప్పుడే ఏమైనట్లు, వినవలసింది ముందు ఉందే పెళ్ళికూతురా!" అన్నారు. అమ్మమ్మకళ్ళనీళ్ళ పర్యంతం అయి, "నేను – అజ్ఞానురాల్ని – నా చెవుల ఇలాటివి పడవేయకండి!" అని బ్రతిమాలుకుంది.

"ఏం! చెడిపోతావా?"

అమ్మమ్మ తలవంచుకు కూర్చుంది.

తాతగారు, నావైపుచూచి,

ఏమిటోయ్! – మా అవిడ వాలకం? నీ కేమన్నా అర్థం అయిందా? మనం బూతులు మాట్లాడుతున్నామని అనుకున్నదా ఏం? మడిగట్టుకుని – మాంచి

వైదిక భాషలో ప్రాశాంకరదః ఇంతకూ అమ్మీ! – మండనమిశ్రుడి పెళ్ళాం, మహా పతివ్రత అని మనం ఒప్పుకుంటున్నామా? బడితలాటి పరాయి మొగవాడిని – అందులోనూ పెపెచ్చు పరమ సన్యాసిని పట్టుకుని, పట్టపవలు – కామశాస్త్రంలో పరీక్ష ఇవ్వమందే! – అలా అడగటం – బూతంటావా! –

ఏంరా నాన్నా – కృష్ణపరమాత్మ, డబ్బూదస్కమూ లేనివాడంటావా! – లక్ష్మీదేవి మొగుడికి కొనుగోలుశక్తి బొత్తిగా లేదంటావా? కన్నకొడుకును తీసుకువెళ్ళి ఎలాటి కొంపలో కాపురం పెట్టాడు? – తాను అహర్నిశలూ అక్కడికి వచ్చి పోతూండేవాడేకద! – పరమాత్మకు తట్టని బూతు పామరుల కెందుకోయ్! అందాకా ఎందుకూ, నల్లనివాడు పద్మనయనంబులవాడు దాంట్లో చివరిపాదం మైలపడకుండా అర్థం చెప్పు. ఎంతమంది పడుచులు నోటపట్టి వర్ణించడంలేదు? అమ్మీ – బూతనుకుంటే, కులకాలిగాని – ఉలిక్కిపడటం – భామలకు లక్షణంకాదే –

అమ్మమ్మ మళ్ళీ చెవులుమూసుకునేందుకు సిద్ధంఅవుతూండగా – ఇంతలో, వాకిట్లో ఏదో బండీవచ్చి ఆగింది. ఎవరో పిల్ల దిగింది – మెట్లు ఎక్కి, లేడికిమల్లే లోపలికి వచ్చేసింది. తాతయ్య అట్టే పరకాయించి చూశారు. మొగం మరీ విప్పారింది.

"నేను శశిరేఖ మనుమరాల్ని" అంది – వచ్చిన పిల్ల కన్నునిండుగా చూస్తూ.

తాతగారు – బానెపట్టు సరిచేసుకుని – "అఁ అట్లాగుటే భడవా? అప్పుడే ఇంతదానవైనావూ?" అంటూ దగ్గిరకు లాక్కుని సరసను కూర్చోపెట్టుకున్నారు.

"మీ అవ్వ – లేచి తిరుగుతూందికద" – పిల్లది నవ్వుతూ తల ఆడించింది.

"గజ్జెఘల్ మంటూందా?" – చిన్నది, బుగ్గలుసొట్టలు పడేసుకుంటూ పెదవి రవంత విరిచింది.

"పాత పందిరిపట్టెమంచం – బాగున్నట్టేకద? –" తాతగారిమీదికి అలా ఒరగపోయి, ఫక్కున నవ్వింది:–

అమ్మమ్మ బిక్కమొగం వేసి – "నీ పేరేమిటే అమ్మాయ్!" అని గొంతు సవరించుకుంది:–

"అమ్మమ్మ పేరే పెట్టుకుంది!"– తాతయ్య కేసిచూసి జవాబు చెప్పింది – చిన్నది.

"అయితే...మాబాగే!" తాతగారు, పిల్లను మరింత దగ్గిరకు తీసుకున్నారు.

"దుగో ఆ ప్రబుద్ధుడు. మా మనవడు! – మనపేరే పెట్టారు! – ఆ తల వంచుకోవడం అంతా, బిడియం అనుకునేవ్ – ఓరగా మనవంక చూస్తున్నాడు! –"

చెంపమీద కొట్టినట్టు అన్నారు: తప్పనిసరిగా తల ఎత్తాను. ఆ పిల్ల వందమంది సరసులున్న సభను చూసినట్లు నావంకచూసి, అయిదు పది చేసింది! తాతయ్య – మెరమెచ్చుగా తల ఊగించారు.

..."అయ్యగారి పాదాలు కళ్ళకు అద్దుకురమ్మని – అమ్మమ్మ పంపించింది!" అని చిన్నది మనవిచేసింది. ఝల్లుమని ఎగిరి నిలుచున్నది – తాతగారు – కన్నువాల్చి కాలివంక చూశారు. చిన్నదాని ఎడమకాలికి – రవ్వలు చెక్కిన అందెవేసియున్నది.

తాతగారు – జమిలి చిటికెలతో తాళం వేస్తున్నారు. ఆ చిన్నది మెరుపల్లే కాలు కదుల్చుతున్నది. అమ్మక్కు నోరు అలా తెరచుకుని అబ్బురంగా చూస్తూన్నది.

చిన్నది – తాతగారిచేత సెబాస్ అనిపించుకున్నది.

ఆ తాళం ఏమిటని అడిగాను:

"ఎత్తుకున్నది చంద్రకల – ఝుళుకిచ్చింది – రాజ మార్తాండం–"

"మరి, తాళాలు ఏడేకద!" అతి తెలివిగా అడిగాను.

"ఆడలేని సాని అయితే తాళాలు ఏడేనోయ్! – అది, అందెవేసిన కాలు–"

అమ్మమ్మ మడిగట్టుకుంటానని – లేచింది.

"ఇప్పటికి ఇరవై ఏళ్ళనుంచీ కట్టుకునేఉన్నావు కదా, ఇంకా రంధి తీరలేదూ," అని తాతగారు అంటూన్నా వినిపించుకోలేదు.

"మీ అమ్మమ్మకు ఇప్పటికి అర్థం అయిందోయ్... వచ్చింది...సానిపాప అని!..." అంటో తాతగారు నవ్వారు.

ఆ చిన్నది... బెదురుగా – కోపంగా, కంటికి నీరు తెచ్చుకున్నది. తాతగారులేచి, సందిట పొదువుకున్నారు. అలాగే మనుమరాల్ని ముద్దుచేశారు. చిన్నది, అంతలో తెప్పరిల్లింది! –

ఏమిటిది?? – రహీమని అడిగారు తాతగారు.

కిలికించింతం! తడుముకోకుండా జవాబు చెప్పింది. తాతగారు, అప్పటికి చేయెత్తి దీవించారు.

సంజెపడేలోపున, తాతగారు అంగడివీధికివెళ్ళి, చిన్నదానికి చీరె, సారె పట్టుకు వచ్చారు. ఆయనే స్వయంగా, జడవేశారు. ఘమఘమలాడేట్టు చేశారు. యథావిధిగా అనుష్ఠానాలన్నీ తీర్చుకుని – తాము దగ్గిరకూర్చుని, – చిన్నదానిచేత పాయసం త్రాగించారు. మల్లెలపానుపుమీద, – పోయి నిదురచెయ్యమన్నారు. అవ్వచేత, ఒక పెద్ద మొహరీ యిప్పించారు.

రాత్రి పన్నెండు అయింది. నాకు నిద్రరాలేదు – రానంటూంది. తాతగారు వచ్చి, నా పక్కమీద కూర్చున్నారు. నేను కంగారుగా లేచి కూర్చున్నాను: వెన్నుతట్టుతూ – "నీవు యిక్కడ పడుకుంటావని మనం కలకనలేదు సుమీ!–" అన్నారు.

"అదేమిటి తాతయ్య!–" అన్నాను ఉక్రోషంగా –

"అఁ–ఏం లేదు అని తెలుసులే! – మీరందరూ పుట్టు సన్యాసులురా –!"

"అంటే –!"

"పది నవరసులు బనారసుచీరె కొంగుని ముడివేసి – మినప సున్నిఉండలు గుటకేసి – చీకటిగదిలో దోమల తెరలో – చివికిపోవల్సిన పుణ్యజనులు! –" తాతయ్యకు అంత కోపం రావడం నే నెప్పుడూ చూడలేదు.

"నేను – నీ మనుమణ్ణే" – అని, తాచల్లే లేచాను.

"ఔనోయ్ – కాని – మనకూ మనకూ ఒక నూరేళ్లు వార ఉంది:– ఈ ఇరవయ్యో శతాబ్దంలో – సుఖంగా పాపం చేయగలిగిన మొనగాడు అంటూ లేడురా నాయనా – మీరందరూ పూజ్యులు –!"

అలాగే తెల్లవారింది, ఆ చిన్నది – వృద్ధ దంపతుల దగ్గిర సెలవుపుచ్చుకుని, వెళ్ళిపోయింది. నా మనసు మటుకు అప్పటి కప్పుడు బండివెంట పరుగెత్తింది.

లోపలనుంచి, – తాతగారి గొంతు మ్రోగుతూంది.

"బూతంటే అదేనే అమ్మీ – నీకు సరేసరి; అర్థం కానేకాదు, నీ మనుమడి కంటావా అవసరమేలేదు. ఏదో యీ యింటి మొత్తానికి, నే నొక్కణ్ణే ఇలా దేవుళ్లాడవలసిన వాణ్ణి!" అమ్మమ్మ బిగ్గరగా నవ్వుతూంది. నవ్వుతోనే ఇటువచ్చి, నన్ను చూసి నవ్వేసి, పసిపిల్లవాణ్ణి బుజ్జగించినట్లు, "మా నాయనకదూ, మా నాయనే?" అంది. మళ్ళీ నవ్వింది: నాలుగందాలుగా నవ్వింది. అమ్మమ్మంటే అంతవయసులోనూ, తాతగారు ఎందుకు పట్టుకు ప్రాకులాడుతారో, అప్పటికి నాకు అర్థమైంది!

# 3

దేవీ నవరాత్రాలకు, కాశీనుంచి, తాతగారి సహాధ్యాయి, పండువంటి మహా మహోపాధ్యాయుడు, భార్యా, తానూ వచ్చారు. మా యింటికి చుట్టపుచూపుగా.

"ఆహాఁ, ఏంకళ అండీ, సాక్షాత్తూ పార్వతీదేవి," అని, అమ్మమ్మ ఆ యిల్లాలిని చూసి ముచ్చటపడ్డది. పలువిధాలుగా మెచ్చుకుంది.

తాతగారూ, ఆ వచ్చిన తాతగారూ ఇద్దరూ యింటిన పడి పసిపిల్లలకుమల్లే ఒకటే ఏక అల్లరి; ఆ రెండు సింహాలు చూడ ముద్దుగా ఉన్నాయి. కాని, వాళ్ళమాట నాకూ, అమ్మమ్మకూ పిసరంతైనా అర్థంకాకపోయె.

అమ్మమ్మకు ఒకందుకు మటుకు తృప్తికలిగింది. ఆవిడ అభిప్రాయం – కాశీలో అసలు బ్రాహ్మణులంటూ ఉండనే ఉండరని – చదువుకోసమో, సంపాదనకో – ఇటువైపునుంచి వెళ్ళినవాళ్ళు తప్ప: ఆ పండితుడుమటుకు బ్రాహ్మణుడే అని, తాతగారు ప్రమాణం చేసినంత కట్టుదిట్టంగా చెప్పారు.

ఆ మొగుడూ పెళ్ళాం యిద్దరూ – చిలకా గోరింకల్లే ఉండటంచూసి – పిల్లా పాపా లేనందువల్ల అల్లా ఎగిరి గంతేస్తున్నా రేమో అనుకుంది అమ్మమ్మ. నా అంత మనవళ్ళు వాళ్ళకూ ఉన్నారని తెలుసుకొని – ఆ దేశం మనుష్యుల తీరు ఎన్నేళ్ళువచ్చినా అంతేకాబోలు అని సరిపుచ్చుకుంది. తానూ ఆ యిల్లాలిని చూసి ముచ్చటపడింది.

నిజంగా వాళ్ళువున్న ఆ నెల్లాళ్ళూ – మా యింట్లో పండుగగా ఉంది. వెళ్ళిన తరువాత, ఒకరోజు... రోజల్లా అమ్మమ్మ కాలుగాలిన పిల్లికిమల్లే తిరుగుతూంది: అనుక్షణమూ ఆవిడనే తలచుకుంటూ ఉంటుంది. ఆ చక్కదనం వేనోళ్ళ పొగడుతుంది.

"వాళ్ళ చెల్లెలు ఒకమ్మాయ్ ఉంది. ఇంతకన్నా బంగారుబొమ్మ" అన్నారు తాతగారు.

"చూస్తే బాగుండునే –" అని రెపరెపలాడింది అమ్మమ్మ.

"బాగుండును – కాని ... నాకు ఆ యోగంలేదు!"

"ఏం?"

"వాళ్ళకు ఘోషా!"

"అంటే?... బ్రాహ్మణులకు ఘోషా ఏమిటి?"

"బ్రాహ్మణులకు ఘోషా కూడానా??"

"మరి..."

"వాళ్ళు నవాబులు..."
"రామరామ!...తురకవాణ్ణి కట్టుకుందా?"
"ఊఁ...!"
"పండంటి బ్రాహ్మణపిల్ల!"
"కాదు, బంగారంలాంటి తురకపిల్ల"
"ఆఁ, ఆఁ, ఏమన్నారూ ... ఏమన్నారూ!"
"అంతే... ఉన్నమాటే...!"
"మరి...యీవిడ..."
"వాళ్ళ అక్కయ్యే!"
"అక్కయ్యే!..."
"సాక్షాత్తూ!... ఒక్క తల్లి కడుపున ... ఒక్క తండ్రి పనుపున..."
అమ్మమ్మ, వడదెబ్బ తిన్నట్టు ... తూలి ... పడబోయి ... ఎల్లా వెళ్ళిపడ్డదో ... ఏడుకొండలవాడి పటం ముందు ప్రాణాచారం! ...
"అపచారం స్వామీ ... అపచారం ..." అంటూ ఎలుగు రాచుకుపోయిన గొంతుతో...
"తాతగారు ... ఒక్క నిమిషం నిదానించి ... లోపలకు వెళ్ళి ... అమ్మమ్మకు చేరువగా నిలుచుని ... భక్తి తాత్పర్యాలతో ... స్వామీ ... నా యిల్లాలిని మన్నించు ... తెలియక అపచారం చేస్తూంది? బీబీనాంచారు నీ ప్రాణేశ్వరి అని ... ఈ పసిదానికి తెలియదు"...
అమ్మమ్మ... తెల్లబోయి... అలా తాతగారి కాళ్లు పట్టుకోబోయింది! ఆయన ... శశిరేఖ మనుమరాలిని అక్కున జేర్చుకున్న ఒడుపులో ఆమెను దగ్గిరకు తీసుకుని...
"ఆయనెంతో... ఈయనాఅంతే ... ఇందులో మటుకు యిద్దరూ ఒకటే ..." అంటున్నాడు ... అమ్మమ్మ వికలంగా నవ్వింది...
వాళ్ళిద్దరికీ... నేను ఎంతో దూరంనుంచి దణ్ణం పెట్టాను.

★ ★ ★

# మంత్ర పుష్పం

"పాపం! – చిట్టిరాలిపోయిందిరా!" అన్నాడు, మొన మొన్ననే కాంగ్రెసు సంఘంలో కృత్యాద్యవస్థమీద సభ్యుడుగా జొరబడ్డ, మా పంతులు:

"ఎప్పుడు?" అని మేం నలుగురం అడిగాము, గొంతులు బిగిసి;

"వారం రోజులయింది!" అని జవాబు ఎక్కడో నూతిలోంచి వచ్చినట్టు!

"బ్రతికి ఎందర్నో సుఖపెట్టింది! పోయి తాను సుఖపడుతుంది" అంటూ మాలోఒకడి నిట్టూర్పు!

"ఆ బ్రతుక్కి చచ్చిపోవడంకన్న సుఖమేముంది? తెరిపి ఏముంది? – అదృష్టవంతురాలు!" అని మరొకడి సాకారం?

"అవును, దాని బ్రతుకంతా చచ్చినచావే! అది కాగా నెట్టుకొచ్చింది కాని, మరో ఆడదైతే–"

"మరో ఆడదానికి అంత దమ్ముంటుందా? – గట్టిగా చెడిపోయేందుకన్నా నిష్ఠంటూ ఒకటి ఉండాలి!–"

చిట్టి బ్రతికి ఉన్నప్పుడు, ఎవరన్నా ఇలా నోరెత్త గలిగారా?–ఎవడికి గుండెలున్నాయ్–

–ఎవరెల్లా మాట్లాడినా, మొత్తానికి అందరమూ చిట్టి స్వర్గానికి చేరుకున్నందుకు – సాదా స్వర్గం కాదు, పచ్చి వీరస్వర్గం – ఎంతో వాపోయినాము. మా విచారం చిట్టిపోయిందని కాదు: సరిగ్గా ఆ వేళకే – ఎప్పుడూ ఊళ్ళోనే ఉట్టి కట్టుకుని ఊరేగే బదుద్దాయిలం యావన్మందీ – ఏదో మునిగిపోయినట్లు – ఎవరమూ ఊళ్లో లేకుండా పోయినందుకు; ఆ వైభవం కళ్ళారా చూసే భాగ్యం లేకపోయినందుకు;

చిట్టి భౌతిక శరీర లేశానికి, వీరాధి వీరోచిత మర్యాదలు జరిగినవి. త్రివర్ణపతాకాన్ని కప్పి, కాంగ్రెసు వాలంటీర్లు, రెండోరకం నాయకులూ జయజయ నినాదాలతో బారులుతీరి ముందు నడవగా, చిట్టి పితృవనానికి పయనించింది; మంచిగంధపు ధూళిలో మలిగిపోయింది;

ఈ మర్యాదలో మర్మం, – మా ఊరి వారికి – అందులోనూ ఇంగితమున్న కొందరికి – కాని – అర్థం కాదు: విన్నవాళ్ళూ, – పత్రికలో చదివినవాళ్ళూ, – "ఇదేం విడ్డూరం? ఆ ఉళ్ళో కాంగ్రెసువాదుల కేమన్నా, పిచ్చ ఎక్కిందా? – లేకపోతే, పెద్దలను వెక్కిరించడానికా, యీ తతంగమంతా: – లేకపోతే – అతి సామాన్యపు బజారీ పడుపుగత్తె, కనుమూస్తే బ్రహ్మరథం పడతారా? –" అనుకుంటూ విస్తుపోవచ్చును: అందులో అబ్బురం ఏమీలేదు: చిట్టి బ్రతుకు మా సీమదాటి ఎందరికి తెలుసు? – ఆ మనిషి మనసు ఎవరికి తెలుసును? –

పోనీ, – ఇప్పుడన్నా, లోకం కనువిప్పడం మేలు:–

చిట్టి, – ఏ తల్లి కడుపునో పుట్టింది: ఏ చెట్టునీడనో తినో మానో ఎలాగో పెరిగింది: పదేళ్ళ వయసులో బొద్దుగా గున్నలాగా ఉండేది: సినీమాకు, ఆడవాళ్ళ గేటుదగ్గిర సమ్మర్దం చూచుకుని, దూసుకుపోయేది, సినీమాలో విన్న పాటలూ, – చూసిన ఆటలూ, – కునికిపాట్లు పడుతూండే జట్కాబండి వాళ్ళదగ్గిర పాడేది – ఆడేది: వాళ్ళు విసిరేసిన కానీ డబ్బులు పరికిణీరొండిన దోపుకునేది: ఎవడి చెవిసందునుంచో ఓబీడీ ఎగేసుకుపోయి, కమ్మగా దమ్ముకొట్టి, – ఎక్కడ నిద్రవస్తే – అక్కడే పడుకునేది: చెట్టుమీద వాలే గువ్వపిల్లంత గోముగా, ఈ చెట్టుక్రింద పక్షి పెరిగింది:

చిట్టికి ఎవరా పేరు ఎప్పుడు పెట్టారో, ఎవరాపేరుతో మునుముందుగా పిలిచారో తెలిసేదాఖలా ఏమీలేదు: కాని, ఓరకంగా ఊహించడానికి కొంతవరకు వీలున్నది: అసహాయోద్యమ యోధులలో కొన్ని వర్గాలు. కేవలం శాంతిసమరం మీద విసుగుపుట్టి, – రైలుపట్టాలు లేవనెత్తడం, తంతితీగెలు తెంచడం ఇత్యాది సర్కస్ ప్రదర్శనానికి నడుంకట్టి దుమికిన రోజుల్లో, – మా ఊళ్లో, ఉత్తరాదినుంచి వచ్చిన గారడివాడి ఆటలో, తొలుదొల్తగా చిట్టి సాక్షాత్కరించింది: వాడు, ఏదో లాఘవం చేయడానికి, – ఎవరన్నా ఓ కూన అవసరమై చుట్టూ మూగిన మూకలో ఏ పోరగాణ్ణి రమ్మన్నా రాకపోవడంతో – "పోని నీవు రా చిట్టి: నిన్నేం కొరుక్కు తిననులే!" అని, జనంమధ్య కుమ్మిసలాడుకుంటూ ఆటచూడటానికి ముందుకు నెట్టుకువస్తూన్న ఈ ఏబ్రాసిని, వాడు వెక్కిరింతగా పిలవడంతో, చిట్టి ఆ సుముహూర్తాన రంగంలోకి, నిర్భయంగా దూకి, – వాడితో బాటు ఆడి, వాడిని ఆడించి ఆపూటనుంచీ, – చిట్టి మాదైపోయింది: అదే పేరైపోయింది:

చిట్టి ఎవరు పిలిచినా పలికేది: అందరినీ కవ్వించి మాట్లాడేది: దాని మాటలో అదే పొంకం వుంది. మాటకూ మాటకూ మధ్య మౌనంగా పెదవి విరుపులో, – ఆ కంటి చూపులో, – ఏదో చెప్పరానంతనిండు ఉంది: చిట్టి అలవోకగా బూతులు మాట్లాడేస్తున్నా, ఎంత శోత్రియుడికైనా వినడానికి ఏమీ ఎబ్బెట్టు ఉండేది కాదు:

చిట్టి అధిక చక్కంది: అదంతా అర్థంకాని అందం. ఎండా వానా అనకుండా, అహర్నిశలూ అగమ్మ కాకిలాగా తిరుగుతూ, అందిందల్లా తింటూ, ఏ జన్మానా, జుట్టుకు చమురూ, ఒంటికి నలుగూలేని ఏబ్రాసి, – లక్సు పరిమళ సబ్బుతో చర్మసౌందర్యాన్ని రక్షించుకునే తారల గ్లేజు బొమ్మలకన్న పోణెంగా ఉండేది: పిల్లదాని పోషణ యావత్తు పంచ ప్రాణభూతాలు చేసేవి అని మాకందరికీ గట్టి నమ్మకం! వచ్చిన ఏడాది లోపలే చిట్టికి నిండుగా వయసు వచ్చేసింది. వచ్చిన మరుక్షణంలోనే, – ఎవరో, పొరుగూరునుంచి బడి చదువుకోసం వచ్చిన ఓ కుర్రవాడి చెంప – నడి బజారులో నాలుగురోడ్లూ కలిసే రద్దిలో మెరుపుదీపం క్రింద చెళ్ళు మంది. అది ఎలా జరిగిందంటే –

చిట్టి, అప్పటినుంచి, కొన్నిరోజులుగా, సంజెపడిన తరువాత సరిగా అదేవేళకు, ఆ దీపం దగ్గిరకు వచ్చి, ప్రొద్దు పోయేదాకా ఉండి, కడుపు పట్టినంత, ముంత క్రిందపప్పు కొనుక్కుతినేది. అంటే, తిన్నదంతా కొనుక్కునేది అనకూడదు: కొన్నప్పుడల్లా కొన్నంత కొసరేయించుకునేది: చనువైనవాడు కొంటూంటే కలియబడి

ఓ పట్టెడు కముచుకునేది – బేరంసాగినంతసేపూ ఇలాగే బొక్కుతూ, చివరకు వాడు జంగిడి ఎత్తేవేళకు – మిగిలిన అడుగూ బొడుగూ దులిపించుకుని – ఆ కారంచేయి, పక్కనున్న స్తంభానికి వేసి పామి – ఓ గుక్కెడు నీళ్ళు తాగి, చక్కాబోయేది:

అవాళా అలాగే పోతుంటే, – అందుకోసమే కాపేసుకుని ఉన్న కుర్రవాడు, చాలాదూరం వెన్నంటి వెళ్ళి, – అడుగు కలిపి అడుగువేసి, – పలుకరించబోయినట్టు గొంతు తడబడి అందుబాటులో ఉన్న చెయ్యి పుచ్చుకున్నాడు. చిట్టి నదురూ బెదురూ లేకుండా – తెరిపిగా ఉన్న చేత్తో, వాడి చెంప మోగించింది: దెబ్బతో, వాడు పాపం గింగిరాలెత్తి పోయి, – ఓ పొల్లుకేకపెట్టి, రోడ్డు పుచ్చుకున్నాడు:

రాత్రి ఇలా జరిగిందని, – చిట్టి, తెల్లవారగానే ఎవరితోనో చెప్పింది: నిమిషంలో ఆ కథ ఊరు మొత్తంమీద గుప్ మన్నది: చిట్టికి వయసువచ్చిందని అందరికీ అర్థం అయింది:

ఊరు యావత్తూ విస్తుపోయిందంటే అబ్బురం ఏమీ లేదు: అన్నాళ్ళనుంచీ చిట్టి, అలా వాళ్ళ నడుమను పెరుగుతున్నా, – అంత ఏపు కనబడుతున్నా, – చిట్టి వయసు వచ్చిన పిల్లది అనే భావనగాని, – దాన్ని చూసి మరులెత్తించు కోవాలనిగాని – ఎందుచేతనో జనాభాలో ఏ ఒక్కడికీ తోచినట్టులేదు:

అక్షణాన్నుంచి, ఎవడికివాడే, చిట్టిని చూస్తే బెదరిపోవడం మొదలుపెట్టాడు: చిట్టిమాత్రం ఏమీ మారిపోలేదు. చుట్టూ మెలగే లోకం మాత్రం విచ్చిపోయింది:

బెదరు ఎందుకంటే ఆ చిన్నది చెయిచేసుకుంటుందని కాదు: అది భయంకూడా కాదేమో, – ఎవడి మానానవాడు తానంత యంబ్రహ్మ నేనూ అని కించపడి ఉంటాడు: ఇంకో ఫికరుకూడా ప్రతివాడికీ వుండి వుంటుంది. చిట్టి ఎంతమాత్రమూ, చాటూ మాటూ లేనిపిల్ల: యిదివరకైతే ఆ చొరవని అందరికీ సరదా: ఇప్పుడు, మునపటి ధోరణిలోనే పలుకరిస్తే – చిట్టి ఏమనుకున్నా అనుకోకపోయినా, చూసే మరో మగరాయడు అసూయతో అయినా, అపార్థం చేసుకుంటాడు:

చిట్టి, కనపడ్డ ప్రతిమనిషితోనూ, రాత్రి జరిగిన ముచ్చట చిలవలు పలవలు లేకుండా చెప్పింది: ఎంత పని మీదపోయే పెద్దమనిషైనా, నిలవేసి చెప్పింది. కోర్టుకు, వేళ మించిందని ఉరుకులు పరుగులుగా జట్కా ఉరికించే లాయర్లను నిలవేసి చెప్పింది: తప్పించుకు పోయేవాళ్ళని తరుముకు వెళ్ళి, చేయిపట్టుకుని జబర్దస్తీగా ఆపి చెప్పింది: ఓపికున్నంతవరకూ, ఒక్కొక్కడికే చెప్పి.... ఎంతసేపటికీ తెమలకపోతే చిరాకుపడి పీచుమిఠాయి అమ్మే సాయెబ్ చేతులో బాకాలాక్కుని, నాలుగు దిక్కులూ దద్దరిల్లేట్టు చెప్పింది:

జరిగిందేదో చెప్పిందే కాని, అవతల కుర్రవాణ్ణి తిట్టలేదు, – తిమ్మలేదు. జాలిగా, విసుగ్గా, కసురుకుంటూన్నట్టు తనలో తాను గొంతెత్తి అనుకుంది. "వాడేం మొగాడు! – చెయ్యట్టు కున్నాడు!"

అ కథ అంతటితో పోలేదు: ఆ కుర్రవాడెవరో మా కెవరికీ యీ నాటికీ తెలియదు: చిట్టికీ తెలియదు: కాని అహోరాత్రాలు అదే చూపుగా తిరిగి,

ఎక్కడో మొత్తానికి పట్టుకుంది: పట్టుకుని, వాడు కోరుకున్న సుఖం బలవంతంచేసి దక్కించింది:

ఈ చోద్యం తనంత తాను చెప్పకపోతే, మాకు ఎలా తెలుస్తుంది? దోవ వెంబడి, పురివిప్పిన బుక్కాపావురం మల్లే చిట్టి ఏదో బరువెత్తిదించిన తేలికతో, నడచిపోతూ, – చంకనున్న పాపణ్ణి ఆడించుకుంటూ గుమ్మంలో నిలుచున్న ఏయిల్లాలితోనో, ముచ్చటంతా చెప్పేసిందట!

*"మగవాడంటే ఎలాటి గండో అనుకున్నానమ్మా: అస్తమానం పసిపాపే! – కడుపెరిగి ఉంగపట్టాలి, లేకపోతే జాతి జాతి ఆకలితో అటమటించి పోతుంది!" ఇంత నీతి చెప్పిందట!*

చిట్టి ఈ మాటమీదే బ్రతికింది ఇన్నాళ్ళూ!

లోకం, చిట్టిని ఏనాడు వెర్రిదానికింద జమకట్టలేదు. వ్యభిచార నిర్మూలన చట్టం అమలుపరచే శాఖలో జమాజెట్టి లెవరూ, చిట్టి విషయంలో అలాటిపాపం ఎన్నడూ తలచలేదు: చిట్టి ఏంచేసినా, ఏమన్నా మా కెన్నడూ ఓగు అని పించలేదు: అలా బ్రతికింది:

తాను బ్రతకడం కాదు. లోకాన్ని బ్రతికించింది:

ఉరేగే దేముడికన్నా; ఊరి రోడ్లవెంట విచ్చలవిడిగా తిరిగే చిట్టికి బుద్ధిఉన్న ప్రతివాడూ మనసులో ఎందుకు మ్రొక్కుతాడో మేం చెపితేకాని, లోకానికి తెలియదు:

యుద్ధం ముమ్మరంగా ఉన్నరోజుల్లో – కదలేపటాలం విడిసేపటాలంగా మా ఊరు, పవలూ రాత్రీ మేలుకునే ఉండేది: దండుస్టేషనులో దిగగానే, – అందుకైన అధికారులు వాళ్ళకి లెక్కప్రకారం అన్నపానీయాలకు మటుకు ఏర్పాటు చేసి, తరువాత వాళ్ళ ఖర్మానికి వాళ్ళని వదలేవాళ్ళు: మా ఊళ్ళో... మహానగరానికి అనువైన కశ్మలం త్రొక్కిడీమటుకే కాని, సదుపాయాలుమాత్రం సున్న: కొమ్ములుతిరిగిన కొన్ని నగరాల్లో ... ప్రపంచసంగ్రామంలో ప్రాణాలు అర్పించడానికి ... పొట్ట చేత్తోపుచ్చుకుని సన్నద్ధులైన వీరులకోసం, ఎడనెడ చీకటి విడుదులు అధికారులు ఏర్పాటు చేసిన వైనం గ్రంథస్థం కాకపోయినా ... అభిజ్ఞవర్గానికి ఆ విషయం కరతలామలకమే:

మా ఊళ్ళోమటుకు, దిగిన అసాములు ఆదమరవడానికి అలాటి సదుపాయం లేకపోవడంతో ... సందెపడగానే పారువేటకు తండాలు తండాలుగా బయలుదేరిన యోధులు ... ఏ చీకటిలోనో ఏ గుయ్యారంలోనో అబకు అడుగువేసి ... అడుగులోనే పడక వేసి ... తరువాత ఏమైపోయేవాళ్ళో దైవానికి ఎరుక! ఒళ్ళు విరుచుకువచ్చిన పటాలం మళ్ళీ తరలే వేళకు చచ్చి సగమైనంతహీనంగా... ముప్పాతిక మువ్వీసం జబ్బు పెట్టెల్లో పడిసాగిపోయేది: ఇది, అందరికీ తెలుసు! కాని ఎవరేం చేస్తారు? అధికారులు మట్టుకు ఎన్నింటికని దేవుల్లాడుతారు?

ఎవరికీతరంకాని ఘనకార్యం చిట్టి సాధించింది: క్రొత్తల్లో, పటాలాలు దిగుమతి అవుతున్న రోజుల్లో, ఆ ఊరా ఆఊరా నీలివార్తలు కోటాను కోట్లు పుట్టుకువచ్చినవి: ఆరవ్వంతసుఖానికి, అడమొగాలకు మొగం వాచిపోయిన మూక ... ఏమరు

పాటున ఆడదంటూ కంటబడితే ఊరికే పోనివ్వడం లేదనీ, అక్కడా అక్కడా వాళ్ళ అఘాయిత్యం మూలంగా ఎన్నో ప్రాణాలు కడకట్టిపోయినాయనీ ... మొరాయించిన కొన్ని జీవాలు రూపులేకుండా పోయినాయనీ ... ఇంత గగ్గోలుగా ఉంది. ప్రతి అడగుండె పీచు పీచుమనే రోజులవి:

సరిగ్గా ఆ తరుణంలోనే:– చిట్టి యెటో మాయమైంది. ఇక నేముందీ; వాళ్ళెవళ్లో యెగనేసుకు పోయినారనుకున్నాం: నేడో రేపో; ఆ కళేబరం ఏ కంచెలోనో ఏ కాలువగట్టు దుబ్బుల్లోనో దొరుకుతుందనుకున్నాం: చిట్టి అంతదారుణంగా అవతారం చాలించిందనుకున్నాం:

కాని; అలా జరగలేదు: చిట్టి మల్లెపూవల్లే మళ్ళీ వాళ్ళ నడుమకువచ్చింది; "ఇన్నాళ్ళూ ఏమైపోయినావ్ చిట్టీ!" అని; ఊరు...ఊరూ ఏక ... గొంతున అడిగింది: తాను ఏమైపోయిందో ఏంచేసిందో అరమరిక లేకుండా చెప్పింది చిట్టి.

ఏనుగలల్లే బండి దిగిన ఎందరో పడుచువాళ్ళు... తెల తెలవారేసరికి, యెవళ్ళో మోసుకెళ్ళి బండిలో పడవేయవలసిన స్థితికి రావడం ... చిట్టిచూసింది: దీనికి మందేమిటా అని ఆలోచించింది: అడుగు ముందుకు వేసింది:

అటూ ఇటూ మళ్లే మనుష్యులని అటకాయించింది: బ్రతిమాలింది; దేశంకోసం బ్రతకమంది; యుద్ధంలో నెగ్గి సీమ చల్లబడితే ... ఏ చిన్న దాన్నో ఏలుకొని పిల్లాపాప యెత్తవలసిన మనిషివి .... నీకు యింతలో ఈ బుద్ధి ఏమిటంది: నీవు బొమికల బొమ్మ వైపోతే; కన్నతల్లి కడుపుచేటుకదా అంది: నా మాట విను అన్నా అంది: వినని మొండి యెవరన్నా ఉంటే ... నాకు; రూకలొద్దు కోకలొద్దు: నన్నేలుకో ... నీ మనసంతా తీర్చుకో అంది!...

నదరుగానో, బెదరుగానో ... యెవడినీకాని త్రోవ తొక్కనీయకుండా అడ్డుపడింది:

"అందరూ నీమాటలువిని నీతిమంతులైనా రంటావా?" అని ఎవడో అక్కసుగా అడిగాడు: మా అందరి మనసుల్లోనూ కొరకొరలాడుతూంది ఆ ప్రశ్నే: మాతో కలసి మెలసి –, మాకోసం పెరిగిన చిట్టి ఎవళ్లో ఊరూపేరూ లేని వాళ్ళ ముందు, తన వయసంతా వలకబోస్తుందా? బావురుమంటూ వచ్చినవాడు, – ఇది బ్రతిమాలితే, – అన్నా అంటే అట్టెమారిపోయి, మడిగట్టుకుంటాడా? ఎదుటవున్న సిద్ధాన్నం చెడగొట్టు కుంటాడా?

"నీతిమంతులంటే ఏమి?" టంది చిట్టి!

"నీతి ఉన్నవాళ్లు!"

"నీతి అంటే?"

ఏం చెప్పాలో, ఎవరికీ చేతకాలేదు: కాని, చిట్టిని అదుపులో పెట్టడం ఎలా? – నీవు చేసింది, అంతమంచిపని కాదని నచ్చచెప్పడం ఎలా?

"నీ ఒక్కదానివల్లా ఏమౌతుంది?" అని అడిగామనుకో, – అది అంతకన్నా మరో పెద్దతంటా అవుతుంది: "నా ఒక్కతెవల్లా కాకపోతే – నలుగురు మంచి ఏపైన వాళ్ళను సాయం రమ్మంటాలే!" – అంటే? – ఇంటింటికిపోయి, కంటికి అనిన పడుచునల్లా నిలవేసి, "నీవిలా గోళ్ళు గిల్లుకుంటూ కూచోకపోతే, నాతోబాటు బయలుదేరరాదూ – ఆ ఒళ్ళంతా ఏం చేసుకుంటావ్? – కదులు!" ఇలా పచ్చి

పచ్చిగా రెచ్చగొడితే– ఆపడానికి బ్రహ్మతరమా? – అందుకని, – దూడూ బసవన్నలమై చెప్పిందంతా విని గ్రుడ్లనీళ్ళు కుక్కుకుని, ఊరుకున్నాం!

చిట్టికి ఎక్కడెక్కడనుంచో ఉత్తరాలు వచ్చేవి, – ఎన్నెన్నో. బంగీలు వచ్చేవి, – నగదు వచ్చేది – కాని, ఏం వచ్చినా చిట్టి ఏం చేసుకుంటుంది? ఏది వచ్చినా, వచ్చింది వచ్చినట్టుగానే కంటబడ్డవాళ్ళకల్లా పంచిపెట్టేది: ఎవరన్నా తీయించుకున్న బొమ్మలు పంపితే – అవి అందరికీ చూపిస్తూ ఆ పడుచువాడికి తనకూ ములాఖత్, – ఏం మాట్లాడుకున్నారో, – ఎలా నవ్వుకున్నారో వాడెందుకు సిగ్గుపడ్డాడో, – ఏం ఒట్టేసుకున్నాడో అన్నీ, పూసగుచ్చినట్టు చెప్పేది:–

యుద్ధం ఉన్నన్నాళ్ళూ చిట్టికి తపాలు బట్వాడా చేయడం పోస్టువాళ్ళకు నిత్యమూ గండకత్తెరే – చిట్టికి ఫలానా చిరునామా అంటూ ఎక్కడుందీ? వచ్చిన సరంజామా అంతా – అందరు పోస్టు జవాన్లూ పంచుకుని – ఏ మూల ఎదురుపడితే, అక్కడ అందిచ్చేవాళ్ళు: వ్రాత ఏమన్నాఉంటే, ఎవడిచేతన్నా చదివిస్తుంది, చదివినందుకు వాడికి, చేతనున్న వాటిలో దండిగా యిస్తుంది: పవలల్లా – పేట పేటకూ ఏదో సంబరం కాస్సేపు!–

చిట్టి, అటు యుద్ధానికీ – ఇటు ఈ ఊరికీ పుష్కలంగా సాయంచేసింది:

ఇంత చేసినందుకు – ప్రభుత్వం చిట్టి చేసిన మేలు మరచిపోలేదు: చిట్టితో మంతనాలాడిన పడుచువాళ్ళు అధికార్లతో ఏమేం చెప్పారో, చిట్టి చేసిన మేలు ఎలా వివరించారో, ఏమోగాని – మొత్తానికి, మిలిటరీ అధికారులు గూడుపుఠాణిచేసి, ప్రభుత్వానికి కనుసన్న చేశారు:

ప్రభుత్వం – చిట్టి అఖండసేవకు సమ్మానంగా, సేవా పదకాన్ని బహూకరించింది:

ప్రభుత్వం తలపెట్టిన తతంగం అంటే – ఎన్ని యొజనాల యెర్రటేపుతోనో కూడినపని; దానికో బ్రహ్మాండమైన ఈషత్ – బహిరంగసభ – జిల్లా అధికారి రావడం; లెక్చర్ చదవడం – ఇత్యాది కామాటం లక్షంత:

ఆనాడు చిట్టిని సభకు బ్రతిమాలి తీసుకురావడం – వచ్చిందాన్ని ఒకచోట కూర్చోపెట్టడం – బ్రహ్మప్రళయం అయింది: పదకం యిచ్చారు – పుచ్చుకుంది – సభ యావత్తూ అమ్మయ్య! అనుకుంది. కాని; అంతలోనే చిట్టి అందుకున్న పదకాన్ని; అగ్రాసనం పక్క ఆసనంలో కూర్చున్న అధికారి పెళ్ళాం ఒళ్ళోకి విసిరేసి – "పిల్లది అల్లా బోసిగా ఉందేం? చెరిపి చేయించి పెట్టండి! –" అని ఒడిలో ఉన్న పాప బుగ్గలు పుణికి; మళ్ళీ రోడ్డు పుచ్చుకుంది:

చిట్టిని అదమాయిండానికి యెవరి తరం? – ఇలాటి రవంత అభాసు జరగడం మూలాన్నే పదక బహూకరణ విషయం ఏ పత్రికలోనూ పడలేదు:

ఇలా బ్రతికింది చిట్టి: ఇంత ఘనంగానూ వెళ్ళి పోయింది:

–చిట్టికి ఏంజబ్బో యెవరికీ తెలియదు. యెవరూ మందివ్వలేదు: పోయినదన్నారు: బొమ్మ నెవరూ చూడకూడదు; అది .. . చిట్టి ఆఖరికోరిక అన్నారు:

అన్నారంటే ...మరెవరో కాదు; సినోరా సీతాయ్: సీతాయ్ భవనంనుంచే; ఉత్సవంగా ఊరేగించారు: నాయకులు ముందు నడచారు: ఇల్లాటి విషయాల్లో సీతాయ్ మాట; మా కాంగ్రెస్‌సంస్థ ఔదల ధరిస్తుంది:

యెవరి మొగానా; కత్తివ్రేటుకైనా నెత్తురులేదట అనాడు:

"జర్మనీవారు వచ్చి దేశం ఆక్రమించుకుని ఏదన్నా బీభత్సంచేసే అవకాశం ఉంది గనుక ... ప్రజలు యావన్మందీ; మానధనప్రాణరక్షణకు ఏ మారుమూలకేనా పోవలసిందోహో!" అని ప్రభుత్వం ఘూర్ణిల్లినప్పుడైనా ... విశాఖ పట్టణం: కాకినాడ గ్రామాలమీద; జపానులో తయారైన బాంబులు రాలినప్పుడైనా ... బ్లిట్జ్ అవిచ్ఛిన్నంగాసాగితే ... ఇంగ్లాండు ద్వీపం ఇరవైనాలుగు గంటల్లో ఆనవాలు లేకుండా పోయే అవకాశం ఉందని తోచినప్పుడన్నా ... యెవరికీ: అంటే మాలో యెవరికీ; ఇంత దుఃఖం రాలేదు: ఆకాశంక్రింద బ్రతికిన చిట్టి ... చివరకు యిలా యెందుకు అయిపోయింది? ఏనుగులు; చివరిఘడియలు వచ్చినాయని పసిగట్టినప్పుడు ... ఒంటరిగా ... యెక్కడికోపోయి ... కూలిపోతాయంటారు కాదూ? ... ఈ దిగ్గజమూ అంతే చేసిందా? ... చిట్టి; రాలి పోయిందా? ...

అన్ని గుండెలూ తరుక్కుపోయినాయ్: ... కాని, యెందుకో సీతాయ్ ఒక్కతెమాత్రం చెక్కుచెదరకుండా చిరునవ్వుతోనే ఉందట:– అందరికీ ముందు నడిచిందట – ఏమిటానవ్వు? – అని, ఎవరడుగుతారు – సీతాయ్‌ని? –

సీతాయ్ అంటే – మీకు అసలు తెలియదు: అదో పెద్దబాలశిక్ష:

★ ★ ★

# నీలమణి

ఇన్నాళ్ళకు – ఈవాళ ఉదయం అటు సూర్యుడు ఇటు పొడిచాడు:

ఇలా జరిగిందని నీవూ నేనూ, ఆశ్చర్య పడుతున్నామా? విస్తుపోయి చూస్తున్నామా? నహి! – ఒట్టుకోసం వాడుకునే వృాతప్రయోగం ఒక్కసారి, ఎందుకో నిజమైనప్పుడు – మన ఆదమరుపు పెట్టే బాధకు దరీ అంతూ అంటూ ఉండదు.

వెంకటపతి – ఈ బాధంతా – జాలితో అర్థంచేసుకున్నాడు: దైవం ఎట్టకేలకు మనమీద దయదలచాడు!

అసలు అంతేకద – నీవూ నేనూ – మనమందరం మంచి గృహస్థులం: చొక్కా, పంచా గట్టిగా మాపుతేలక ముందే – మడతలు మార్చుకునేందుకు నోచుకున్న వాళ్ళం: కాఫీహోటల్లోకి, ధీమాగా, రొమ్ము విరుచుకుని, జైత్రయాత్రకు వేసే అంగలతో ప్రవేశించి, కమ్మగాతిని, గర్రున తేన్చి – ఖంగున రూపాయితీసి, బల్లముందు వాడి మొగాన కొట్టి, యాదాలాభంగా, పెడ మొగంతో, వాడు అందించిన చిల్లర, ఎడమచేతిలో వేయించుకుని, ఆ చెయ్యి చెయ్యా అపాళంగానే, గుమ్మం మొగదల కూర్చున్న కిల్లీ దుకాణదారుడి కళ్ళముందు విప్పి – కావలసిన సరంజామా – కనుసైగతో విప్పిచెప్పి – అందిపుచ్చుకుని – కాలణా ధర్మం చేసి పోతామేమోనని; గంపెడు ఆశతో మన చుట్టూ మూగే దిక్కుమాలిన వాళ్ళకు ఒక్క కటాక్ష వీక్షణం పారేసి... ఇప్పుడు చిల్లర లేదని ... ఖచ్చితంగా చెప్పి అప్పటికీ పట్టిపల్లార్చేవాడిని అలవోకగా గద్దించి ... ఇంకా విడవకుండా అనుగమించేవాడిని – హుంకరించి ... హితబోధ చేసి ... రాజెవరి కొడుకన్నట్టు ... పురివిప్పి – నిలుచుంటాం! అలా నుంచోగలం! –

మన ముందర వెంకటపతి ... ఏపాటి? అసలు వాడు కూడా ఓమనిషేనని, లోకం ఎందుకు అనుకుంటూందో, అనుమతిస్తూందో; మన కెవరికీ నిజానికి; అర్థం కావడంలేదు కాదూ? – ఇదే; ధర్మ ప్రభుత్వమై – మనం మెసులుతూన్నదే; రవంతైనా సత్యయుగమైతే – వాడిని నాలుగు కాళ్ళమీద నడిపించవద్దూ?–

మనం పుట్టక ముందునుంచీ ... వెంకటపతి, పరమ దరిద్రుడు: కర్ణుడి కవచ కుండలాలల్లే; వీడు తల్లి గర్భంలోనుంచి ... అలా చీలికలు వాలికలతోనే పుట్టి ఉండాలి; వాడిచొక్కా జేబుకన్న మరో వ్యర్థపదార్థం సృష్టిలో ఎక్కడన్నా ఉందా? – అతగాడికి అరచెయ్యే జేబు – నీవో నేనో ఈ పీడ వదిలించేందుకు ... వాడూ వేడూ పావో – పరకో రాలిస్తే – దాన్ని తక్షణం ...వాడు ఏయిడ్లీలోకో మరుక్షణంలో వినిమయం చేసేస్తాడు ... పొగచేసేస్తాడు ...

వాడుకనబడటం భయంకరద, కంటపడితే - అడగకుండా మానడు కద ... బ్రతికున్నన్నాళ్ళూ పరగడుపే! - ఎవడు ఆరుస్తాడు ... ఎవడు తీరుస్తాడు - ఇలా అస్తమానం, నిన్నూ నన్ను పట్టుకు వేధించకపోతే ... ఏలేందుకంటే దేశాలు; ఎవడికీ ఈనాడు లేకపోతే: పోవచ్చును కాని ... సప్తద్వీపాల్లో మహారాజులాగా ఎత్తుకు తినవచ్చునే - పోడేం?

ఎలా బ్రతుకున్నాడు - మన అందరం దయతలచబట్టి అంతేకద?...

మరి, ఎందుకు బ్రతుకుతున్నాడు... తినేందుకు; తిండి లేక ... ఉండేందుకు ఉనికిలేక ... ఏ వాడన్నా; బట్టమార్చి బట్టకట్టుకునేందుకు ... మరో పంచా చొక్కా అంటూ లేక -

ఏమో; నీకూ నాకూ అర్థంకాదు! "ఏం పతులూ; ఇలా బ్రతకడంకన్న ... కాస్త ఓపికపట్టి ... కళ్ళు మూసేసుకున్నావంటే - నీకు నీబాధా తప్పుతుంది; మాకు నీపీడా వదిలిపోతుంది..." అని లక్షసార్లు మనం మనసులో విసుగుతో; అనుకున్నామే కాని; ఒక్కసారన్నా నోరువిడిచి వాడితో; అనలేకపోతున్నాం... అందుకు; మన మంచితనమే ... మన భూతదయే కారణం ... కావడానికి ఏమాత్రమూ సందేహం లేదు!...

ఏ విధానన్నా ... ఒక్క రోజన్నా; వాడిని మరచి పోదామన్నా ...ఇవాళిటికీ వెంకటపతి బెడదలేకుండా పోయింది... అని అనుకుందామన్నా - ఏదీ; ఆ సుదినం ఎంతటికీ రానిదే!...

వాడి బ్రతుకుమీద; మనకు విసుగేసిపోయింది కాని ...వాడికి; ఏమాత్రమూ ఆ యింగితం; లేందే!...

☆ ☆ ☆

నిన్నా మొన్నా...వెంకటపతి కనబడలేదు ...

...ఇప్పటికప్పుడే చూసి ...వారం దాటుతూంది ...నీకూ కనబడటం లేదు ... నాకూ కనబడటంలేదు - లేక ఏమైపోయినాడు ...?

ఆఁ... ఏమైపోతాడు అంత హఠాత్తుగా ఉన్నట్టుండి? -

జబ్బు చేసిందా...?

జబ్బు అంటూ వాడికి; ఇవాళ కొత్తగా చేయాలా? - వాడిని చూస్తేనే; ఎదుటివాడికి ఖాయిలా చేసేఅంత రోతమారితనంలో యిన్నాళ్ళనుంచీ బ్రతకడంలా? ...అలాటి వాళ్ళకు; రోగం రొష్టూ, యీ భయాలేం లేవు; ఎల్లకాలం ఉట్టికట్టుకు వూరేగుతారు!...

అయినా ...ఒకవేళ, దేహం శాశ్వతంకాదు గనుక; రాలిపోయినాడేమో? ... పోతే పోనూవచ్చు! అందులో మహావిడ్డూరం ఏముంది? ...ఎండాకాలంలో; టప; టపా; ఆగమ్మ కాకులూ...గబ్బిలాలూ ఎన్ని రాలిపోవడంలా? ... అంతే యిదీనీ!...

అంతేకాని...అలా కాదులే...ఎంత చచ్చుగా బ్రతికినా ... ఉన్నన్నాళ్ళూ...కొంచెం కుడి ఎడమగా; మనిషి క్రిందనే జమకట్టింది లోకం...కనుక; రోడ్డుప్రక్కనో; సైడ్ కాలువలోనో, ఏకుక్కో; పిల్లో బిర్రబిగిసి పడివుంటే... కాలుకు తాడుకట్టి యీడ్చి అవతల పారేస్తాం... అంతకన్న దాని కులగోత్రా లేమిటాఅంటూ అజ కనుక్కోం!

-మరి... మనిషన్న తరువాత అలాకాదే! ...ఎంత దిక్కుమాలిన పోత పోయినా - బ్రతికివుండగా - వాడిని మనం బ్రతికినవాడిక్రింద కట్టకపోయినా, తీరా ఓ ప్రాణి పోయింది అని ఖచ్చితంగా తేలినమీదట - మట్టి మట్టిలో కలిపేముందు - ఆ జీవి వూరూ పేరూ ఎలాటిదో - కొంత భోగట్టా తెలుసుకునేందుకు దర్యాప్తు చేస్తాం! ఎందుచేత నంటే - వాడు బ్రతికిఉన్నన్నాళ్ళూ దయ్యం - చచ్చిన తరువాత మనలాటి మనిషే అవునా? -

తెల్లవారి లేవగానే, పత్రిక తెరవడానికి భయం - ఏమో ఎక్కడన్నా ఆ వార్త కంట పడుతుందేమో? - "ఫలానా చోట - ఆనవాలు తెలీని మొగ కళేబరం" - అన్ని ఠాణాల్లోను దాని బొమ్మలుంటాయి - ఎవరన్నా చూసి గుర్తించేందుకు అవకాశం ఉంది!

ప్చ్! - ఎన్నాళ్ళు ఎదురుచూసినా, ఆ ఫోణెము లేక పోయె! - వెంకటపతి ఇన్నాళ్ళూ కంటపడి వేపుకు తినేవాడు ఇప్పుడు ఏమైనాడో తెలియకుండా - పీడిస్తున్నాడు! ఎలా, మనకు యీ బాధ వదిలేది? - ఏదో, ఓ చల్లని కబురు వికరంగా తెలిసేది? -

☆ ☆ ☆

అవాళ, వెంకటపతి కనబడటమేమిటి; మన ప్రాణాలన్నీ ఈ మూలనుంచి ఆ మూలకు లేచిరావడమేమిటి?

మళ్ళీ కళ్ళకు కనబడడు అనుకున్న ఘటం చూపులకు అందాడు అనే విస్మయం - విషాదం, రవంత భయం - మన కవళిక దానంతట అదే; అబినయించగలదు: కాని, ఏమని పలుకరించాలి? - ఎలా ప్రశ్నించాలి? - ప్రశ్నించామే బో -

"ఎప్పుడొచ్చావురా? -"

"నేను - ఎక్కడికి వెళ్ళాను? -"

"మరి - యిన్నాళ్ళనుంచీ ఏం చేస్తున్నావ్-"

"మీ అందరూచేసేదే-"

"అనగా-"

"బ్రతుకుతున్నాను - బట్ట కడుతున్నాను!-"

"అర్థం కావడంలేదు-"

"అయితే బ్రతకడం సుదుర్లభం -"

-ఉహూ! - ఏమిటి వీడి వాలకం? - వెర్రా! - తల పొగరా! - ఏది, పరకాయించి చూడనీ -

అరె? - వీడికి యీ ఇస్త్రీ మడతలు ఎక్కడివి? - అరెరె! వీడి చింకిరిజుట్టు; క్రాపింగ్‌గా మార్చడానికి వీలుందా? - ఇదేమిటి - వీడూ మనిషిలాగ తయారైనాడేం?, ఇంచుమించు అచ్చంగా మనం ఉన్నట్టే ఉన్నాడేం? -

-ఇన్నాళ్ళకు తీరా ఇప్పుడు పుట్టిందేం; వీడికి యీ దుర్బుద్ధి? - ఏ మహరాజో; ఈ శని వదుల్చుకునేందుకు; ఒకటో రెండో మొగాన కొట్టాడనుకుందాం: అది పొదంగా ఉంచుకుని:- ఏ పది రోజులపాటో కల్లో గంజో త్రాగకుండా ఎక్కడో యీ గుడ్డలు పడిదెకు తెచ్చుకుని ఉంటాడు - అక్కడికి ఆ సింగారం చాలనట్టు;

పనిలో పనిగా;– తల అంబష్టుడికి దర్శించుకొని ఉంటాడు – ఇలా ఆ కాసూవీసమూ క్షౌరంచేసుకుని;– మళ్ళీ యథప్రకారం తయారు!–

మునుపటికన్న తరహా మారిందాయెను – దానం మోతాదుకూడా; ఎక్కువ పడేస్తాడేమో? పరకో పాతికో, కాకుండా;– కరుకులు రాల్చమంటే – మనం ఇహ వీడిని తప్పించుకునేందుకు వూరువిడిచి పారిపోవాలి! – అందుచేత; ముందు కాళ్ళకు బంధంగా; వాడు అడగకముందే;– ఎరవేసి చూద్దాం! – కొద్దిలో సర్దుకుపోతుంది:

"ఏంరా కాఫీ త్రాగుతావా:–"

–వీడు పుట్టి బుద్ధెరిగిన తరువాత, ఎవడన్నా, ఎన్నడన్నా యింత ఆప్యాయంగా ఆహ్వానించాడా? – ఎగ్గిరి గంతేయవద్దూ!...

"ఉహూఁ. త్రాగను –"

–ఏమిటీ వింత ...ఆ గుక్కెడు వేన్నీళ్ళు కొనుక్కునేందుకు వెధవ ... బేడడబ్బులకోసం ... ఉదయం రెండు ఘళ్లూ, సాయంత్రం రెండు ఘళ్లూ ... కాళ్ళు బలపాలు కట్టేటట్టు తిరిగేవాడే ... ఎవరు కనబడుతాడా అని, అడుగడుగునా కాపేసేవాడే ... కనపడ్డవాడినల్లా దేవిరించే వాడే:– అల్లాంటివాడు ... వీడు ... ఈ వెంకటపతి ... కాఫీ యిప్పిస్తానంటే, నదురూ బెదురూ లేకుండా అక్కర్లేదని, చెప్పేరోజుకూడా వచ్చిందీ అంటే ... యిది, పచ్చికలిగాక మరేమిటి?...

"అదేమిటిరా ... కాఫీ త్రాగకపోవడ మేమిటీ?..."

"మానేశాను! ..."

"మానేస్తే ... మరిఎల్లా?..."

"ఎల్లాగో అల్లాగే వెళ్ళబుచ్చుతున్నాను ..."

"పాపం!"

"అవును పాపం: ... విసుక్కున్నా ననుకున్నా – ఎరుగున్న వాళ్ళం ... మొదటినుంచీ వాడిస్థితి ఎరుగున్నవాళ్ళం మేము దయదలచాలికాని, లోకానికేం? ... సవాలక్ష యాచకుల్లో వీడొకడు:–"

"ఏంరా, అలా కాఫీనీళ్ళన్నా లేకుండా, మాడుతూ కనబడకుండా మాయమైనావేం?"

"ఏం చేయను! రోజులు మారినయ్"

"మా రోజులు మారలేదు – ఎంత కాటకమైనా ... నీకు కాఫీకి ఎన్నడన్నా కాసిని డబ్బులు యివ్వడానికి గతిమాలే స్థితి రాములే! రా, రావోయ్! మొగమాటమెందుకూ!..."

చెయ్యి పుచ్చుకుని; వాడిని బలవంతం చెయ్యాలని, ఎందుకో మనసైంది నాకు; వీడు లోపలికి, వచ్చేపోణెంలో లేడు అని అంతర్వాణి మనకు, నికరంగా అభయం ఇస్తూంది: అందువల్ల అంత ధైర్యంగా పిలిచాను;

ఉహూఁ!... వాడు రానన్నాడు!...

రాకపోతే; నామీద ఒట్టు: అందాం అనేంతవరకూ వచ్చాను గాని ... తీరా నోరు జారిం తరువాత: నన్ను అనుగ్రహించడానికో అన్నట్టు వాడు వెంట వేంచేసి విరుచుకు తిన్నాడా అంటే ... అనక పస్తాయించి లాభంలేదు:

మెత్తపడతాడేమోనని భయంవేసింది ... అందుచేత - సరే పోన్లేరా; నీ యిష్టం! - అని నిష్టూరం వేశాను:

వెంకటపతి తనలో తాను నవ్వుకున్నాడు -

"కాఫీ వద్దకపోతే మానె; ఒక్క సిగరెట్ వేసుకో!"

వాడు పెదవి విరిచాడు..."అదీ జిలాయేరా అబ్బీ! ..." అంటూ!

"ఆ!" అంతకుమించి మరో అక్షరం నాలో పెగిలిరాలేదు...

"మరేరా; నాన్నా - పెద్దవాణ్ణవుతున్నానా ఆ రోజు కారోజు -! అస్తమానం కాఫీసిగరెట్లూ పోసిపోసి!... యీతిత్తీ - ఆతిత్తీ, దెబ్బతినేట్టు ఉన్నాయి - కొంతకాలం వాటికి స్వస్తిచెప్పడం మంచిదని - యిదీ నాకుపుట్టిన బుద్ధి కాదనుకో - మొత్తానికి అలానే నాకూ తోచింది - అంచేత, ఏవో పళ్ళూ, పాలూ, గ్లూకోజ్, ఓవల్ టిన్ - యిలా లఘువుగా పోనిస్తున్నాను! -"

"ఉం-పోయిరా? లోపలికి - ఆకలేస్తున్నట్టున్నావ్ -" అంటూ, నన్ను గ్రుక్కతిప్పకోనీకుండా - నిదానంగా నిర్లక్ష్యంగా నడిచి వెళ్ళిపోయినాడు -

వాడు అన్నమాటలు నిజమేమో అన్నంత భయం వేసింది: గుండెలు ఎగిరెగిరి పడ్డాయి. తలా నొసలూ బిర్ర బిగుసుకుపోయినాయి: ఒళ్ళంతా వూదరపెట్టింది.

కాని - కాని - ఇదొక తరహా పిచ్చేమో, యిలా, పైత్యం ముమ్మరంగా ప్రకోపిస్తే - అన్నం నీళ్ళూ ముట్టకుండానే - ఆ పెచ్చు దిగేంతవరకూ; వెర్రి బలంగానే ఉంటారు! - అంతే అయివుండాలి - వాడు చూపూ, విసురూ, ఆమాట విరుపూ అంతా - ధోరణి అలాగేఉంది; నిజంగా ఇది పిచ్చే! -

అమ్మయ్య - ఇప్పటికి మనసుకుదుటపడ్డది -

-ధర్మదాతలం అందరం కూడబలుక్కున్నాం! - సులువుగా ఏకాభిప్రాయానికి వచ్చాం! - ఇక ఆనాటినుంచీ; వాడికోసం వేట ప్రారంభించాం! ఏ ఓ ఘటో అరగంటో వాడు తగిలితే, ఎంత బాగుండును! - వెర్రివాడి భరతం పట్టొచ్చు: వాగించి - ఆ ధోరణికి మనం ఆనందించవచ్చు! - ఇంతకాలంనుంచీ తప్పనిసరిగా, వినోదంపన్ను చెల్లగడుతూన్నందుకు; ఫలం ఇహానుంచన్నా అనుభవించవద్దూ? - కాని ఎంత గాలించిచూచినా; వెంకటపతి చిక్కందే!

వెర్రివాడు కనుక; జనం విశేషంగా ఉండే ప్రదేశాలన్నీ పరిహరించి - ఒంటరిగా ఎక్కడన్నా ఆత్మానుసంధానంలోపడి - మమ్మల్నీ తన్నూ మరిచిపోయినాడేమో అని; మా నగర పరిసరాలైన సుందర నిర్జన ప్రదేశాలన్నీ వస్త్రఘాలితం చేశాం - కాని ఒక్క అణువైనా; వాడి ఆచోకీ అందలేదు.

ఇక మరి ఎక్కడ వెదకం! ఎక్కడ ఉన్నాడని వెదకం! - ఈ అన్వేషణావస్థనే - ఆదుర్దానే - వైష్ణవులు, వాళ్ళ పరిభాషలో ఏదో ముద్దుపేరున పిలుచుకుంటారు!

కాని; మేం మట్టుకు వెర్రి ఎక్కేంతస్థితికి వచ్చి అంతటితో మా అదృష్టం కొద్దీ తెప్పరిల్లి - ఇక వాడి ప్రసక్తే తలపెట్టడం మానేశాం! - జీవితానికి ఇద్దరినీ; వెంకటపతి మళ్ళీ మనకు తగలడం అనేది సంభవం కాకపోవచ్చునని; మనసుకు సంభాషించుకున్నాం - కష్టగా! - మాకూ వాడికీ; అంతవరకే రుణమా?-

☆ ☆ ☆

అవాళ, సూర్యోదయానంతరం—

హోటల్లో యథాస్థానంలో కూర్చుని; ఇడ్డెన్లు కబళిస్తున్నాను:

యథాస్థానమంటే – నాకు ఎందుచేతనో ఆడవాళ్ళ బల్ల దగ్గిర చదికిలబడడం అలవాటైంది – అది మరీ వేకువ కనుక; స్త్రీజనం మేతకు తరలి రాదు – అందుచేతనే కాబోలు హోటలు ఆసాములు నన్ను; అక్కడకాదని మందలించకుండా చూసి చూడనట్టు వూరుకుంటున్నారు – ఒకవేళ, ఏ ముగుద అయినా; రావడం అటటూ తటస్థించినా; నన్ను మీరిన వయసుదైతే; నేను అక్కడలేనట్టు; సరసనే చతికిలబడుతుంది: మీరని పడుచైతే నిర్లక్ష్యంగా; మెడరిక్కించి, మరోస్థావరం ఆశ్రయిస్తుంది.

ఇది అంతా కేవలం అప్రస్తుత ప్రశంస అనుకునేరు: కాదు; కథకు గంపెడంత సంబంధం ఉంది కనుకనే.

—సరే; నేను అలా తలవంచుకు భుజిస్తున్నాను – ముగిసేలోపుగా – ఆవిడ వచ్చి; నా ఎదురుగుండా కూర్చుంది; నేను; అదరిపాటున తలెత్తి చూస్తే; పరకాయింపుగా చిరునవ్వు నవ్వింది – అతి మామూలుగా పలుకరించింది:—

"ఏమండి! – మీ స్నేహితులు ఏరీ?"

—ఎవరా అన్నట్టు చూశాను...

"వెంకటపతిగారండీ! సాధారణంగా ఈ వేళకు మీరందరూ ఇక్కడ కలుసుకుంటారటగా!—"

"ఏమో – కనబడలేదు!" అని ఉక్కిరి బిక్కిరిగా అన్నాను...

ఆవిడ నవ్వుతూ... కాఫీ త్రాగివేస్తూ ... 'ఉంటానన్నారే ... తప్పకుండా ...' అని తనలో తాను అనుకుంటున్నట్టు బిగ్గరగా అనేసి ... నా తాలూకుబిల్లుకూడా, కుర్రవాడి చేతులో నుంచి కముచుకుని ... నన్ను మందలింపుగా ఒక్క చూపు చూసి ... విసురుగా వెళ్ళిపోయింది: నేను ఏమీ అనలేక; లోలోపల; కుతకుతలాడుతూ; తలవంచుకుని ఆవిడ వెనువెంటనే బయటికి నడచి వచ్చింది ... వచ్చిందంటే ... ఈ కాయం!...

ఆవిడ; ఠీవిగా ... కారెక్కింది ... కారు సాగిపోతూంటే నన్నుచూసి ... వెళుతున్నా నన్నట్టు అద్దం మాటౌతూ నవ్వింది...

ఎందుకు నన్నల్లా అకారణంగా పరాభవించింది?...

ఆవిడ ఎవరో ... నే నెరుగున్నాను ... మీరెరుగున్నారు. మన రాయళ్ళందరూ అడియాసగా కలలుకనే ఆంధ్ర సర్వస్వమంత గ్రంధసాంగురాలు...నాకూ ఆవిడకూ ఏమిటి పేచీ! కలనైనన్ మెలకువ వేళలనైన... ఎన్నడూ; మా కత్తులు రాపాడలేదే?...

వెంకటపతి పేరెత్తింది; ఎందుకు? ... అన్నీ మానుకుని, వీడు ఇప్పుడు అక్కడ కొలువుకు కుదిరాడా? ... అయితే మాత్రం; వాడి కర్మం వాడిది ...నన్ను కవ్వించవలసిన అగత్యం ఏమిటి? ... వాడు కనపడితే ... నిల వెయ్యనూ?...

మనసులో అనుకుంటూండగానే; అదుగో; వాడూ ప్రత్యక్షమైనాడు! ...కనీ కనపడటంతోనే ... ఏమిటిరా భడవా! ఈ ఆగడం?...అంటూ సూత్రప్రాయంగా ఎత్తుకుని; దులిపివదిలి పెట్టాను. వాళ్ళిద్దరినీ కలిపి ... నానోటకి వచ్చినట్టల్లా అన్నాను: వాడు; మళ్ళీ జన్మజన్మాలకు తల ఎత్తుకునేందుకు వీలులేకుండా గదిమాను:

అన్ని దులుపులూ దులపనిచ్చి – వాడు వీసం అన్నా తొణకకుండా అంటాడు కదా – "ఏంరా భాయ్! ఎందుకింత తామసం నీకు? – మనలో మనకు ఎలాటి అరమరికలూ లేవుకదా? – నా బిల్లు ఎన్ని లక్షలసార్లు, నీవు పుచ్చుకున్నావ్?–నేనేమన్నా గింజుకున్నానా? – ఆవిడ తీసుకుంటే–"

"ఆవిడ అంతరమేమిటి – నా అంతరమేమిటి? –" అని మాట తెగేసాను.

"ఏమీలేదు – మీ యిద్దరూ నాకు ఒకటే –"

"ఆ మాట నాకు, కమ్చీ తగిలినట్టు తగిలింది – అది కనిపెట్టి, వాడు భుజంమీద చేయివేసి, సర్ది చెప్పాడు – అన్నట్టు – మే మిద్దరం పెళ్ళిచేసుకున్నట్టు – నీకు చెప్పలేదు కదూ? – నేను, వెనువెంటనే. నిర్ఘాంతపోయినాను."

"విన్నా? – ఏం చూసి చేసుకుందిరా? –" నా మనశ్శాంతికోసం పగలబడి నవ్వాను –

"నేను ఆ ప్రశ్న అడగలేదురా భాయీ! – చేసుకుంటానంది – సరే నీ యిష్టం అన్నాను – నేను ఆ యింటి వాణ్ణయినాను –"

–ఇదంతా గట్టి బుకాయింపేనని నానమ్మకం – కాని, నిజమేనేమోనని, ఏదో దిక్కుదిక్కుగా ఉంది – నిజమే అయినా, నేను నమ్మతలచుకోలేదు –

"రేపు సాయంకాలం టీకి రావోయ్" అని వెన్ను ఛళ్ళుమని చరచి వెంకటపతి మహా పని ఉన్నవాడిలా వెళ్ళిపోయినాడు –

"ఉత్తరక్షణంలో యీకబురు కార్చిచ్చల్లే వూళ్ళో అంటుకున్నది – నేనే అంటించాను – ఎవడు చూసినా నమ్మననేవాడే – విడ్డూరంగా మరొకడికి, యీ విషయం చిలవలు పలవలుగా, వివరించేవాడే! –"

ఎవడికి వాడు – యీ హంశంలో ఉన్న కిటు కేమిటో తేల్చుకునేందుకు వ్యూహోగానం ప్రారంభించాడు – కాని, ఎన్ని విధాల ఉల్టాసీదాచేసి చూసినా, చిక్కు చిక్కుగానే ఉంది.

ఆవిడ కేమన్నా పిచ్చి ఎక్కిందా? – అసంభవం!–

ఏం తక్కువని, ఈవిబ్రాసిని కట్టుకుంది? – ఇంత కాలంనుంచి, దేశం ఏలుతూందే?

పరే వాళ్ళ యింటికి వెళ్ళి చూస్తే – ఈ భాగోతమేమిటో అర్థమౌతుందిగా!...

–వెంకటపతి కారు పంపించాడు: టీకి వెళ్ళాను ... ఇంటినౌకర్లందరూ, వాడివి అయ్యగారంటూ అతి గౌరవం చేస్తున్నారు: ఆవిడ ... టీకు ...టాకు ఏమీ లేకుండా, అతి అమాయకపు ముత్తయిదువల్లే ... ముసిముసి నవ్వుతూ, పది అడిగితే, ఒక్కటి అతిముక్తసరిగా సమాధానం చెపుతూ ... మగడంటే ఎంత అణకువతో, వినయవిధేయతలతో ... మెలగింది...వెంకటపతికూడా...ఏమీ ఎబ్బెట్టులేకుండా...ఎంతకాలంనుంచో కాపురంచేస్తున్న సరిపాత ...గృహస్థల్లే...పుటకతోనే ఇంత ఐశ్వర్యం, ఇంత ఠీవి అలవాటైనవాడల్లే అనిపించాడు ... ఎవరూ అంతు చిక్కనీయలేదు –

చివరికి, ఇక మనసు పట్టలేక ... తెగించి, ఆవిడను అడిగాను ... నవ్వి వూరుకుంది ... ఆ నవ్వు సాంతం వినడానికి నాకు భయం వేసింది. ... ఇంకా అక్కడ ఒక్కనిమిషం ఉండలేక వచ్చేశాను –

...వెంకటపతీ ... ఆవిడా కనపడుతారేమోనని ... కొన్నాళ్ళు వీధిలోకి రావడం మానేశాను...

...నేనేకాదు, మాదృశులందరికీ ... ఇదే గ్రహచారం! ... అందరం పోగై, మనస్సులో ... మనస్సులో పిసుక్కునేవాళ్ళం ... ఆవిడ దురదృష్టానికి ఆప్యాయనంగా వాపోయేవాళ్ళం ... ఈ దాంపత్యం, మూడునాళ్ళ పట్టపగలేకాని ... నిలవబోయిందా అని, వూరడిల్లేవాళ్ళం...

...ఆ శుభ ముహూర్తంకోసమే, నిమిషాలు; యుగాలుగా పరిగణించుకుంటూ గడిపాము – కాని; రోజులు గడుస్తున్నాయే కాని ... వాడి రేఖ మారందే! ...

ఎక్కడ చూద్దామన్నా ... వాళ్ళిద్దరే ప్రత్యక్షం ... చిలకా గోరింకలకన్నా ఉండదు అంత అన్యోన్యం ... ఇదంతా ఆ వెర్రిబాగులది తెచ్చిపెట్టుకున్న మోజు...వాడి గ్రహబలం –

వాళ్ళను చూద్దామంటే చచ్చినచావుగా ఉంటూంది... అగర్భ శ్రీమంతుడల్లే... డబ్బు కాళ్ళా చేతులా విరజిమ్ముతాడు ...మొన్న మటుకు మొన్న; మా మనుమరాలిని బుజ్జగించడానికి? అలా షికారుగా సముద్రం ఒడ్డుకు వెళుదును కదా...అక్కడ వీళ్ళు తయారు!... చూసీ చూడటంతోనే పిల్లదాన్ని ఆవిడ చంకనువేసుకుంది... వెంకటపతి నన్ను నెత్తి కెక్కించుకున్నంత హంగామా చేశాడు: ఓ పట్టాన క్రిందికి దించందే!–

పిల్ల దాన్ని బులిబుచ్చికం చేసి; అవీ ఇవీ కొనిపెట్టి యిట్టె నిమిషంలో మప్పకుంది... అది ఆవిడకంఠానికి చుట్టుకుని దిగ్గనంటుందే... చివరకు; ఓ ప్రొద్దువేళకు కారులో ఎక్కించుకుని; నాలుగుబజార్లూ తిప్పి; కనిపించిన బొమ్మా బొటిగా అల్లా కొనిపెడుతూ: మేటుడు సామానుతో; మమ్మల్ని ఇంటిదగ్గర దిగవిడిచి చక్కాపోయినారు... నేనేమో దుబారాగా దుకాణాలన్నీ కొనుక్కువచ్చానని...పిల్లదాని ముత్తవతల్లి ... యిల్లు తీసి పందిరివేసినంత పని చేసింది: అదంతా మన ప్రయోజకత్వం కాదు... సంభావన వచ్చిన బాపతు అని చెప్పి ... పిల్ల దానిచేత సాక్ష్యం చెప్పించి ఎలాగో మాటదక్కించుకున్నాను... ఆ పూటకు:

ఇదొక్కటేకాదు – వాళ్ళు కంటపడ్డారాఅంటే, ఇలాగే దినదిన గండం –

నన్నొక్కడినే కాదు – కనబడ్డ స్నేహితుణ్ణల్లా వెంకటపతీ, ఆవిడ కలిసి యిలాగే వంచనచేయడం సాగించారు: సిరి అంతా మా ముందు వలకబోసేవారు – కసి తీర్చుకుంటున్నట్టు! అందరం శతవిధాల – వాడిమర్యాదకు అందకుండా తప్పించుకునేందుకు యత్నంచేసేవాళ్ళమే, కాని ఎప్పుడో ఒకప్పుడు చిక్కుతూనే వచ్చాం – ఈ నాటకానికి అంతు ఎన్నటికో తెలియలేదు.

అయితే, ఎల్లకాలం యిల్లాగే ఉండవచ్చారా – ఎప్పటికో అప్పటికీ ఆవిడ తెప్పరిల్లి చేసిన తెలివితక్కువ పనికి రోసి, వీడిని తన్ని తగిలెయ్యదా – అనే మా ధైర్యం ...

–దైవం మమ్మల్ని చల్లగా చూడబట్టి – చివరకు అలాగే జరిగింది – ఒకనాడు ప్రాతఃకాలంలో, వెంకటపతి మా కన్నులపండువగా మామూలు చింకిరితనపు పోడిమితో సాక్షాత్కరించాడు – చూసీ చూడగానే, ఏనుగు నెక్కినంత సంతోషం వచ్చి –

"ఏంరా! ఇలా ఉన్నావేం?" అని మా గొంతులన్నీ ఏకంగా ప్రశ్నించాయి!–

వెంకటపతి, ఎంతో జాలి పడుతూన్నట్టు..."మీకోసమేరా" అన్నాడు.!-

ఎవడికి వాడికే ఆ జవాబులో ఏదో మెలిక, పెంకెతనం ఉన్నట్టే అనిపించింది కాని, సరిసుగా అర్థం కాలేదు -

అంటే-

"మామూలుగానే ఉన్నాను!" - మేమేమో ఇన్నాళ్ళూ పీడకలలు కన్నట్టూ ... తానేమీ ఎరుగనట్టూ ... ఆ గొంతు!-

"మరి, ఇన్నాళ్ళ నుంచీ ఏలుతూన్న రాజ్యం ఏమైందిరా -"

"రాజ్యం చల్లగానే ఉంది ... కాని, రాజు మాత్రం, ప్రజల యోగక్షేమ నిమిత్తం గద్దె దిగి, మళ్ళీ కాలినడకలోకి వచ్చాడు -" వాడి మాటలో చక్రవర్తీఠీవి వుంది, - వాడి మాటలో-, మేము అంతకుముందు ఒరసుకోని వాడి తేలుతూంది -

"మీకోసమేరా - మీ అందరికోసమేరా - నేను మళ్లీ యీ స్థితికి వచ్చాను! - నా ఒక్కడు సుఖం చూసుకుంటే - మీ అందరూ మంచం ఎక్కేట్టున్నారు -"

"ఇన్నాళ్ళనుంచీ, కాసీకోసం, మిమ్మల్ని దేవిరిస్తూ, మీరు కనికరించందే ఒకపూట గడవని యీ వెధవాయ్, - మిమ్మల్ని వెక్కిరించినట్టు - మీ ధర్మగుణాన్ని కాలదన్నినట్టు - తగుదునమ్మా అని, తానూ నేటికి ఓ మనిషల్లే తయారై - మీ బిచ్చం ఆశించకుండా బ్రతకడం - మీకు తలవంపులు కాదూ! నే నిలా సుఖంగా ఉంటే - అది మీకు రంపకోత కాదూ - భరించగలరా - బ్రతకగలరా? -"

"నా ఒక్కటె సుఖం ఏ మొచ్చె - ఇన్ని ప్రాణాలు నిలపడం మేలుకాదూ? - అందుచేత, అకారణంగా సంప్రాప్తించిన సిరికి - గట్టిగా ఆలోచించి - మోకాలు అడ్డేశాను - మళ్ళీ ...మీ తల్లికడుపు చల్లగా - మీ కృపకు పాత్రుణ్ణయినాను - ఇక ఎన్నటికీ మీ దయకుమీరి బ్రతకనని అభయమిస్తున్నాను - ఇక గుండెలమీద చేతులు వేసుకుని హాయిగా నిద్రపొండి!-"

-వెంకటపతి ఇలా మనవిచేయడం, కొరడా ఝుళిపించి నట్టయింది -

ఇదేమిటి - మళ్ళీ వీడు యీ ధోరణిలోకి వచ్చాడు - ఆవిడకు మొగం మొత్తి - వీడిని తన్ని తగిలేసిందా? లేక పోతే - యీ వెర్రివాడే అన్నంతపనీ చేశాడా? ఇద్దరు వెర్రివాళ్ళూ, ఎవళ్ళకి వాళ్ళే తెప్పరిల్లి, కళ్ళు తెరిచి, చూసుకున్నారా? అసలు ఎలా తంటసమైంతో, - ఎందుకు విడిపోయినారో...వీడిచేత పలికించడం ఎలా;-

"ఏంరా, మరి?-"

తెప్పరిల్లి, పలుకరిద్దా మనుకుంటూండగనే - వాడు ఎటో మాయమైనాడు -

కాని - ఎక్కడికి పోతాడు? - వాడు చెప్పిన మాటే నిజమయితే మళ్ళీ మనపాల పడ్డట్టే కదా? - ఇక ... ఇప్పుడెక్కడికి పోతాడు? - మొరాయింపుకైనా, ఎన్నాళ్ళని పస్తు ఉంటాడు? - అదేకదూ, మనధైర్యం-!

★ ★ ★

# కామందకి

"చూడండి! - ఇల్లా చూడండి - ఈ దిప్పకాయ ఏం చేస్తున్నాడో!" అంటూ మా అమ్మమ్మ, పసివాడిని చంకనేసుకువచ్చి, ముసిముసి నవ్వులతో తాతగారిముందు పారాడవేసింది:

"ఏం ఏంచేస్తున్నాడేం? -" బవిరిగడ్డంలో తాతగారి పెదవులు కదిలినవి: అమ్మమ్మ అందుకు సమాధానం చెప్పకుండా, ఏభై యేళ్ళనాటి కులుకుతో, వయ్యారంగా ఆయన వంక చూసింది -

"ఎక్కడికి పోతాయ్! - అవేగుణాలు ... మీ మునిమనుమడు కాదూ?" అంటూ, నవ్వుకుంటూ, నిష్క్రమించింది:

నేను పాపణ్ణి అందుకుని బుగ్గలు పుణుకుతూ - "ఏం చేశావు నాన్నా!" అన్నాను:

తాతగారు అందుకున్నారు - "ఏదో చేసి ఉంటాడని, - మీ అమ్మమ్మ మాట ప్రమాణం: ఏమిటో వివరించకుండా, ముసిముసి నవ్వుల వయ్యారిగా, అంత పండు ముత్తైదువా, అట్టే మారిందంటే - అదేదో తప్పకుండా మగసిరి అయి వుండాలిరా నాయనా! - అయినా ...మరోసారి బరిమీదికి వదిలిచూడు, - చూద్దాం!"

పాపణ్ణి విడిచాను. వాడు గుమ్మడిపండల్లే గుమ్మం దొర్లుకుపోయి - లోపలి సావడిలో ... మా చెల్లెలు కూతురు వడసారం పడి యీాడుది-నిదురపోతూంటే ...పక్కనుజేరి, - దాన్ని లేపి - యిద్దరూ కలిసి కేరింతలౌతున్నారు...

ఇంకా, ఏడాదన్నా వెళ్ళలేదు, అప్పుడే వీడికి ఈ బుద్ధులా? - నేనో అడుగు ముందుకువేసి, గదమాయించాను: వాడు, నా వంక చూసి, కళ్ళుచికిలించి... మళ్ళీ తనధ్యాసలో తాను ఉన్నాడు:

ఒక్క గుంజు గుంజుదామన్నంత రోషం వచ్చింది - తాతయ్య నన్ను ఆపారు...

"వాడు, నీమాట వినలేదనా, నీకు అంత అహంకారం?"

"నీ మాటమీద - నీకు గురిఉండచ్చు, కాని అవతలివాడు నీకొడుకైతే మాత్రం - అంత లక్ష్యమూ ఉండితీరాలనీ ఏమిటా హాజం!..."

పసివాడా? - బ్రహ్మవేత్తలందరూ పసివాళ్లే తండ్రిని ఎదిరించి ధర్మరక్ష చేసినవాళ్లే - వాళ్ళకు తెలియని మర్మాలు ఏముంటాయోయ్!-

వెనుకటి కథ - యిద్దరం కలసి చూద్దామా?...

మంచు చినుకులు క్రిక్కిరిసిన ఒరపిడితో, సున్నపి - గరుకుగా వుంది, అనంత - అయోమయం.

అపూర్వ వర్ణాలు, శబలించే, పరివేషం, ఆత్మప్రదక్షిణంగా, స్పందించుతూంది:

రంగు రంగులన్నీ, చిరునవ్వులై ... కింకిణి కిణకిణలై, – పాయలు పాయలుగా, వాట్యం చేస్తున్నవి: ఉషాదేవి, బాల భానుడికి, వయ్యారంగా స్వాగతం యిస్తున్నది...

వేయి వెలుగుల వాడితో, సప్తాశ్వాలూ ఒకటే అలగా పరవటించినవి: వెలుగు, ఫెటేలుమని, వెల్లివిరిసింది –

కణకణ వడపోతకు – మేఘాలన్నీ, – హెచ్చు తగ్గులుగా ముందుకు కమ్ముకున్నవి: ఆశ్రమం మీదికి, – వెల్లని చల్లదనం ఏకధారగా కురుస్తున్నది:

అది, – ఆశ్రమం: మహర్షి ఉద్దాలకుడి ఆశ్రమం:

ఉద్గీథంగా, హోమ ధూమం – అలసవర్తులంగా, – పవమానుడి బాసటతో, ప్రసరించుతూన్నది:

అది ఆశ్రమం: అంతటా, వేడీలేదు – క్రీనీడా లేదు.–

కలల బరువంతా ఝళిపించి, లేడి పిల్ల, లేచి నిలుచున్నది... అడుగు ముందుకు వేస్తున్నది ...గోముగా వువ్వెత్తున పెరిగిన పసిరిక, – ఈ వాలుకు వంగి లేత లేత గరిక పోచలను, ఆకలికి అందిస్తున్నది: కాని, లేడిపిల్ల, అటూ ఇటూ నోరు మెదపకుండా:–

మందారాల చాయను, మ్రాగన్నుగా వున్న అడుపులి మీదికి, చెంగున దుమికింది: గిట్టలతో తర్జన భర్జన చేసింది; ముట్టెతో చక్కిలిగిలి పెట్టింది: అడుపులి, నిదానంగా, తల్లి అల్లే, పడక సరిచేసుకుని లేడిపిల్లకు కడుపు నిండించింది...

తల్లి, ప్రాతస్సంధ్యను వుపాసించేందుకు విహాయసంలో ఎటో తేలుతూంటే – పిల్ల పిచ్చుక, నడలు అలవడుతూన్న వుబలాటంతో, – కులాయం అంచునుంచి తొంగిచూడపోయి – కిచకిచగా, క్రిందకు రాలిపోయింది: నేలను కాలూనే దిటవులేదు, రెక్కలకు సత్తువలేదు. అటూ ఇటూ, మెసలి, మసలి – అక్కడే ముద్దకట్టుకు పడివున్నది...

అదిగో – ఆ మల్లె పొదచాలులో సూర్యనమస్కారాలు చేస్తూన్న, గోధమవన్నెనాగు – కర్మసాక్షికి కడసారి ప్రణామం చేసి – ఒక్క బుసలో, ఇక్కడికి సాగింది: పుణుకుతూన్నట్లు ఊపిరి బిగబట్టి ఊదుతూ, పిచ్చికపిల్లను సేదతీర్చడానికి యత్నిస్తూన్నది:

కాని – ఎంతకూ అది కోలుకోవడంలేదు ... ఇది అలసిపోతూన్నట్టు వుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా, తోకదగ్గిర నుంచీ, అక్కళించుకు పోతూంది: నాగు, ఎంతో అలసింది: ఎంతో అలసింది:

–ఎక్కడనుంచో వాలింది, గరుడపక్షి: కిరణమల్లే దూసుకుంటూవచ్చి ... అల్లంత ఎత్తున నిల్చిపోయింది: రెక్కలు అల్లార్చుతూ నాగుకు ఓపిక పోస్తున్నది.

–పువ్వులు రువ్వినట్టుగా, మూగినవి గువ్వలూ పావురాలూ – ఆపైన చాందినీగా: కువకువగా చూసి అక్కడ నిలువకుండా పోయినవి:

అల్లంత మలుపులో – గున్న మామిడితో, మారాం చేస్తూ నిలుచున్నాడు, పసిపాపడు: కొమ్మలన్నీ ముందుకు వంగి – అందుకోమని కవ్విస్తూన్నవి: దోరతనం మురిపిస్తూన్నవి పాపడైతే – ఏ పండూ అంటుముట్టలేదు. అన్నింటికీ ఒక్కటే సమాధానంగా, తల ఊగించాడు: కొమ్మలన్నీ వెక్కి – వెక్కి, వెనుకకు తగ్గిపోయినవి:

మా రాకైనా లేని, చిటారు కొమ్మ అందుబాటుగా ముందుకువాలింది. అడుగకముందే అరమ్రగ్గని పండు, దోసిటిలో రాల్చి ... వెంటనే అన్నింటికన్నా మిన్నగా తల ఎత్తుకుంది:

ఇంకా ... దోసిటిలో పండు దోసిటిలోనే వుంది. గువ్వలూ పావురాలు, కువకువగా పాపడిమీద వ్రాలినవి: ఒక పావురం చెవిదగ్గిరచేరి ... ఒక్క గుక్కలో ... అంతా చెప్పింది ... పాపడు అడుగు ముందుకు వేసినాడు: గువ్వలూ, ఇటు ...ఇటు అంటూ దారితీసినవి...

పిచ్చిక పిల్లకు రెక్క రవంత ఆడించే సత్తువ వచ్చింది. నాగు, గ్రుక్క తిప్పుకున్నది ... గరుడపక్షి ...వీళ్ళను చూసి ... ఎత్తుకు తప్పుకున్నది:

పాపడిచేతిలో పండు ... పావురాలు రెక్కలమీద అందుకున్నవి: పిచ్చికపిల్ల, పాపడి, అరచేతిలో ఒదుగుతూ – చేసిన తప్పుకు, సిగ్గుపడ్డది. బ్రతిమాలుతూ ... చంచువు, నంద్ర శిఖరంమీద; పదను తీర్చుకున్నది ... పాపడు; చేయి డోలికగా కదల్చి; బుజ్జగించాడు. గువ్వలు: ననలన్నీ ఏర్చి గూటిలో, మెత్తదనం సరిచేసినవి. పిచ్చికపిల్ల, లేతపానుపు మీద ... అలవోకగా, ఒరిగింది...

పాపడు చేరువకాగానే, అన్నీ కలసి నవ్వినవి తల వంచుకుని ఆశ్రమంలోకి వెళుతున్నాడు...

"అన్నా!" అని చీరింది, చిలుక ... తలెత్తి ఆ వంక చూశాడు; చేతులో పండువంక తలవిసిరింది, మరపు మరచిపోయి ... చేయిజాచాడు: చేవచూసి, పుటుక్కుమనిపించి, ఒక ముక్క పాపడికి అందించింది. ఏమేమో ... తోటి చిలుకకు చెప్పినట్టు చెప్పింది. రెండు గొంతులూ నవ్వుకున్నాయి.

ఆ పండు తునక అమ్మకు అందివ్వాలి ... అమ్మ ఎక్కడుంది?...

అతిథి పూజకు సంభారాలు అమర్చడంలో సతమత మౌతూంది. ఈ వంక చూసేందుకన్నా తీరికలేదు... ఊహుఁ... అతిథిపూజ కానిదీ ప్రాశన చేయరాదు...

ఎవరా అతిథి?

ఎవరో మహర్షి!

అమ్మకు అక్కరలేని పండు, చిలక ఏం చేసుకుంటుంది... పైకి విసిరివేశాడు ... చిటారుకొమ్మ అందుకోకుండా ఒత్తిగిలింది ... పండు. వెలుగు రాచుకుంటూ దొర్లిపోయి ... చంద్రమండలమైంది ... చుక్కలు సమశ్రుతిలో ముఖరితంగా మెరుస్తూన్నవి...

అతిథి వేంచేశాడు:

ఆశ్రమవాటిని అంటి పరవళ్ళుయ్యే సెలయేరు పాయ మలచి ... అతిథికి; అడుగులకు మడుగులొత్తింది – తీవెకో పూవు; పూవుకో రేక ... సేనలుగా ; కురిసినవి: వనస్పతులు అతిథిని కళ్ళకు అద్దుకున్నవి

మహర్షులిద్దరూ అభిముఖులై ... మనో అనుసంధానంగా కుశలమడిగికొన్నారు:

పాపడు తన; పసితనం మరచిపోయి... సంప్రదాయం అవగతం చేసుకుంటున్నాడు – అతిథి సత్కారక్రమం ముగియగానే ... అమ్మచంక నెక్కవచ్చు ననుకున్నాడు...

తల్లి యిటేవస్తూంది: తనవైపే! – తనను లాలించేందుకే! ...పసికందు,

బారసాచుకుని; వుబలాటంతో; ముద్దులుకుడుస్తూ గునగునమంటున్నాడు. కాని ...

ఇంటికి వచ్చిన అతిథి; అమాంతం తల్లికి; బిడ్డకూ అడ్డంవచ్చి... ఒడిసి; ఆ యిల్లాలి చెయిపట్టుకున్నాడు. ఒంటరితనం వైపుకులాక్కుంటున్నాడు.

పాపడూ గువ్వలూ ... ఆశ్రమం పచ్చదనంలోకి హాయిగా చెల్లా చెదరైనారు:

పిచ్చిక పిల్లపాటు; తల్లికి; గాలి అల ఒకటి ; కబురు చెప్పింది; తల్లి కిక్కురుమనలేదు:

"ఆశ్రమవాటిలో పతనమేటి, వెర్రిదానా!" అని గాలి అమాయకత్వానికి తనలో నవ్వుకున్నది:

మరో అల, ఇంతలో, పిల్ల కిలకను, తల్లికి నివేదించింది:

తల్లి, ఆ అలమీదనే ఆశ్రమ ముఖమైంది: పచ్చని నీడల పరవడిలోవున్న, పాపడి చెంగటికి లోగి ... రెక్కల అంచులతో, దీవెనగా చెక్కిలి పుణికి ... ఒంటి రెక్కమీద, పైకి ఎగిరింది –

పాపడి మనసు చేసిన ఘనకార్యానికి పొంగిపోయింది; తండ్రికి తెలిస్తే – ఎంత చక్కన!–

మర్రిఊడల ఊయెలలో మహర్షి ఉద్దాలకుడు ... ఒరగిలి వున్నాడు: గువ్వలూ పావురాలూ గుమిగా; ఏవో మంతనా లాడుతూన్నవి. ఆయన తల ఊచుతూ; మౌనంగా నవ్వుతూంటే... అంతమేరా: వెలుగులో – వెలుగు రివ్ మంటూంది–

మహర్షి పత్ని; నిదానంగా తలయెత్తి అతిథివంక చూసి...ఆ కళ్ళలో, నకనక కనిపెట్టింది. భర్తవైపు, ఒరగా చూసింది: ఆయన మెరమెచ్చుగా తలపంకిచ్చాడు: ఆ యిల్లాలు విధేయురాలై – తరలిపోతూంది:...

పసికళ్ళు ఈ వైనమంతా కనిపెడుతూన్నాయి: కాళ్ళు నిలువనిచ్చినవి కావు:

రోదసి దద్దరిల్లేట్టు హుంకరించాడు: అతిథి యీ అగ్ని గోళాన్ని చూసి ... వివశుడైనాడు – ఒక్కలిప్త – గాలికూడా ఊపిరి బిగపట్టింది...

మహర్షి కసురుతూ అన్నాడు:...

"అది ...అంతే!..."

పాపడి కాలు ... మరింత ఊది నిలచింది...

"అంతే నాయనా! – ఆడది ఆశ్రమంఫలించే ... పండూఫలం ఎంతో అంతే! – ఎవరైనా ఆకలి తీర్చుకోవచ్చును..."

బుజ్జగింపుగా, దారికి అడ్డుతప్పించి తన దగ్గిరకు తీసుకుందామని పెనగులాడాడు:

పాపడి గొంతు మహర్షి ప్రమాణానికి ఎగసింది:

"ఈ ఆడుది ... నాతల్లి!..."

నా తల్లితో, చనువుగా మెలిగే ... అధికారం, అదృష్టం – నా తండ్రిదేనని – మహర్షికి నేను మనవిచేయాలా? –

మనవి, మహర్షి వినిపించుకోలేదు...

"నీ తల్లి! – నీ తల్లీ లోకంతోపాటే – అందరు పుణ్యాంగనలూ అతిథిని కళ్ళకు అద్దుకోవడం లేదా? – ఈ మొగానే ప్రొద్దుపొడిచిందా?..."

శాంతం గర్జించింది: కాని, పసిపాపడు గాద్గదికం లేకుండా ప్రతి - పలుకుతున్నాడు:...

"ఈ మొగానే కాదు ... ఇకనుంచి ... లోకంలో తల్లులందరూ - ఇల్లాళ్ళందరూ నా తల్లితో బాటే - ఇది, నా అనుశాసనం. ఇది, శ్వేతకేతుడి అనుశాసనం: ఈ క్షణంనుంచి లోకంలో ప్రవర్తిల్లుతుంది!..."

మహర్షి హుంకరింపు - అగ్ని శిఖగా జాజ్వల్యమైంది. పసిపాపడి బ్రహ్మవర్చస్సు అంతకుమించిన వువ్వెత్తున, దీటుగా వెలిగింది...

"ఆ వ్యవస్థ - ఆ సంప్రదాయం ... ఇంతటితో అంతరించింది..."

మహర్షి ఉపశమించాడు...

"నాయనా, వ్యవస్థను ధిక్కరించే యీ అజ్ఞానం భవిష్యత్తుకు అనర్థం?-" అని అనునయంగా వివరించబోయినాడు:

"అనర్థమో-వరమో నిర్ణయించేది మనంకాదు..."

మహర్షి, పసిపాపడివంక నిశ్చలంగా చూశాడు: పాపడి చూపులకు, ఎదురు చూడలేక ... ఆశ్రమ ప్రాంగణం లోకి వచ్చి, తలఎత్తాడు - ధర్మలోపం - ప్రళయంకాదా?... చుక్కలు రాలవేం ... భూమి కంపించదేం? - ఏగతీ తప్పలేదేం? ... బ్రహ్మవేత్త మనస్సు - అనంత - అజ్ఞానంలో జ్ఞాన లవలేశాన్ని అన్వేషించుతూంది...

[కథలోంచి తెప్పరిల్లాను:

"అంతే నంటావా: తాతయ్యా!..."

తాతగారు; ఆలోచనగా తల ఊగించారు...

"*ఆహాఁ! - ఆనాడు అంతే! - ఆడదంటే కొట్టాంలో కట్టివేసిన గొడ్డుతో సమానం: ఇంట్లో వాడుకునే చెంబూ; తప్పేలాతో సమానం! ఆసామికి ఉన్న చరాస్థిలో అదో పనిముట్టు: అరుగుమీద పరచిఉండే నలిగిన చాప! - అతిథి ఎవరు వచ్చినా హాయిగా పడుకోవచ్చు:- పడి దొర్లవచ్చు:- అభ్యంతరం ఏమీలేదు - లేకపోగా ... అతిథి సత్కార సంభారాల్లో ... అవసర నైవేద్యాల్లో - ముఖ్యంగా అదొకటి!*"

అవన్నీ వత్తి గొడ్డురోజులంటావా?

ఆ మొగాళ్ళందరూ పశువులంటావా?

అది, యిప్పటి దామాయిషి ప్రకారం నాగరికత అని అనడానికే వీలులేదంటావా?

అన్నా ఫరవాలేదు; కాని ఒక్కటిమాత్రం మరచిపోకూడదు - వాళ్ళందరూ చచ్చూ పుచ్చూ చవటలా? బ్రహ్మవేత్తలు కారటయ్యా:- సరే ... వాళ్ళ జోలి మన కెందుకుగాని...

వాడి పుణ్యమా అంటూ; ఆనాడు... ఆ పసిపాపడు; ఎదురుతిరిగి అలా నోరుచేసుకుని ఉండకపోతే - యివాళటి వరకూ; ఆడది, చేట పెయ్య లాగా...ఓ మూలనుపడిఉండేదే కదః- యీ వరుసను; యిప్పటి మహిళోద్యమాలన్నీ అంకురించడానికి ఎన్ని యుగాలు పట్టేనో యింకా:-

తాతయ్య చెప్పిన ముక్కలు తెలిసినవికాని ... ఆ ధోరణిలో స్వారస్యం అర్థంకాలేదు –

"ఇంతకూ...నీవనేది..."

"నేననేది ... ఏమిటో సరిగా అర్థంకాలేదు కాదూ!– ఏంలేదు – పసిపాపల సరసం చూడగా – ఆకాలం మనసులో వెలిసింది ... పసితనం కనుకనే – యీనాడైనా; ఆడది అంత అందుబాటులో ఉంది – కాదని గద్దించేందుకు – మనం ఎవరం – పెరిగి పెద్దవాడైన తరువాత ... ఆంక్షలు కళ్ళకూ, కాళ్ళకూ ఎలాగూ ఉండనే ఉన్నాయిగా ... ఇప్పటికి యీ వైదికమూర్తులు ధన్యులు..."

"చిన్నతనం నుంచీ – వాళ్ళను దిద్దకపోతే–"

"పెద్దయిన తరువాత వంగరు – నిజమే! – అందువల్ల, వాళ్ళకు వచ్చినలోటు ఏమిటో – పితృవాక్య పరిపాలనమీద నీకు చాలా మమకారంలాగా ఉందే, చూడగా? – నీ కడుపున పుట్టినవాడు నీమాట వినకుండా ... తన మనసుకు తోచిందే చేసే పూనిక కనబరచాడంటే – నీవు కృతార్థుడవు:

చూసి సంతోషించు?–

ఇది, నాలాటివాళ్ళు తరించవలసిన ఘట్టం–" అంటూ తాతగారు, తన యిల్లాలిని కేకవేసేందుకు లోపలికి వెళ్లారు: పాపలిద్దరూ, నవ్వుతూ నన్ను కవ్వించారు: అక్కడే నిలుచుంటే వాళ్ళకడుపున పుడతానేమోనని భయంవేసి పారిపోయినాను.]

★ ★ ★

# లారి

ఏం అబద్ధం ఆడుదామా...

—అన్నయ్యతో, ఏం అబద్ధం ఆడుదామా... ఆడుతే వనరుగా ఉంటుందా అని, పావుగంటనుంచీ, ఆలోచిస్తూ కిటికీలో ఇరికి–ఇరికి కూర్చుని ఉన్నాను. ఆయన, నిదానంగా, ముఖానికి సర్వవిధాలా అడ్డంపెట్టుకుని దండక మంత... అంతకు ఇనుమడించిన భక్తితాత్పర్యాలతో హిందూ పత్రికను ఘోషిస్తూ గ్రోలుతున్నాడు.

"అ–న్న–య్యా"... మూడు అక్షరాలు... ద్విత్వంతో కలిపి... మూడు శ్రుతులుగా! సారించాను. ఆయనగొంతు ఫిడేలుతీగె పుటుక్కుమన్నట్టు ధ్వనించింది.

"మరే... "

...ఆయన, పేపర్ మడచి పొట్టకు ఆనించుకుని లేచి కూర్చునే యత్నంలో, వెన్ను, రవంత ఎగురవేసినట్లై కుర్చీకి అల్లిన పేము, గజిబిజి పడ్డది. నా నోటివెంట, ఆ తరువాత ముక్క... అంటే, సంఖ్య... పెగిలి రావడానికి, గుంజాటన పడుతూన్నది.

—ఇంతలో, హుటాహుటి నడలతో, యకాయకి లోపలికి వచ్చేసింది, టక–టక లాడుతూ – ఆ అమ్మాయి.

"మీ యిద్దరిలో ఎవరై ఉంటారు, లక్ష్మింపతిగారు?..." అని అడుగుతూనే, ఓ కుర్చీచేత అంగ యివతలికి వేయించి, దాని చేతిమీద అలవోకగా కూర్చుని, నేలకు అన్చనికాలు, ఉయ్యాల–ఊపుతూన్నది.

ప్రశ్నకు జవాబు తానే అని వీలైనంత తేట తెల్లము చేసేందుకు అన్నయ్య దేహం వల్ల మారిన హైరానుపడ్డది...

"అలాగుటండీ, అయ్యో పాపం మీరా?... అంతే కావాలిలెండి..." ఈ రెండుముక్కలూ ఆ అమ్మాయి కళ్ళు భారతమంత మేర చదివినవి. ఆ తరుణంలో మా వంశాంకురంమీద జాలిపడటంకన్న – నవ్వితే ఆ దోషం పోతుందని నా మనస్సాక్షి ఎన్నో విధాలపోరింది... కాని, యింకా నాకు అంతకు చాలిన వయసులేదు.

"మీకోసమే వచ్చానండీ:"

"మంచిది – చాలా సంతోషం..." అంటూన్నది అన్నయ్య మెదిలికలో, ఆయన పడుకున్న కుర్చీ.

"ఒక్క పదివేలు యిప్పించండి"

"పదివేలా? – ఎందుకు?"

"ఎందుకేమిటి? డబ్బు ఎందుకేమిటని అడుగుతారేమిటి ఎక్కడో – పసిపిల్ల వాడికిమల్లే... సరదాగా ఖర్చు చేసేందుకు".

అన్నయ్య మనస్సు, పాపం యీ కుర్రది ఎవరో వెర్రిది అనుకుంటూన్నదని తోచెడి...

"అలాగేనమ్మా... ఇస్తాను దానికేం మహాభాగ్యం!" అంటున్నాయి ఆ పెదవులు... రెండునిమిషాలు చీమ చిటుకు మనకముందే పిడుగుపడ్డట్టూ నోరు ఎత్తడానికి కాచుకుని ఉన్న నిశ్శబ్దంలో గడచిపోయినవి.

"దేనికీ ఆలస్యం?... అంటూంది. కొంచెం చీకాకుగా – అనంతరంబ."

"దేనికీ లేదు... "

"దేనికీ లేకపోతే... ఉంటే ఇవ్వరేం?"

"ఇస్తూంటునిగాఁ"

"ఎప్పుడో?"

"అమావాస్య వెళ్ళిన మరునాడు... ఆ మాట విన్న ఉత్తరక్షణంనుంచీ అన్నయ్య ఎన్నడు తెలుగుమాట్లాడినా తగినిచేదుగా ఉంటుంది నాకు. ఒక్కొక్కళ్ళ మాతృభాషలో అంతవిషం ఉంటుందని – నాకు అంతకుముందు ఎన్నడు అపోవలేదు."

"–ఠీక్–కాని, అది సజావుగా వెళుతుందని ఏమిటి మీకు నమ్మకం?"

అన్నయ్య కళ్లజోడు మీదికి అపక్వాపోరి – కళ చిమ్మింది... ముక్కు కొనమాత్రం "పోదూ" దాని లెక్క ఏమిటి అన్నంతగా దద్దరిల్లింది.

మరో మూడునిమిషాలు, నిశ్శబ్దంలో మౌనం... సర్వమౌనం.

"తగని ఆలస్యం అవుతూంది" అని, తనలో తాను అనుకుంటూన్నది... జ్ఞాపకం చేసుకుంటూన్నట్టు.

–"కొన్ని వేళల ఆలస్యం తొందరగానే అవుతుంది సుమీ" చిన్నప్పుడు ఎన్నడో మరచిపోయిన పాఠం అన్నయ్య గొంతులో భారసాల చేసుకుంటూన్నది.

"అలాగైతే... తెలిసిచేసే పాపమేనా దేవిభక్తులు?"

"అంటే ఏమిటో, అన్నయ్యకు ఏకోశానా, అర్థం కాలేదు... అని ఏ పాపము ఎరుగని నాకే తెలిసిందే."

"వరాలు అన్నింటికీ దేనికి దానికి ఖరీదు గట్టనేర్చిన షరాబులు –" ఇంకా అన్నయ్యకు అమాటలో అంతుచిక్కలేదు.

"షరాబు సంచీ కాలీ –" గడుసుదనంలో జవాబు అనుకుంటూనా ఇది, కాదు, మాటకుమాట పొత్తుకుదరక పుట్టిన వాఙ్మయపు – తెగులు.

"ఖాలీ అయితేనే మంచిది – మోత బరువు తప్పుతుంది. రవంత కాగితంమీద విలువు గీతగీసి నాలుగు సున్నాలు చుట్టడం చేతనవుతుందా... ధీమంతులకు?"

"తిన్న యింటి వాసాల లెక్క తేలుతుందని కాదు గాని... ఉన్నది కొంతమేర అయినా లేనిదానిలో జమ అవుతుంది..."

నాకే యీ ముక్కలకు తలాతోకా అందటంలేదు... పట్టుమని పదిముక్కల పాండిత్యానికైనా నోచుకోని అన్నయ్యకు జవాబు తలలో రాజడం తరమౌతుందా. నేను భక్తిశ్రద్ధలతో అతి – నమ్రతగా యీ నాటకాన్ని, ఆలకిస్తున్నాను.

..."ఇంకో సున్నాచుడితే లక్ష... గ్రంథం పెరుగుతుంది కాదూ..." చిన్నదాని పెదవులు మన్ననగా ఎక్కాలు వల్లిస్తున్నాయోహోయ్.

ఆ అమ్మాయి, చాలా బాగుంది కదూ.

ఆ కళ్ళు...అబ్బ...ముద్దొస్తున్నాయి కాదూ...

ఆ చెంపలు, తొలి–పూత గులాబీలు కాదూ...

ఆ గొంతు, అంతులేని – తీపి కాదూ...

ఒక్క చిందైనా చిమ్మకుండా, అందం ఏకధారను ఒలికింది కాదూ...

సన్నగా కలువరించుతూంది...

మనసుకన్నా, అంతు చిక్కనీకుండా, యెన్నడో ఈడేరే నా వయసు,

అన్నయ్య కనుసన్నల్లో ఇరకాటం యెక్కువౌతూంది. పడకకుర్చీలో పక్క కుదరకుండా, అటూ–యిటూ కదలకుండా మసలుతున్నాడు.

"ఇక్కడేం తేరగా పోసుక్కూచోలేదు..." అంటాడా చివరకు, యిందాకా రానిచ్చి, పచ్చి అజ్ఞానై?

"కళ్ళెదుట కనబడుతూంటే ఖర్చుచేయాలేమోనని భయమన్నమాట!... అంటే ఆ కొంటె కూన..."

అన్నయ్య ఎప్పుడు లేచి లోపలికి వెళ్ళిపోయినాడో, నేను గమనించలేదు. ఎవరీ చిన్నది? యెంత ముచ్చటగా ఉంది ఈ రాలుగాయతనం! అనుకుంటున్నాను, అది మరచి...

నా వంక చూసిందో లేదో, అడిగేందుకు చూపులకు భయం వేసి, తల యెత్తవద్దని బ్రతిమాలినవి.

"ప్రస్తుతం, తమరు, యెంత ధరలో ఉన్నారు?..."

–నన్ను కాదు కదా అనుకున్నాను.

"మిమ్మల్నే..."

నన్నేనని యింకా నమ్మేందుకు... యెందుకో మొగం చెల్లడం లేదు.

"పౌను యెంత ఖరీదు?"

"ఏమంటున్నా వినిపించుకోకుండా ఉంటేనో?"

"యెందుకండీ అంత బిడియం? – ఏడు మల్లెపూల ఎత్తుతూగే ఆడపిల్లలకైతే... ఎంత సొమ్ము గిట్టుతుందనే బాధ ఉండాలి. కాని... మీకు ఎందుకండీ... ఏదో ధర సిసలు చేయండి – మాటాడ రేం... ఓహో అదా సంగతి?... అంగడిలో వస్తువును అడుగుతానేమిటి – అమ్మజూపిన ఆసామి అంటూ వేరే ఉండగా... పాపం దాని కేమన్నా నోరా – వాయా?... నా తెలివి ఇంతలో ఉంది..."

నాకు అర్థం అయింది: దయచేసి మీరు యెవ్వరూ అర్థం చేసుకునేందుకు యత్నించకండి... పెద్దలు చేసే తప్పు లన్నింటికీ మేమే బాధ్యులము అనకండి బాబూ... అన్నయ్య నా పాలిటి యముడల్లే...

అమ్మయ్య!... అన్నయ్య నా పాలిటి దైవమల్లె ప్రత్యక్షమైనాడు...

"ఏదీ?" అన్నది మగరాయడిలాగా...

"ఏమిటి" అని తడబడ్డది అన్నయ్య...

"మీ చిన్నదాని పాణిగ్రహణంచేసే ధీరుడికి కట్నం కానుక"

అంత మనిషీ అన్నయ్య నీరసంగా తూలిపోతున్నాడు...

చిన్నది యెవరు? – అని అడుగడు కద, అన్నయ్య!... నన్ను శిఖండిగానైనా ఉండనియ్యడా ఏం?...

"కన్నెలకు సిగ్గరితనం అలంకారమని కన్యాశుల్కంలో వ్రాసిపెట్టనందువల్ల... నాకు అందులో నమ్మకం లేదు. వన్నెలూ—చిన్నెలూ యెవరు తెచ్చుకోకుండానే కులికే..."

"ఊఁ...కులికే..." అన్నయ్య, ఇది అనవసరంగా చేసిన ధ్వని –

"కులికే మీ బాలా కుమారుడి పలుకే బంగారమైతే... మీ పదివేలూ బాకీ తీరేందుకు... మా నాథుణ్ణి ఒక్కసారి పలుకరించితే చాలును కదండీ – జమ పడిపోతుంది! మా తండ్రి యెంత అదృష్టవంతుడండీ – కుబేరుడై పోడూ రేపీపాటికి? – పదివేలకు, దినవెచ్చంగా బారువలాది బంగారం కులికే రత్నాన్ని – పరు లెవ్వరికో అమ్మడానికి తయారుకావడం – మీకే తగునండీ – ధర సిసలేనా అని మానాన్న కనుక్కురమ్మంటే –"

గరళం పోసినవాడికి వేడి కమ్ముకుంటూన్నట్టు, అన్నయ్య కళ్ళల్లోకి క్రమంగా ప్రాణం వస్తూన్నది – ఉండుండి రెండు రెప్పలూ ఒక్కసారి అమ్మయ్యోగా ఆవలించినవి –

"అవునండీ – నేనే మీ మరదలిని" అని రంపకోత కోస్తున్నాయి ఆ అమ్మాయి చూపులు.

"అన్నయ్యకేం? అక్కడ నుంచోకుండా, తానైతే తప్పించుకుపోగలడు కాని –"

నాకు తగని సిగ్గవుతున్నదబ్బా!

ఏమైతే నేం లాభం!

ఏ జన్మకైనా – నా భార్యకు భార్యను కమ్మని – నన్ను దీవించేందుకు నోచుకోరా – నా యిలవేలపులు –

తల యెత్తిచూశాను – ఆ చిన్నది – సిగ్గుపడుతూ చిరునవ్వుగా – చీర చెంగు నా కళ్ళకు కమ్మేసి మాయమౌతుంది...

మగతనంలోకి – జన్మలో మేల్కొనకుండా పరవశించిన వైష్ణవ భాగవతులు – నాకన్న, నీకన్న – యెంత ధన్యులో తెలుసుకోవడం యెంతదారుణం!

"ఏదయ్యా! భామ?"– అన్నయ్య దహరాకాశం ఉరిమింది.

నా మనసు పెళ్ళికూతురికిమల్లె దాక్కునేందుకు, తలుపుచాటు యెక్కడా అని పొంట్లు శోధించతూన్నదని ఊహించి ఆనందించే నేర్పైనా అన్నయ్యకు లేనందుకు నాకు, యెంతో సంతోషంగా ఉంది.

– సరే కాని ఇహ అన్నయ్యను డబ్బు యివ్వమని, ఏం మొగం పెట్టుకుని అడగనూ?–

★ ★ ★

# అల్లోనేరేడు

ఎబ్బే! ఇప్పటి పట్నం మునుపటి పల్లెకాదు.

మునుపటి పల్లె అనవాలే ఇప్పుడు లేదు.

పాడూరులేదు – కూలిపోయి పునాదులు మిగిలిన గుళ్లు లేవు, గోపురాలులేవు! ఎంతలోతు తవ్వినా నిధులు లేవు, నిక్షేపాలులేవు! ఆ పరగణా హోల్ మొత్తంమీద, అప్పుడు రాలిన గింజన్నా మొక్క మొలవలేదు. అప్పటికి మొలిచిన మొక్కన్నా మానుకట్టలేదు. అనాటికి నిలిచిన మానన్నా, ఒక్క బోదెన్నా, సత్యానికి నిలువలేదు. సంజెదీపం వేళకు కళగావున్న పల్లె, మళ్ళీ చుక్కపొడిచే వేళకల్లా, ఒక్క మెయిని సురేసుకు పోయినట్టుపోయింది.

ఏమైపోయిందంటారు?

ఎండకన్నెరుగని అడకూతురు అయినవారింట పుట్టి అబ్బనాకారంగా పెరిగి, ఆ యింటఅడుగు పసుపు పారాణితో, పాపిటబొట్టుతో, చెంపన చుక్కతో, సిరులబ్బే చూపుతో యీ యింట పెట్టిన అడకూతురు చేయరాని పాపం చేయకపోయినా మోయరాని నింద మోసింది. అయ్యో పాపం! అన్నవారు లేకపోయిరి. కుయ్యో అన్నా గోడు అలకించేవారే కరువైపోయిరి. ఆ బిడ్డ ఎంత హడలిందని! ఆ తల్లి బ్రతుకు ఒక్క చిటికెలో చీకటి గుయ్యారమై పోగా ఎంత కుమిలిందని?

ఒక్క కన్ను మూసింది. ఒక్క కన్ను తెరిచింది. ఎందుకు యిచ్చావమ్మా యీ పుటుక? అంటూ కన్నతల్లిమీద గావురుమంది. కానరాని తల్లికి మొక్కుతూ గావురుమంది. తెరిచిన కన్ను నిప్పులు చెరిగింది. మూసినకన్ను ఒక్క ముత్తెం విడిచింది.

అ రవంత ముత్తెం సముద్రమంత అయింది. సముద్రం – సముద్రం ఏడు సముద్రాలంత అయింది. ఏడు సముద్రాలు ఏక ఉప్పెనైంది.

ఉప్పెనొచ్చి ఊరు ముంచెత్తింది; పోటొచ్చి పల్లెపల్లె నేలమట్టం చేసింది. ఆటొచ్చి, ఆ చీపరపాపర అంతా తుడిచిపెట్టింది.

తుడిచిపెట్టినంత మేరా – వానదేవుడొచ్చి, కల్లాపి జల్లాడు. గాలిదేవుడొచ్చి తడి ఆరబెట్టాడు. సూర్యభగవాన్లు అప్పుడు తెరపిచేసుకుని వచ్చి, భూమ్మీద ముగ్గులల్లే నెరియవిచ్చాడు. అంతే, ఆ పొద్దు మొదలాయె ఆ గడ్డమీద ప్రాణాడదు; ఆ నింగిమీద పిట్టాడదు!

పరేనయ్యా – మరి, ఆ ఆడకూతురు కొచ్చిన నిందేమిటంటారు!

అడకూతురుకి రారాని నింద!

అయిన యిల్లాలికి కలలో అన్నా రాకూడని నింద! కట్టుకున్న మారాజే తప్పుబట్టెనే – ఆ తల్లిని అంతమాటంటే పాపమన్నా తలచక పోయెనే – ఒట్టా

సత్యాలూ నమ్మక పోయెనే - ఇంకేంజెయ్య నాతల్లి? ఇంకెవరితో మొరబెట్టుకోను ఆ అమ్మ!

సీతమ్మంటే సీతామ్మవారేనయ్యా! ఆ అయ్యరాముడంటివాడేనయ్యా! అయితేనేం, మూడు పువ్వులూ ఆరుకాయలూ కావల్సిన బతుకు మూణ్ణాళ్ళ ముచ్చట అయింది; ఆ కాపురం ఆరిపోయే దీపమల్లే ఒక్కసారి భగ్గుమంది.

సీతమ్మ సిరిగల యింటపుట్టింది. సంపదున్న యింటికి వచ్చింది! ఆబిడ్డ తెచ్చిన సారె పల్లెఅంతా ముమ్మారు పంచిపెట్టినా, ఎక్కీదక్కీ మిగిలింది. రామయ్య కుటుంబం అంటారా, పరగణా పరగణాకంతా మోతుబరీ అనుకోండి; వారికి ఏంతక్కువ? గీతొక్కటే తక్కువ; బ్రహ్మరాసిన రాతొక్కటే తక్కువ!

సీతమ్మ అల్లా వైభోగంగా సార్లెతో - చీర్లెతో తర్లివచ్చింది; వెంటను, పట్టెమంచం వచ్చింది, పానుపొచ్చింది; రంగరంగ వైభోగాలొచ్చినాయ్.

తూర్పువేపు గదిలో పానుపేశారు; పడమటింట బంతులు బరి, విందులు చేసుకుంటున్నారు.

వచ్చిన చుట్టాలందరూ, జాజంబంతులు ఆడుకున్నారు.

మేజువాణీలు చేయించుకున్నారు.

తెల్లవారుజాముకి ఎక్కడవారక్కడ అలసిపోయినారు: చోటుచూసుకు సొమ్మసిల్లిపోయినారు.

సీతమ్మ అంతదాకా మేలుకుండలా! ఆ విద్దెలూ ఆ చోద్దాలూ ఆ తల్లికి నచ్చలా!

వచ్చే ఆవులింతను చిటికివేసి ఆవులించింది. అక్కడ నుంచి బద్ధకంగా లేచిపోయింది. బద్ధకంగా పోయిపోయి ఆ నిద్దురమత్తులో, అల్లాగే పక్కమీద చోటుచూచుకుని వాలిపోయింది. వాలిన పళాన నిద్దరోయింది.

ఏ మూలనో కునుకుతీసిన రామయ్యకు కోడికూత వేళకు ఎవరో వెన్ను చరిచినట్టు మెలుకువ వచ్చింది. తానున్న వెంపు చూసుకున్నాడు, తనవెంపు చూసుకున్నాడు. ఒక్క ఒళ్ళువిరుపులో, పట్టెమంచం యాదకొచ్చింది, పండంటిపిల్లది యాదకొచ్చింది. లేచి నడింవాకిలికొచ్చాడు. చుక్కలమీదికి చూశాడు. ఇంకా జాముప్రొద్దుందిగదా అనుకున్నాడు. ఉసూరుమన్న ప్రాణికి ఉత్సాహం వచ్చింది. ఒంటికి వేడొచ్చింది, చెంపకు ఒరచూపొచ్చింది. చివాల్నపోయినాడయ్యా, పానుపువేసిన గదిలోకి.

సీతమ్మ పొస్తకమల్లే ఒత్తిలి పడుకుంది, మాంచి నిద్దర్లోవుంది. అట్టె పరకాయించాడు. అడుగులో అడుగేసుకుంటూ చెంపమీద చిటికేశాడు. చిటికేసినంత చిరునవ్వు నవ్వాడు. అంతే ప్రాపతం ఆ యింటికి.

చిటికెలోనే మేలుకుంది సీతమ్మతల్లి. చిరునవ్వుకు నాగసారంవిన్న ఆడత్రాచైంది. పంచప్రాణాల్తోనూ మిడిసిపడి ఆ మెడ • కావిటేసుకుంది. ఏమో కులికింది. ఏమో గునిసింది. ముచ్చటాడేపాణెం నేరని చిన్నది మూగపోయింది. అయితేనేం గడియలతరబడి వేగిన వేగూ-సోగిన సోగూ, కనుపాప విప్పిచెప్పింది.

చెప్పిందయ్యా చిన్నదాని కనుపాప. ఆకలింపయిందయ్యా, చినవాడికి చిలక ముక్కుకు దొండపండందినట్టు, జీరుగోరికి చివురాకు అందినట్టు సుఖపడేవాడే! - సుఖపెట్టేవాడే - కాని, చిన్నది ఆ నోము నోచలేదు. చినవాడికి ఆ అదృష్టం

పట్టలేదు. తొలిముచ్చటకు కలకట్టుగా, సొక్కిసోలుతూన్న చిన్నది – అటువాలేదల్లా చటుక్కుమని ఇటుకేసి బెదిరి, త్రుళ్ళిపడి కెవ్వున కేకవేసింది.

ఆ వేసిన కేకకు ముసుగుదన్ని ఒళ్ళు తెలియని నిద్దర్లో ఉన్న ప్రాణి చింబోతల్లే ఎగిరి గంతేసింది. ఆ చింబోతు, చింబోతంటారా కాదుకాదు, రామయ్యతమ్ముడు కామయ్య. బంగారువంటి మనిషి, బంగారమంటి మనుసు – భయమూభక్తీ ఉన్న పడుచువాడు.

కెవ్వుమన్న కేకకు మెళకువవచ్చింది. అన్ననుచూశాడు వదిన్ని చూశాడు. తానున్న పానుపు చూచాడు. అయ్యో రామా అని అంగలార్చి అన్న పాదాలమీద పడిపోయినాడు. అవురుమన్నాడు. ఎంత తప్పా–తప్పని వాపోయి, తల వేల నేసి కొట్టుకున్నాడు ఆఖరికి...అన్నా! అన్నాడు: "వదినె మనింటికొచ్చిన పండగలో ఒళ్లుమరచిపోయినా, అటునుంచి వస్తున్నా, అగరొత్తులుగుప్‌మన్నాయి. ఆగిపోయినా, గుమ్మం వారకొచ్చి తొంగిచూసినా, గుమగుమా అత్తరు దీపం వెలుగుతూంది. కన్నెదర పాలమీగడల్లే పానుపు అగుపించింది. తడిమి చూసినా – తబ్బిబ్బైపోయినా, నడుం అదేవాలింది. ఒళ్ళు అదే ఆదమరచింది, మగత మగతగానేపట్టు కుచ్చులాటి శాలవా పైకి లాక్కున్నా, ఒక్క కునుకు తీసి వేద్దామనుకున్నా – మరి ఒళ్ళు తెలియలా! నా మనవి. ఇంతేనన్నా!"

కామయ్యతల ఛెళ్ళున తన్నాడు రామయ్య తండ్రి ఒళ్ళు తెలియని ఉగ్రంతో! మెడనరాలు ఫెటఫెట మెటికెలు విరిగినాయ్! అంత తాపూతిని, కామయ్య గుక్క తిప్పుకున్నాడు.

"పర్వతంలాగా పడుంటివే. కానరాలేదా తల్లీ!"అన్నాడు.

వెక్కి వెక్కి వచ్చే దుఃఖం అపుకుంటూ, "నాదైవం అనుకుంటినయ్యా! అలికిడైతే మెలుకువ వచ్చేనని పట్టి ఎల కరచుకుని పండుకున్నానయ్యా!" అన్నది సీతమ్మ.

"విన్నావుగందా అన్నా" అన్నాడు లేనిసత్తువ తెచ్చుకుంటూ. కామయ్య. అనడమేమిటి, మళ్ళీ అన్న రామయ్య మరో తన్ను తన్నడమేమిటి! తన్నిన తన్నుకు, మెడనరాలు మరిన్ని మెటికెలు విరిగినయ్ గుండెలు, నాభిదగ్గిరికి నుంగిపోయినాయి పడగ విప్పిన తాచైనాడు కామయ్య. నిదుర లేచిన సింహమైనాడు కామయ్య. ఏనుగంత సత్తువొచ్చింది. పట్టిన గుప్పిటిపట్టు విదిలించుకున్నాడు. తూలే కాలు దుయ్యపట్టుకున్నాడు. చీమైపోయి, దోమైపోయి, అంటున్నాడు గందా! "అన్నా! నామనవి ఆలకించవయ్యా!"

అన్న–రామయ్య ఏమాటా చెప్పడే – కాళ్ళా వేళ్ళా బడి బతిమాలుకుంటోన్న తమ్ముణ్ణి కన్నెత్తి చూడడే!

పోయిపోయి ఏటిఒడ్డున కూచున్నాడు. పైన గొడుగల్లె మబ్బుంది. సిగలో పువ్వల్లె సూర్యుడున్నాడు. వింజామరల్లె గరుడపక్షి ఆడుతూంది.

అడుగులో అడుగేసుకుంటూ కామయ్యొచ్చాడు: అల్లంతదూరాన సీతమ్మొచ్చింది. వచ్చి వచ్చి – మానేసుకుపోయినారు. నోటిమాట రాక – పలుకరించలేక –

జామైంది, గడియైంది రామయ్య కదిలాడు. ఒక్క ఉరు కురికాడు. తమ్ముణ్ణి పట్టుకుని గాను గాడేశాడు.

జామపండల్లే విచ్చిన గడ్డంచేత బుచ్చుకుని, కామయ్య నొష్టతో అన్నకు మొక్కాడు.

"ఒంటిఊపిరినవుంది ఈ పుటక! – ఒక్క ప్రాణమూ పుచ్చుకో అన్నా! ఉడుకుమీదున్నావ్! ఉగ్రాలమీదున్నావ్ – ఈ పళాన నన్ను తెగెయ్యకపోతే నువ్వు బతికేట్టులేవు" అని బతిమాలాడాడయ్యా!–

"ఒంటి పాన్పుమీదుంటిరే – పిల్ల మనసేయలా"

"రామరామ!"

"చెయి మీదికిపోలా?"

"చెయలేని పున్నెం తవ్వి తల కెత్తుకున్నాడు బిడ్డ–తర్లొచ్చి – పక్కను పండుకుంది. అది అన్నెం అంటావా?"

"వదిన్ను కంట జూడ లలా!"

"ఒక్క రెప్ప–"

"వల్లమాలిన చక్కంది: ఒక్క రెప్పలోనే మనసు గుంజుకు నుంటుంది! – నీవు ఓ రెప్పమ చూశావు! నేను వెయి పుటకలకని మనసిచ్చాను – నిన్ను చీల్చినా మచ్చపోతుందా?" పసిపిల్లడల్లె బావురుమన్నాడు రామయ్య! అంతతో తమ్ముడు ఉగ్రుడైనాడు.

"తల్లివయేభాగ్యం తాళికట్టి తెచ్చుకున్నవాడు దక్కనీయలా! పోనీలే అమ్మ. కన్నవారు పేరెట్టుకున్నందుకు, ఆ తల్లి కష్టాలే నీకూ వచ్చినాయా! మల్లెపూవల్లె మాయింటి కొచ్చావ్. సిగలో ముడుచుకోడం నేరకపాయె. కళ్ళనద్దుకుంటున్నా తల్లీ. మా తప్పులుకాయద్దు – మా వంగసం నిలపద్దు. శిక్షించక జాలిదలచావో వేయిపుటకలు పుట్టి వెంటాడుతా –" ఒక్క బిగివిని యీమాటలనేసి సూరడికి మొక్కి కామయ్య తూరీగల్లెపోయి ఏటిలోకలిసిపోయినాడు."

"వాడురాకుండా వాడేపోయినాడు. యింటికివస్తే ఏలుకుంటా" నన్నడయ్యా! సీతమ్మ ఉలకలా. "పల్లెకుపోతే తలెత్తుకు తిరగలేను – ఏం గందరగోళంలా ఉందో – ఎన్ని కమామేషులు పుట్టినాయో – అన్నీ నరంలేని నాలుకలు –," సీతమ్మ పలకలా!

"కాపురం పాడుచేసుకుంటావా?–" సీతమ్మ మరింత ఉగ్రంగా నవ్వింది. రామయ్య పాటేలల్లె రొప్పుకుంటూ పారిపోయినాడు. పల్లెలో కనబడ్డవాడల్లా పలుకరించాడు. కంటబడిన ఆడకూతురల్లా నిలవేసింది! ఏమైంది సీతమ్మ? ఏటొడ్డునుంది. తాను తెగించిందా నువ్వు విడిచావా? దైవానికి తెలియాలి. ఊరుకు వంక తెచ్చింది! కత్తులు లేచినాయ్. కటార్లు దూసినాయ్ – పల్లెపల్లె ఏటివారకు దండుకట్టింది.

అక్కడ సీతమ్మ తపసులో ఉంది. ధ్యానంలో ఉంది. దిగువ నేకాడనో సందడాయె. రానురాను, మందొస్తున్న అలికిడాయె. ఓరచూపు చూసింది ఒక్కకన్ను విచ్చుకుంది. పుట్టబోయే బిడ్డలు కేరుమన్నారు, తరించబోయేటి వాళ్ళు తల్లీ అన్నారు. ఏదీ వినలా, ఆడపుటకైతే యింత అలుసా అనుకుంది. కామయ్యను తలుచుకుని, నాతండ్రే అనుకుంది. ఒక్కపుటక పుట్టావ్ నన్ను ఉద్ధరించావ్. మళ్ళీ జన్మలెత్తే పనిలేదు. పగదీరుస్తున్నా బయల్లో కలిసి... అంది.

తెరచినకన్ను నిప్పులు చెరిగింది.

అందుకు ఇదీ కథ –!

★ ★ ★

# అమరావతి

వైభవ దేవేంద్రుడు, వాసిరెడ్డి వెంకటాద్రి ప్రభువు. కృష్ణకు యిద్దరి అద్దరి మాగాణం అంతా చెక్కు చెదరని ధర్మవిక్రమంతో, ప్రజలకు తండ్రిగా, పెద్దలకు విధేయుడుగా, శాసనానికి తలవరిగా, శత్రువులకు చండశాసనుడుగా, ఏలుకుంటూన్న చల్లని హాయామ్ములో–

ఎళ్ళవేళలా, ఎండనక – నీడనక, విచ్చుకత్తులవారు, బరిసెలవారు, బల్లాలవారు, వీనుమిగిలిన వీరరాహుతు లందరూ పచ్చెపువాళ్ళ బాదరబందీ, ఏ పరగణాకు సోక నీకుండా వేయికన్నులుగా వేయికివేయి బాహువులుగా, పరాక్రమాల మెలగుతూ ఉండగా –

సింగారం పొలిమేరల్లో, ఎన్ని తరాలుగానో ఊడపాదుకున్న మఱ్ఱి – నీడను ఏనాడో, తలపండిన తబిసి చిన్న పర్ణశాలలో, బుల్లి తులసీబృందావనం మయంగా, కృష్ణాజినం మీద, చిత్రాసనంమీద, దర్భాసనంమీద పద్మాసనంగా – పొద్దు పొడిచిం దెరుగక, సంజకమ్మిం దెరుగక అలా కదలని కాలూ మూసిన కన్నుగా మనకు కానరాని, అదేదో మగతలో ఉండిపోయినాడు.

చివరకు ఎన్నాళ్ళకో ఓనాడు, ఆ తబిసిగుండెల్లో, బొమముడిలో చిక్కిన వెలుగు పట్టపగ్గాలులేక, ఉబికిఉబికి పండు వెన్నెలై రెక్కలకు అందనిమేరకూ పులుగులునేరని దూరాలకూ – ఎగిసిపడి ఎగబాకి, ఆకాశగంగై వరాహస్వామి ఉద్ధరించిన చేనంతా చిలకరించింది: తబిసి కన్ను తెరిచాడు.

తానై కన్ను తెరిచాడు: తనో మనిషి ననుకున్నాడు; తన్ను తా నెరిగినాక దగలున్నాయ్ దప్పికలున్నాయ్ – దాహమైంది తబిసికి. కమండలం ఉంది – ఉదకంలేదు.

ఎవరికీ పనికిమాలిందని ఎలుగెత్తనిమౌనం ఉరుములు పెట్టున గర్జించింది.

ఆమడదూరాన లేడల్లేపోతూన్న – నీడమనిషి ఒక్క చుట్టుతిరిగి, తబిసి ముందర గిరవాటుపడి, సొమ్మసిల్లబోతూ, నేనే అయ్యా, అని ఆ పాదాలకు మనవిచేసుకున్నాడు.

"నేనంటే"

"దొంగను."

"కావేమో!"

"నాకా అనుమానం లేదయ్యా!"

పుట్టింది దొంగ కడుపున
పెరిగింది దొంగ ఒడుపున
కాదంటే నాకు అవమానం కాదయ్యా!

అది మీ అజ్ఞానం –"

తడిసి, కనపడని కదలికతో, కనురెప్పతో రవంతగా, ఆ పలుకులకూ మ్రొక్కాడు- "శపించనా!"

"కూడదయ్యా!చేసిన తపసంతా, నా పాపంమీద కత్తి పదునుగా ధారపోస్తారా!"

"శిక్షించే వరం – ఏ మహారాజుపరమో చేయండి" నీడ వెలుగులో మాయమైపోయింది.

పిండారీ మూకలు, దేశం గగ్గోలుచేస్తున్నాయ్. పరగణా అంతటా ఒకటే నరుకుల – వేట్లాట – మన్నె సుల్తానుకు ఈ బెడద చెవి సోకనీకుండా, ప్రజలే, ఏ వాడకు ఆ వాడను, ఏ సీమకు ఆ సీమను కాచుకుంటున్నారు.

సంకురాతిరి పండుగపూట, తెల్లవారకముందే వెంకటాద్రి ప్రభువు కృష్ణలో స్నానం చేస్తు ఉన్నపాటున ఉండి, ఉలికిపాటుగా "పట్టింది తాతగారూ!" అని, ధైర్యంగానే కేకవేశారు!

అల్లంత దూరాన జపం చేసుకుంటున్నారు – పాపయారాధ్యులవారు. వారు అరగన్ను గానే, "దేశానికా నీకా నాయనా!" అని తనలోతాను అనుకున్నారు.

పట్టింది మొసలే అయితే, ఆ మెలుకువ తెలుసును నాయుడికి. ఆ వేటలో తరతరాలుగా మొనగాడాయెను. కాని ఆ పట్టు మొసలిపట్టుకాదు ఆ ఒడుపు మొసలి ఒడుపు కాదు. కాలు కరకర మనలేదు. నీరు కందలేదు.

పట్టిన దొంగ పాదంవిడిచి ఉవ్వెత్తున నిలుచున్నాడు.

"ఎవరయ్యా!" అన్నారు ప్రభువులు.

"బతిమాలేందుకు పాదం పట్టినవాడినయ్యా! తల్లి కడుపున తారసిల్లాం – దానం చేయువయ్యా – దయా,జాలీ, ఆచేత, ఈచేత ధారపోయువయ్యా తండ్రీ!"

పాపయా రాధ్యులు – సందడిగా చేరువకు వస్తున్నారు – వస్తూనే సెలవిస్తున్నారు – "మరి, పలువిప్పకు మొనగాడా!"

అర్థమయ్యేట్టు చెప్పేవుసుమీ! ప్రభువులకు పాపభీతి బలిసి, పుణ్యానికి వేసగి వచ్చింది.

వెంకటాద్రినాయుడు తన మనసు ధారాదత్తం చేశాడు. దొంగ ఒక్క మునకతో ఏటిపాలైపోయినాడు.

వేటలో పట్టితెచ్చిన మృగాలనూ వేడుక చూపించడం ప్రభువులకు అలవాటు. పిండారిమూకను పట్టి తెచ్చారని పరగణా అంతటా ఒక్క చిటికెలో సాటింపు అయింది. తిరునాళ్ళకు వచ్చింది ప్రజ –

ఒక్క బారున ఒకే వెన్ను విరుపున చింతలతోపులో ఉంది పిండారిమూక. అటునుంచినరుక్కు వస్తున్నాయ్ విచ్చు కత్తులు: ఇటునుంచి నరుక్కుపోతున్నాయ్ పట్టాకత్తులు, తలలన్నీ రాలినాయ్. ఒక్క తల మిగిలింది. అక్కడ అన్ని కత్తులూ ఆగినాయ్.

ఆ తల ఝళిపించింది. ఆ కళ్ళు కత్తులు సానబెట్టినాయ్. కాని ఏ చెయ్యీ ఆడలేదు! ఏ అడుగూ ఆడలేదు!

"నాయనా!" అన్నది గొంతు:

కన్నెదుట పిలిచేది. ఆ దొంగ పిలుస్తూన్నది, – పాపయారాధ్యులు.

"అఁ" అన్నాడు నాయుడు.

చేత కత్తి అందుకుని, ఒరగా చేరువయినాడు.

"ఏం ప్రభూ! దానంపట్టినవాడు ఈవరం మీపరం చేస్తున్నాడు. ఒక్కటే విసురు!"

ప్రభువు ఇంకా జంకుమీదే ఉన్నాడు.

"నీవు పిండారీవా?"

"కాను! అంతకన్న గండడిని. ఏం అయ్యా! ఎన్నిసార్లో పట్టి తెప్పించావు పిండారిమూకను. ఎందరినో నరికించావు కాని, ఎప్పటికప్పుడే జాలిపడి అటునుంచి నరికించి ఇటు విడిచావు; ఇటునుంచి నరికించి అటు విడిచావు. నీది దయ అనుకున్నావ్. అంతకే ధర్మమనుకున్నావ్. నీ జాలి మాకు చేటుకానా; మీ ధర్మం పరగణాకు ఆపదకానా, మాటికి మాటికి మంటలు ఆర్పావే కాని, చిటిలే రవ్వల్ని ఏం చేశావ్! ఇక చాలించయ్యా! నీకు ప్రజలకన్న దైవముందా, మా మేలుకన్నా పూజ ఉందా? – ఏలే ప్రభువుకు ఎవరు వంకబెడతారు? ఎదుటపడి, ఎవరు తప్పు దిద్దుతారు? నే నొక్కణ్ణే!"

ఏలేవారి తప్పు – నా తప్పుగాదా అనుకున్నా!

"ఎన్ని పుటకలుగానో పరగణాలో దోచుకు బతికేందుకు హక్కు మాకు ఉంది. పచ్చగా ఉన్నా దోచుకుంటే అందంకాని, అల్లాడిపోయే ప్రజను చూస్తే గుండె తరుక్కుపోయింది; అటూ చేయిపోలా, నా ధరమంమీద మనసూ పోలా.

చలిదన్నా ముట్టకుండా యిటూ పడివచ్చా! మర్రిక్రింద ఓ అయ్య ముక్కు మూసుకునిఉంటే సొరబుర్రలో నీరు కాసిని పుక్కిటపట్టినా! ఆ అయ్య కన్ను తెరిపించి కసిరించుకున్నా. ఒక్క ఉరకనువచ్చి, నీ పాదంపట్టినా – దానంపట్టినా దండులో కలిసి కాళ్ళబందామల్లే ఎటూ మెసలనీకుండా – మీచేత పట్టించినా.

నరికిన పుణ్యం మీదేగాని, నరికించిన పాపం నా కెందుకూ – విసురు!–"

నాయుడు ఆ కత్తితోనే ఆ చేతు లలా జోడించి "అమరేశ్వరా!" అన్నారు తగని జాలిగా.

"విసురు!"

విసురన్న మాట విసురున, కత్తి చళుకుమనడ మేమిటి, ఆ తల ఎగిరిపడడమేమిటి!

తలలేని మొండెం తపసులో ఉన్నట్టు పద్మాసనం వేసింది – తడువుకోకుండా వచ్చి, జీవంతో వున్న వేలు ప్రభువు నొష్టను తిలకం అద్దింది, నెత్తురు జీరతో.

ఆ దొంగ ఆచోకీ లేదు. ఆచోటి కిప్పుడు ఆనవాలు లేదు; ఆ కథా కమామీషూ నిన్నా మొన్నా పుట్టినవాళ్ళకు ఎరికేలేదు!

నాయుడి పేరు శిలాక్షరంగా ఉంది! ఆ ప్రభువు ధర్మం నూటొక్క గుడిలో దివ్వై వెలుగుతూంది – ఎవరి తపసో నిలిచింది. ఎలాగో వెలిసింది అమరావతి.

★ ★ ★